# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 16 సంచిక : 6 హైదరాబాద్ 203 జూన్ 2018 పేజీలు : 68 రు. 25

- నాలుగేళ్ల తెలంగాణ పాలన - తీరుతెన్నులు తొమ్మిది వ్యాసాలు
- కర్ణాటక ఎన్నికల్లో గెలిచిందెవరు?
- గనుల కోసమే గడ్చిరోలి హత్యాకాండ
- మక్కా మసీదు కేసులో అన్యాయమైన తీర్పు
- జాతీయ మెడికల్ కమిషన్ బిల్లు
- మార్క్స్ ద్విశత జయంతి - వీక్షణం ప్రత్యేకం

నవచేతన పబ్లిషింగ్ హౌస్
ప్రచురణ




**పేజీలు : 88**

**వెల: రు. 45**

# కార్ల్ మార్క్స్

## సంక్షిప్త జీవిత చరిత్ర

## ఇ. స్తెపనోవా

**మార్క్స్ (5 మే 1818 – 5 మే 2018)**
**ద్విశత జయంతి ప్రచురణ**

ప్రతులకు :
**నవచేతన పబ్లిషింగ్ హౌస్**
ప్రముఖ పుస్తక షాపుల్లో

Advt.




**పేజీలు : 132**

**వెల : రు. 100**

# ఎదారి బతుకులు

## పల్లె కతలు

## ఎండపల్లి భారతి

ప్రతులకు :
**ఎండపల్లి భారతి,** ఫోన్ : 9652802460

నవోదయ బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్,
అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

Advt.

203

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2018

సంపుటి : 16

సంచిక : 6







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

వీక్షణం గత సంచికలో రాజేంద్రబాబు అర్వింణి రాసిన 'కారు చీకటిలో కాంతి రేఖ' వ్యాసం అమెరికాలో తుపాకీ సంస్కృతి ఎంతటి మారణ హోమాన్ని సృష్టిస్తున్నదో, దాన్ని నిరసిస్తూ ఎన్ని లక్షల మంది ఈ ప్రదర్శనలో పాల్గొన్నారో వివరాలతో వ్యాసం పొడవునా సాగింది. సామ్రాజ్యవాద దేశంలో ఆయుధాల అమ్మకాలతోనే తమ దేశం అభివృద్ధి చేసుకున్న దేశం అమెరికా. హింస దాని విధానంలోనే భాగమవుతుంది. దాన్ని రూపుమాపాలంటే ఆ వ్యవస్థనే మార్చాలనే అభిప్రాయంతో ఉండాలి. ఆ దిశలో ఈ వ్యాసంలో చర్చించలేదు. నిరసనకారుల ప్రదర్శనలతో వ్యాసం ముగిసింది.

కత్తి పద్మారావు 'ఆంధ్రప్రదేశ్‌లో కుల మత పాలన' వ్యాసం అన్ని పాయింట్లతో ఎటో కొట్టుకుపోయింది. వ్యాసంలో చర్చించిన అంశం ఒకటుంటే అన్ని విషయాలతో గందరగోళంగా తయారయింది. కొంతసేపు చంద్రబాబు పాలన గురించి కొంతసేపు నరేంద్ర మోడీ గురించి సాగి చివరికి ఎటూ తేల్చక అంబేద్కర్ ఆలోచనా పునాదుల మీద నిర్మించుకున్నపుడే భారతదేశం వెలుగుల సవ్వడి అని ముగుస్తుంది. వ్యాసం చర్చ అనేది ఒక పద్ధతిగా ఉంటే బాగుంటుంది. అలా లేనట్లయితే పాఠకులు పేజీలు తిప్పుతూ ముందుకు సాగుతారు. మే నెల ఎక్కువ వ్యాసాలు ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల చట్టం గురించి దళితులపై రోజురోజుకు జరుగుతున్న అత్యాచారాలపై చాలా వ్యాసాలు చర్చించాయి. అయితే ప్రతీ ఒక్క వ్యాసం ఆ సమస్యల్ని ఏ మార్గం ద్వారా పరిష్కరించుకోవాలి ఒక్క రిజర్వేషన్ ద్వారానే దళిత సమస్యకి శాశ్వతంగా పరిష్కారం కలిగించలేదనే విషయం దళితులు అర్థం చేసుకోవాలి. రిజర్వేషన్ అనేది తాత్కాలికమైనది అదే ఎప్పుడు ఉండడమంటే ఎల్లప్పుడూ కొంత మందికే ఉన్నతమైన పరిస్థితులు కలిగి ఉండడం అవుతుంది. ఆ దిశలో ఏ ఒక్క వ్యాసం చర్చించలేదు. మార్క్స్ స్మృతిలో ఎంగెల్స్ మాటలు ఉపన్యాస వ్యాసం బాగుంది.

– ప్రకాశ్
టిటాగడ్

వీక్షణం మే సంచికలో మార్క్స్ ద్విశత జయంతి సందర్భంగా వచ్చిన వ్యాసాలన్నీ కూడా మార్క్స్‌ను, మార్క్సిజాన్ని కొత్తతరం అర్థం చేసుకోవడానికి చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. మార్క్స్ కృషి ఫలితంగా వెలుగులోకి వచ్చిన మార్క్సిస్ట్ సిద్ధాంతం పీడిత ప్రజల విముక్తికి ఒక ఆయుధంగా మారిన విధానాన్ని చాలా వివరంగా చెప్పిన రచయితలకు అభినందలు. మార్క్స్ కృషి, సిద్ధాంతాల గురించిన వ్యాసాలను పాఠకులకు అందించిన వీక్షణంకు కృతజ్ఞతలు.

– ఎస్. తిరుమలేష
నిజామాబాద్

వీక్షణం మే సంచికలో కార్ల్ మార్క్స్ ద్విశత జయంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసాలు బాగున్నాయి. ముఖ్యంగా మార్క్స్ స్మృతిలో ఎంగెల్స్ మాటలు, గంగాధర్ వ్యాసం 'మార్క్స్ జీవితం, సిద్ధాంతం, పోరాటం', డా. నళిని వ్యాసం 'మార్క్సిజం విశ్వజనీన సత్యం', కార్మికుల అధ్యయనానికి మార్క్స్ ప్రశ్నావళి' ఎంతో విశ్లేషణాత్మకంగా అనిపించాయి. కొన్ని వ్యాసాలు అర్థం కాలేదు. అలాగే ఎ. పున్నయ్య వ్యాసం 'తెలంగాణపై కాగ్ నివేదిక' చాలా బాగుంది. తెలంగాణ ప్రభుత్వం అబద్ధపు ప్రచారాలను విప్పిచెప్పింది. ప్రభుత్వం ఎలా ప్రజలను మభ్యపెడుతున్నదో గణాంకాలతో సహా వివరంగా చెప్పారు.

– బి. కిరణ్
వరంగల్

మే సంచికలో వచ్చిన తెలంగాణ సంపాదకీయం నిజంగానే తెలంగాణ జన సమితికి ఒక హెచ్చరికగానే ఉంది. ప్రస్తుత రాజకీయ పరిస్థితుల్లో ప్రజాకాంక్షను విస్మరిస్తూ ప్రజలను మళ్లీ మళ్లీ మోసం చేయాలని చూస్తున్న పాలకులకు ప్రత్యామ్నాయంగా నిలుస్తుందా? లేక అదే పంచన చేరుతుందా అనేది ముందు ముందు తెలుస్తుంది. అలాగే ఆంధ్రప్రదేశ్ సంపాదకీయంలో చంద్రబాబు నాలుగేళ్లుగా ప్రజలను ఎంతగా మభ్యపెడుతున్నాడో, మాటలతో మోసం చేస్తున్నాడో వివరంగా చెప్పారు. నాలుగేళ్లుగా బిజెపి పంచన చేరి వారి అడుగులకు మడుగులొత్తుతూ, ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో ప్రత్యేక హోదా అంటూ మరో నాటకానికి తెరతీశారు.

– ఎ. సమ్మయ్య
కరీంనగర్

వీక్షణంలో ఎం. గంగాధర్ 'మార్క్స్ జీవితం, సిద్ధాంతం, పోరాటం' వ్యాసం బాగుంది. అభినందనలు.

– భూపతి వెంకటేశ్వర్లు
హైదరాబాద్

వీక్షణం మే సంతోష్ వ్యాసం 'చరిత్రాత్మక మహారైతు లాంగ్‌మార్చ్' వ్యాసం బాగుంది. ఈ స్ఫూర్తితో దేశవ్యాప్తంగా రైతులు, ప్రజాసంఘాలు కదిలి వ్యవసాయ రంగాన్ని కాపాడుకోవాల్సిన ఆవశ్యతను ఈ వ్యాసం తెలియజేసింది. వీక్షణం వారు వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న సంక్షోభంపై మరిన్ని వ్యాసాలు ప్రచురించాలని కోరుతున్నాను. ముఖ్యంగా తెలంగాణ ప్రాంతానికే పరిమితం కాకుండా ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న పరిణామాలపై వ్యాసాలు వేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

– మత్తిన విఘ్నేశ్వర్లు
విశాఖపట్నం

వీక్షణంలో వచ్చే సంపాదకీయాలు, సంపాదకీయ వ్యాఖ్యలు, వ్యాసాలు జరుగుతున్న పరిణామాల పట్ల ఒక అవగాహనను అందించేవిగా ఉంటున్నాయి. కొన్ని వ్యాసాల్లో మాత్రం సమాచారం ఎక్కువగా ఉంటుంది. మొత్తంగా చూసినపుడు సమకాలీన అంశాలను ఎటువంటి ప్రలోభాలకు లోనుకాకుండా ప్రజలకు అందిస్తున్నారు. ప్రతి సంచికలోనూ వేస్తున్న కార్టూన్‌లు చాలా సామాజిక అంశాలను ప్రతిబింబించేలా ఉంటున్నాయి.

– రంజిత్
హైదరాబాద్

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# రాజ్యస్వభావానికి అద్దం పడుతున్న హత్యాకాండలు



వీక్షణం పది సంవత్సరాలకు పైగా సమాజ అనారోగ్యాన్ని చిత్రించే అసహజ మరణాల జాబితాను ప్రతి నెలా ప్రచురిస్తున్నది. నిజానికి సమాజంలో ఇంత పెద్ద ఎత్తున అసహజ మరణాలు జరుగుతుండడం, విలువైన మానవశక్తి ఇలా ధ్వంసం అయిపోతూ ఉండడం, ఈ మానవ హననానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాలకవర్గాల బాధ్యత ఉండడం మామూలుగానే ఆలోచనాపరులందరినీ కదిలించవలసిన విషయాలు. వ్యవస్థ ఆరోగ్యం గురించి ఆందోళనను ప్రేరేపించవలసిన అంశాలు. అనారోగ్య మరణాల రూపంలో, ఆత్మహత్యల రూపంలో, ప్రమాదాల రూపంలో జరుగుతున్న ఈ అసహజ మరణాలకు తోడు స్వయంగా ప్రభుత్వాల సాయుధ బలగాలు, ప్రభుత్వాలు పోషిస్తున్న కిరాయి మూకలు జరుపుతున్న హత్యాకాండలు ఇటీవలి కాలంలో పెచ్చరిల్లిపోతున్నాయి. ఇటువంటి హత్యాకాండలు చరిత్రలో అనేకదేశాల్లో ఫాసిజం విస్తరణలో భాగంగా జరిగాయి. అందుకే ఈ హత్యాకాండలు ఈ దేశంలో ప్రజాస్వామ్యం గురించి, చట్టబద్ధ పాలన గురించి ఆలోచించేవారందరినీ కలచివేస్తున్నాయి.

గత నెల రోజులలో పాలకవర్గాలు ఉద్దేశపూర్వకంగా జరిపిన మూడు హత్యాకాండలు – ఒకటి మధ్య భారతంలో గడ్చిరోలి జిల్లాలో, మరొకటి చత్తీస్‌గడ్‌లోని బిజాపూర్ జిల్లాలో, మరొకటి దక్షిణ భారతంలో తూత్తుకుడిలో – రాజ్య స్వభావానికీ, దుర్మార్గానికీ అద్దం పడుతున్నాయి. ఆ హత్యాకాండలు జరపడానికి కారణాలు, హత్యాకాండలు జరిగిన తీరు, హత్యాకాండల తర్వాత పాలకవర్గాలు సమర్థించుకుంటున్న తీరు చూస్తే ఇవాళ దేశంలో కొనసాగుతున్నది కార్పొరేట్ ప్రయోజనాల కోసం సాగే ఫాసిస్టు హింసాత్మక ప్రభుత్వమని స్పష్టంగా బైట పడుతున్నది. మొత్తంగా అరవై నిండు ప్రాణాలను బలిగొన్న ఈ మూడు హత్యాకాండల్లో ప్రజలు అడిగిందల్లా తమ వనరులనూ, ఆరోగ్యాలనూ, పర్యావరణాన్నీ పరిరక్షించమని మాత్రమే. పాలకవర్గాలే రాజ్యాంగంలో, చట్టాలలో ప్రకటించిన ఉదాత్త ఆదర్శాలను అమలు చేయమని మాత్రమే. న్యాయవ్యవస్థ ఇచ్చిన తీర్పులను గౌరవించమని మాత్రమే. అటువంటి కనీస ఆకాంక్షలతో ప్రజలు జరుపుతున్న ప్రయత్నాలకూ, నిరసనలకూ, పోరాటాలకూ పాలకవర్గాల ప్రతిస్పందన దుర్మార్గంగా, హంతక దాడులుగా ఉంది. ఈ హత్యాకాండలు ఈ వ్యవస్థ మనుగడ గురించి, పాలకవర్గాలలో పెరిగిపోతున్న అమానవీయత గురించి, తాము రాసుకున్న చట్టాల పట్ల తమకే గౌరవంలేని స్థితి గురించి చేదువాస్తవాలను వెల్లడిస్తున్నాయి.

మొదట ఏప్రిల్ 22-23 రాత్రి మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా బోరియా-కస్నాసుర్ అడవిలో మహారాష్ట్ర పోలీసులకు చెందిన కమాండో-60 బలగాలు, కేంద్ర రిజర్వ్ పోలీసు బలగాలు కూంబింగ్ జరుపుతుండగా వారికీ మావోయిస్టులకూ మధ్య జరిగిన ఎదురు కాల్పులలో పదహారు మంది మరణించారని పోలీసులు ప్రకటించారు. మర్నాటికల్లా ఇంద్రావతి నదిలో మరొక పదిహేను మృతదేహాలు దొరికాయన్నారు. అలా క్రమక్రమంగా మృతదేహాల సంఖ్య పెంచుతూ పోయి, ఈ హత్యాకాండలో మృతుల సంఖ్య చివరికి 40కి చేర్చారు. వీరిలో పందొమ్మిది మంది స్త్రీలు, ఎక్కువమంది ఆదివాసులు. ఈ ప్రాంతంలో బహుళ జాతి సంస్థలకు, ప్రత్యేకంగా ఖనిజ తవ్వకాల కంపెనీలకు, లాయిడ్ మైనింగ్ కార్పొరేషన్ అనే కంపెనీకి వ్యతిరేకంగా, మొత్తంగా గనుల తవ్వకానికి వ్యతిరేకంగా రెండు దశాబ్దాలుగా పోరాడుతున్న ఆదివాసులను, వారికి బాసటగా నిలిచిన మావోయిస్టులను ఉద్దేశ పూర్వకంగా చంపడానికే, ఆదివాసులను భయభ్రాంతులను చేయడానికే ఈ హత్యాకాండ జరిగింది. మరొక ఘటనలో ఏప్రిల్ 27న చత్తీస్‌గడ్‌లోని బిజాపూర్ జిల్లా ఇపెంట గ్రామ సమీపంలో చత్తీస్‌గడ్ పోలీసులు, తెలంగాణ గ్రేహౌండ్స్, సిఆర్‌పి బలగాలు కలిసి ఆరుగురు స్త్రీలతో సహా ఎనిమిది మంది మావోయిస్టులను, ఆదివాసులను చంపివేశారు. ఇక్కడ కూడ తమ వనరులను బహుళజాతిసంస్థలకు దోచిపెట్టే ప్రభుత్వ విధానాలను వ్యతిరేకిస్తున్న ఆదివాసులను బెదిరించడానికే ఈ హత్యాకాండ. ఈ రెండు సంఘటనల్లోనూ ప్రభుత్వ బలగాలు అత్యాధునిక ఆయుధాలు వాడాయి, విషప్రయోగం చేశాయి. హత్యానంతరం కూడ చాలమంది మృతులను గుర్తించడం కూడ జరపకుండా ఉద్దేశపూర్వకంగా మృతదేహాలు కుళ్లిపోయేలా చేశాయి. హత్యానంతరం హంతక బలగాలు ఆనందోత్సాహాలు ప్రకటించుకున్నాయి.

వాదన కోసం ఆ ఘటనల్లో సాయుధ మావోయిస్టులను ఎదుర్కోవడానికి బలప్రయోగం చేయవలసి వచ్చిందని అన్నా, తమిళనాడులోని తూతుకుడిలో ప్రభుత్వ సాయుధ బలగాలు మే 22న కాల్పులు జరిపి నిరాయుధులైన, శాంతియుతంగా ప్రదర్శన జరుపుతున్న పదమూడు మందిని బలిగొన్నాయి. వారు చేసిన నేరమల్లా, స్థానికంగా ఉన్న స్టెరలైట్ ఇండస్ట్రీస్ కర్మాగారం వదులుతున్న విష రసాయనాల వల్ల తమ పొలాలూ నీళ్లూ గాలీ కలుషితం అవుతున్నాయని, అమలులో ఉన్న చట్టాల ప్రకారమే ఆ పరిశ్రమను నియంత్రించమనీ కోరడమే. వంద రోజులుగా వేలాది మంది ప్రజలు ఈ ఆందోళన కొనసాగిస్తున్నారు. ఆ కంపెనీని మూసివేయమని అడుగుతున్నారు. ఈ పరిశ్రమ ఏర్పాటు చేసిన 1994 నుంచీ కూడ అక్రమాలకు, చట్ట ఉల్లంఘనకు నిలయంగా ఉంది. అది చట్టాలను ఉల్లంఘించిందనీ, కాలుష్యానికి కారణమవుతున్నదనీ ప్రభుత్వ సంస్థలు, న్యాయస్థానం నియమించిన సంస్థలు నివేదికలు ఇచ్చాయి. పరిశ్రమను మూసివేయవలసిందేనని 2010లోనే మద్రాసు హైకోర్టు తీర్పు ఇచ్చింది. ఆ తీర్పు మీద సుప్రీం కోర్టు స్టే ఇచ్చి, పరిశ్రమ కొనసాగించవచ్చునంది. ఈ పరిశ్రమ పాలకవర్గాల సన్నిహితుడు, వేదాంత రిసోర్సెస్ అనే నరహంతక బహుళజాతి ఖనిజ వ్యాపార సంస్థ అధిపతి అనిల్ అగర్వాల్ కు చెందినది కావడమే వారి బారాఖూన్ మాఫ్‌కూ, వారి తరఫున పోలీసులు పదమూడు మంది ప్రాణాలు బలిగొనడానికీ కారణం.

ఈ దేశంలో ప్రజల కొరకు, ప్రజల వల్ల, ప్రజల చేత అమలయ్యే ప్రజాస్వామ్యం లేదనీ, కార్పొరేట్ల కొరకు, కార్పొరేట్ల వల్ల, కార్పొరేట్ల చేత సాగే దళారీ స్వామ్యాన్నే నడపాలనీ అటు పాలకులకూ తెలుసు. ఇటు ప్రజలకూ రోజురోజుకూ ఎక్కువగా తెలుస్తున్నది. తెలియవలసిందీ, తాము ఏ పక్షమో తేల్చుకోవలసిందీ మధ్యతరగతి బుద్ధిజీవులే. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# భూయజమానులందరూ 'రైతు'లేనా?

తెలంగాణ ప్రభుత్వం అట్టహాసంగా, మామూలు అట్టహాసం కూడ కాదు, దేశంలోని అన్ని ప్రచార సాధనాలకూ వందల కోట్ల రూపాయల వ్యాపార ప్రకటనలు ఇచ్చి మరీ, 'రైతుబంధు' పథకం ప్రకటించింది. రూపం చూసి భ్రమపడే వాళ్లు, సారం దాకా వెళ్లే ఓపిక లేనివాళ్లు, మాటలే నిజమనుకునే వాళ్లు ఈ రైతుబంధు పథకానికి ప్రశంసలు కురిపిస్తున్నారు. నిజమే, ఈ దేశంలో ఈ రాష్ట్రంలో వ్యవసాయ రంగానికి, రైతులకు ఇంకా ఎక్కువ సహాయం అందవలసిందే. రైతులు ఇవాళ ఎదుర్కొంటున్న అనేక సమస్యల నుంచి వారిని గట్టెక్కించవలసిందే. కాని కారణం మంచిదైనంత మాత్రాన ఆ కారణాన్ని చూపెట్టి చేసే ప్రతి పనీ మంచిది కానక్కరలేదు. స్వార్థప్రయోజన, స్వప్రయోజన శక్తులు కూడ సరైన కారణాలనే ముందు పెట్టి తమ దుష్ట ప్రయోజనాలను కాపాడుకుంటాయి. ఇవాళ మన సమాజంలో వ్యవసాయం గిట్టుబాటు కాకుండా పోయిందని, రైతుకు సహాయం అందించవలసిందనీ అంగీకరించని వారుండరు. కాని రైతు అంటే ఎవరు అనేది మౌలికమైన ప్రశ్న. వ్యవసాయం చేసేవారినే రైతు అనాలని కనీస ఇంగితజ్ఞానం ఉన్నవాళ్లెవరైనా ఒప్పుకుంటారు. కాని మహాఘనత వహించిన తెలంగాణ ప్రభుత్వ దొరతనము వారికి మాత్రం రైతు అంటే భూయజమాని అనే నిర్వచనం మాత్రమే తెలుసు. ఆరుగాలం కష్టపడి చివరికి శ్రమ ఫలితం కూడ దక్కని రైతుకు కాదు, కేవలం కాగితాల మీద భూమికి యజమానిగా ఉన్న వ్యక్తికి రైతు అని పేరుపెట్టి ఆ రైతులకు అప్పనంగా ప్రజాధనం అప్పగించడానికి ఏలినవారు తయారుచేసిన పథకం ఈ రైతుబంధు. అందువల్లనే ఈ రైతుబంధు పథకంలోకి నిజంగా సాగుచేస్తున్న కౌలుదారులు రాలేదు, తాతతండ్రుల నుంచి వచ్చిన భూమికి యజమానిగా వ్యవహరిస్తూ, గ్రామంలో కూడ ఉండకుండా పట్టణాల్లో ఉంటూ, వ్యాపారాలు వృత్తులు ఉద్యోగాలు చేస్తూ ఇతర ఆదాయమార్గాలున్న వారు హఠాత్తుగా రైతులు అయిపోయారు. మన గ్రామసీమలలో కనీసం ముప్పై శాతం వ్యవసాయం కౌలుదారుల చేతుల్లోనే ఉన్నది. నిజంగా సాగు ఇబ్బందులను ఎదుర్కొంటున్నది వారు. సహాయం పొందవలసిన అవసరం, హక్కు ఉన్నవారు వారే. కాని ఏలినవారి పథకంలో వారికి స్థానం లేదు. అంతే కాదు, రైతుబంధు నిధులలో అత్యధిక భాగం దక్కనున్నది "పెద్దరైతులు"గా పేరుపడిన భూస్వాములకే తప్ప, నిజంగా వ్యవసాయం కోసం అష్టకష్టాలు పడుతున్న చిన్న, సన్నకారు, మధ్యతరగతి రైతులకో కాదు. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే, రాష్ట్రంలో 86 శాతం చిన్న కమతాల చేతిలో 55 శాతం భూమి (34,36,132 ఎకరాలు), 11 శాతం మధ్యతరగతి కమతాల చేతిలో 25.5 శాతం భూమి (15,85,134 ఎకరాలు), 3.3 శాతం పెద్ద కమతాల చేతిలో 19 శాతం భూమి (11,75,559 ఎకరాలు) ఉంది. అంటే రైతుబంధు పథకం కింద ఒక కొసన చిన్న రైతులకు రు. 1374 కోట్లు, మధ్యతరగతి రైతులకు రు. 634 కోట్లు, పెద్దరైతులకు రు. 470 కోట్లు అందనున్నాయి. నిజంగా సాగుచేసే రైతులకు కాదు, కౌలుదార్లకు కాదు, పంట సాయానికి కాదు, కేవలం వ్యవసాయంతో ఏ సంబంధమూ లేని, భూయాజమాన్యం మాత్రం ఉన్న అధికారపార్టీ ఆశ్రితులకు ప్రధానమైన లాభం చేకూర్చడానికే ఈ పథకం తయారయింది. ఎక్కడో ఒకటో రెండో బొట్లు విదిలితే చిన్న, మధ్యతరగతి రైతుకు అందవచ్చు గాని అవి వారి వ్యవసాయ సమస్యల పరిష్కారానికి ఎందుకూ పనికిరావు. అలా పనికిరాని, తమ ఆశ్రితుల బొక్కసాలు నింపే పథకాలను ప్రజాపథకాలుగా నమ్మించి వంచించడంలో తెలంగాణ ప్రభుత్వం అన్ని రికార్డులనూ అధిగమిస్తున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# తిరుమలలో పోగుబడ్డ ఆస్తులెవరివి?

ప్రజాస్వామిక పాలనలోనో, ప్రజాసమస్యల పరిష్కారం విషయంలోనో కాదు, విచిత్రమైన వివాదాలతో వార్తలకెక్కాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించుకున్నట్టున్నది. భక్తిరసం తెప్పలుగా పారుతున్న తెలుగునాట, ఆపద మొక్కులవాడని, వడ్డికాసులవాడని పేరున్న వేంకటేశ్వర స్వామికి, తిరుమల తిరుపతి దేవస్థానానికి ఇబ్బడి ముబ్బడిగా నిధులు అందడంలో ఆశ్చర్యమేమీ లేదు. అలా లెక్కాపత్రం లేకుండా వచ్చి పడుతున్న నిధులు ఎక్కడ ఉంటే అక్కడ అవినీతి, అక్రమాలు, అడ్డదారులు, దొంగతనాలు, బందిపోట్లు సాధారణమే. ఆ నిధుల గురించి లేని భగవంతుడు ఎలాగూ మాట్లాడడు. ఆ నిధుల కైంకర్యం గురించి మాట్లాడితే కళ్లుపోయేంత అపచారమని భక్తులు కళ్లు మూసుకుంటారు. ఇక దోచుకున్నవాడికి దోచుకున్నంత. ఈ వ్యవహారం ఎప్పటి నుంచి జరుగుతున్నదో, నిర్ణయాధికార స్థానాలలో ఉన్న ఎవరెవరు ఎంత భోంచేశారో బహుశా ఎప్పటికీ బైటపడకపోవచ్చు. కాని తోడుదొంగల్లో అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు ఇటువంటి రహస్యాల్లో అరకొర అయినా మూసిన పిడికిట్లో నుంచి జారి బైటపడతాయి. అలా పురోహితుల మధ్య ఘర్షణ, ఒక పురోహితుడి పట్ల మితిమీరిన ఆదరణ, మరొక పురోహితుడి పట్ల నిరాదరణ తిరుమల ఆస్తుల కందిరీగ తుట్టెను కదిల్చాయి. ఎప్పుడో మైసూరు మహారాజా వేంకటేశ్వర స్వామికి ఇచ్చిన వజ్రం లాంటిదే ఇటీవల జెనీవాలో వేలం పాటలో కనబడిందని ఒక ప్రధాన అర్చకుడు బాంబు పేల్చాడు. మొత్తం రాజకీయ పక్షాలు, ఆస్తిక శిఖామణులు, భక్తులు రెండు వర్గాలుగా మారి ఒకరి మీద ఒకరు బురద జల్లుకుంటున్నారు. ఇన్నాళ్లూ దాచిన రహస్యాలలో కొన్ని అయినా బైటికి వస్తున్నాయి. నువ్వు దొంగ అంటే నువ్వు దొంగ అని ఇద్దరు దొంగలు కొట్లాడుకుంటుంటే అందరి దొంగతనమూ తెలిసిన సమాజానికి బాగుంటుంది. అయితే ఇంత వివాదంలో కూడ ఇది దైవభక్తికి సంబంధించిన విషయం కాబట్టి అసలు సమస్యలు, అసలు ప్రశ్నలు వెలికి రావడం లేదు. ఇంతకీ తిరుమలలో తరతరాలుగా పోగుబడ్డ ఆస్తులు ప్రభుత్వానివా, అధికారులవా, అర్చకులవా, ప్రభుత్వాధినేతలో అధికారులో అర్చకులో ఆ ఆస్తులను స్వయంగా వాడుకోవడానికో, దేశాలు దాటించడానికో అధికారం ఉందా అనే ప్రశ్నలు రావడం లేదు. తిరుమలలో పోగుబడిన ఆస్తులలో అత్యధిక భాగం పేద, మధ్యతరగతి ప్రజలు మూఢభక్తితో, నమ్మకంతో హుండీలో వేసిన చెమటా నెత్తురూ అని, దానిలో కొంతభాగం సంపన్నులు వేసినది కూడ ఉంటే అది కూడ వారి అక్రమార్జనలో ఒక భాగమే అయి ఉంటుందని గుర్తించవలసి ఉంది. అది ప్రజల సంపద. నడుస్తున్నది ప్రజా ప్రభుత్వం కూడ కాదు గనుక ఆ ఆస్తులను ఆక్రమించడానికి ప్రభుత్వానికీ, దాని అధికారులకూ అధికారం లేదు. అర్చకులు కేవలం అక్కడ పూజాదికాలు నిర్వర్తించే ఉద్యోగులు గనుక, జీత భత్యాలు పొందుతున్నారు గనుక ఆ ఆస్తుల మీద వారికీ అధికారం లేదు. ఆ ఆస్తులు న్యాయంగా ప్రజలకు చెందాలి. పంపిణీ చేస్తే భక్తుల మనోభావాలు దెబ్బతింటాయనుకుంటే, కనీసం ఆ ఆస్తులను ప్రజల విద్యా, ఆరోగ్య, సంక్షేమ కార్యక్రమాల కొరకు ఖర్చు పెట్టాలి. వీ

# అమెరికా కుట్రలు అధిగమించి వెనిజులాలో మళ్లీ మదురో

– ఎ. నరసింహారెడ్డి

**లా**టిన్ అమెరికాలో బొలివేరియన్ విప్లవానికి కీలకమైన వెనిజులాలో మే 20న జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో ప్రస్తుత సోషలిస్టు అధ్యక్షుడు నికోలస్ మదురో మరో ఆరేళ్ల అధ్యక్ష పదవీకాలానికి తిరిగి ఎన్నికైనారు. హ్యూగో ఛావెజ్ రాజకీయ వారసుడిగా 2013లో వెనిజులాలో అధికారానికి వచ్చిన నికోలస్ మదురో గత ఆరు సంవత్సరాలుగా ఇంటా బయటా అనేక సమస్యలను ఎదుర్కొన్నాడు. ప్రధాన ఆదాయ వనరైన చమురు ధరలు గణనీయంగా పడిపోవడంతో దేశ ఆర్థిక పరిస్థితి చిక్కులో పడింది. దేశ జిడిపి 45 శాతం పడిపోయింది. దేశంలో ద్రవ్యోల్బణం పెరిగింది. అనేక వస్తువుల కొరత ఏర్పడింది. అమెరికా విధించిన ఆంక్షలు, అత్యవసర సరుకులు బ్లాక్ మార్కెట్లోకి పోవడం, చట్టవిరుద్ధమైన కరెన్సీ చలామణిలోకి రావడం, చమురు ధరలు పతనం కావటంతో ప్రభుత్వానికి తీవ్ర సమస్యలు ఎదురయ్యాయి. ప్రజల్లో తీవ్ర అసంతృప్తి తలెత్తింది. చావెజ్ హయాంలోనూ, తరువాత మదురోకు వ్యతిరేకంగానూ పని చేసిన ప్రతిపక్ష పార్టీలు అమెరికా ప్రోత్సాహంతో సంవత్సరకాలంగా 'డెమోక్రటిక్ యూనిటీ రౌండ్ టేబుల్' పేరుతో ఒకటిగా వ్యవహరిస్తున్నాయి. ఎన్నికల్లో పాల్గొనాలా వద్దా అనే విషయంలో దానిలో రెండు అభిప్రాయాలు వెల్లడయ్యాయి. పోటీ చేస్తే మదురో పాలన చట్టబద్ధమైనదే అని అంగీకరించినట్టు అవుతుందని ఎన్నికల బహిష్కరణకు పిలుపునిచ్చారు. హెన్రిక్ కాప్రిల్స్ గతంలో అధికార దుర్వినియోగానికి పాల్పడిన కారణంగా పదిహేనేండ్లు ఎన్నికల్లో పోటీ చేయటానికి అనర్హుడయ్యాడు. మరోనేత లియోపాల్డో లోపెజ్ పలుకేసులలో నిందితుడిగా ఉండటంతో గృహనిర్బంధంలో ఉన్నాడు. ఈ పూర్వరంగంలో ఎన్నికలను బహిష్కరించాలనే నిర్ణయాన్ని హెన్రీ ఫాల్కన్ వ్యతిరేకించి బయటకు వచ్చి స్వతంత్రుడిగా పోటీ చేశాడు.

వెనిజులా ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా ఆయిల్ ఎగుమతులపై ఆధారపడింది. అంతర్జాతీయంగా క్రూడ్ ధరలు తగ్గడంతో వెనిజులా ఆర్థిక వ్యవస్థ తీవ్రంగా దెబ్బతింది. ప్రజల కష్టాలు పెరిగాయి. వేలాది మంది వలస వెళ్లారు. ఈ సంక్షోభాన్ని ఆసరాగా చేసుకొని మితవాద ప్రతిపక్షాలు మదురో అధ్యక్ష పదవీ నుంచి వైదొలగాలని సంవత్సరకాలంగా అల్లర్లు లేవదీశాయి. ఈ నేపథ్యంలో జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో 46 శాతం మాత్రమే ఓట్లు పోలయ్యాయి. ఎన్నికల బహిష్కరణ పిలుపు తక్కువ పోలింగుకు కారణం కావచ్చు, కాని ఛావెజ్ సాధించిన ఫలితాలను తిరుగదోడటానికి ప్రజలు అంగీకరించలేదన్నది కూడా వాస్తవమే. పోలైన ఓట్లలో మదురోకు 67.7 శాతం ఓట్లు లభించగా ఆయన ప్రధాన ప్రత్యర్థి మాజీ సైనిక అధికారి లారా రాష్ట్ర మాజీ గవర్నర్ హెన్రీ ఫాల్కన్‌కు 21.2 శాతం, మత ప్రచారకుడు జేవియర్ బెర్టుస్సీకి సుమారు 11 శాతం ఓట్లు లభించాయి. దేశ కరెన్సీని డాలర్‌గా మార్చుతానని, చావెజ్ జాతీయం చేసిన చమురు కంపెనీలను తిరిగి యజమానులకు అప్పగిస్తానని, ఐఎంఎఫ్ నుండి దండిగా రుణం సాధిస్తానని, మానవతా సహాయాన్ని అనుమతిస్తానని ప్రచారం చేసిన ఫాల్కన్ వాగ్దానాలను ప్రజలు తిరస్కరించారు. లాటిన్ అమెరికాలో వామపక్ష ప్రభుత్వాలకు నిత్యం అమెరికా కుట్రలు, కుహకాల ముప్పు వెన్నాడుతూనే ఉంటుంది. దోపిడీ వ్యవస్థలను విధ్వంసం చేయకుండా వాటిని అలాగే కొనసాగిస్తూ తమకున్న వెసులుబాటు మేరకు అమలు జరుపుతున్న సంక్షేమ చర్యలకు పరిమితులు వచ్చినప్పుడు జనాలలో అసంతృప్తి తలెత్తటం, దానిని మితవాద శక్తులు వినియోగించుకోవడం ఇటీవలి కాలంలో చూశాం. అందువలన పెట్టుబడిదారీ వ్యవస్థ సంస్కరణబాటను వదలి విప్లవాత్మక చర్యలు తీసుకొనేందుకు పూనుకుంటేనే లాటిన్ అమెరికా వామపక్షాలకు భవిష్యత్ ఉంటుంది. వీ





❖ **అష్ఫాఖ్–బిస్మిల్‌ల అద్భుత అమరగాథ** – 'విజయవిహారం' రమణమూర్తి – జైభారత్ పబ్లికేషన్స్ – 298 పేజీలు, 1/4 క్రౌన్, రు. 350



❖ **కుల వ్యతిరేక పోరాట యోధులు–లోహియా** – రమణమూర్తి – 'విజయవిహారం' సమర్పణ – జనహర్ష పబ్లిషర్స్ – 54 పేజీలు, 1/8 డెమీ, రు. 25



❖ **విస్మృత వీరులు – పరమవీర చక్ర అబ్దుల్ హమీద్** – 'విజయవిహారం' రమణమూర్తి – జైభారత్ పబ్లికేషన్స్ – 26 పేజీలు, 1/8 డెమీ, రు. 20
పై మూడు ప్రతులకు: జైభారత్ పబ్లికేషన్స్, ఇ.నెం. 3–8–437, మన్సూరాబాద్, చంద్రపురి కాలనీ, ఎల్.బి. నగర్, హైదరాబాద్–500074; సెల్: 9848019076



❖ **ఐనా ప్రయాణం**–కవిత్వం – డా. రూప్‌కుమార్ డబ్బీకార్ – తెలంగాణ రచయితల సంఘం – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ఇ.నెం. 5–5–212/5, సాయికృప అపార్ట్‌మెంట్స్, ఫ్లాట్ నం. 102, పటేల్‌నగర్, నాంపల్లి, హైదరాబాద్ – 500 001



❖ **సామెతల సప్పరము** – హోసూరు కతలు – అగరం వసంత్ – కృష్ణగిరి జిల్లా తెలుగు రచయితల సంఘం – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: డా. ఎన్. వసంత్, 2/1097, బస్తి, ఆవులపల్లి రోడ్డు, హోసూరు–635 109, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు; ఫోన్: 09488330209



❖ **భూమి దుఃఖం** – ఉపరితల గనుల వ్యతిరేక కవిత్వం – సంపాదకులు: నల్లెల్ల రాజయ్య – వరంగల్ రచయితల సంఘం – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నల్లెల్ల రాజయ్య, ఇ.నెం. 7–1–384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ – 506 001



❖ **నీలమొక్కటి చాలు...** – కవిత్వం – ఎం.కె. సుగమ్‌బాబు – న్యూలైఫ్ ప్రజంటేషన్స్ – 92 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఎం.కె. సుగమ్‌బాబు, 502, సాయితేజ ఎన్‌క్లేవ్, వెంకట్రామ్‌నగర్, సూరారం, ఖుత్బుల్లాపూర్ (మం), హైదరాబాద్ – 500 055 ఫోన్: 8096615202



❖ **నల్ల చామంతి** – కవిత్వం – చిత్తలూరి సత్యనారాయణ – పాలపిట్ట బుక్స్ – 224 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: చిత్తలూరి సత్యనారాయణ, డి.రేపాక (గ్రా. పో) అడ్డ గూడూరు మండలం, యాదాద్రి భువనగిరి జిల్లా – 508 277



❖ **బతుకు బంతి** – కథలు – డా. శాంతి నారాయణ – విమలా శాంతి ప్రచురణలు– 166 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **కొత్త అక్షరాలమై...** 'అకవిత్వ' కవితా సంపుటి – డా. శాంతి నారాయణ – విమలా శాంతి ప్రచురణలు– 158 పేజీలు, 1/8 డెమీ, రు. 150
పై రెండు ప్రతులకు: శ్రీమతి ఆర్. విమల, 202, ఎస్ఎస్ అపార్ట్‌మెంట్స్, మారుతీనగర్, అనంతపురం – 515001; ఫోన్: 08554–278277, 99166 71962, 80749 74547;
ఈమెయిల్:vimalasanthi9@gmail.com



❖ **ఆదర్శజీవులు** – గొలుసుకట్టు నవల – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 45



❖ **ప్రజల్లో శ్రీశ్రీ** – సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 45



❖ **మారుమ్రోతలు** – శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 60
పై మూడు ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ–04 ఫోన్: 0866–6617375, 9848504649
ఈమెయిల్:srisri_sahityanidhi@yahoo.com



❖ **సౌందర్య సంగమం** – నవల – సి.ఎస్. రావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **తెన్నేటి సూరి రచనలు** – మూడవ సంపుటం – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 222 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **శ్రీమద్భగవద్గీత** – ఉపదేశగీత – అక్షరవాచస్పతి డా. దాశరథి రంగాచార్య ఆఖరి వ్యాఖ్య – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 262 పేజీలు, 1/4 క్రౌన్, రు. 225
పై మూడు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్ట్, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్–68; ఫోన్: 24224453 / 54
ఈమెయిల్:navachethanaph@gmail.com

# కర్ణాటక ఎన్నికల్లో గెలిచిందెవరు?

***అవినీతి, అక్రమాల్లో కూరుకుపోయిన బిజెపి కర్ణాటకలో అధికారమే పరమావధిగా అక్రమమార్గాల ద్వారా అధికారంలోకి రావాలని చూసిందని అంటున్నారు* నుగునూతుల యాకయ్య**

దక్షిణ భారత రాజకీయాల్లో కీలక రాష్ట్రమైన కర్ణాటకలో ఓటర్లు విలక్షణ తీర్పునిచ్చారు. ఏ ఒక్క పార్టీకి పూర్తిస్థాయిలో మెజార్టీ కట్టబెట్ట లేదు. ఈ ఎన్నికల్లో కుల, మత రాజకీయాలతో పాటు డబ్బే ప్రధానంగా పనిచేసింది. ప్రాంతాలవారీగా మిశ్రమ ఫలితాలు వెలువడ్డాయి. ఏ పార్టీ కూడా అన్ని ప్రాంతాల్లో మెజార్టీ సీట్లు సాధించలేక పోయింది. ప్రజలు ఒక్కో ప్రాంతంలో ఒక్కో పార్టీకి పట్టం కట్టారు. వొక్కలిగ, లింగాయత్ సామాజిక వర్గాల ప్రాబల్యం కర్ణాటకలో ఎక్కువగా ఉండడంతో బిజెపి, కాంగ్రెస్, జెడిఎస్ పార్టీలు ఆయా వర్గాలను ప్రసన్నం చేసుకునేందుకు హామీలు కురిపించాయి. మాజీ ముఖ్యమంత్రి, కాంగ్రెస్ నేత సిద్ధరామయ్య లింగాయత్‌లను ఆకర్షించేందుకు వారికి 'ప్రత్యేక మత హోదా'ను ఇస్తామని ప్రకటించారు. అయినప్పటికీ మత విశ్వాసాల ప్రాతిపదికన మతోన్మాదాన్ని రెచ్చగొడుతూ రాజకీయాలు నడుపుతున్న బిజెపి పార్టీ ముఖ్యమంత్రి అభ్యర్థి యడ్యూరప్ప తమ సామాజిక వర్గానికి చెందిన వ్యక్తే కావడంతో అటువైపే మొగ్గు చూపినట్లు తెలుస్తోంది. లింగాయత్ వర్గం ఎక్కువగా ఉన్న ప్రాంతంలో బిజెపి అభ్యర్థులే గెలవడం ఇందుకు నిదర్శనం. అలాగే వొక్కలిగ సామాజిక వర్గానికి చెందిన హెచ్.డి. దేవేగౌడ, ఆయన కుమారుడు కుమారస్వామి, కాంగ్రెస్ నేత డి.కె. శివకుమార్ తదితరులు తమ సామాజిక వర్గం ఓట్లు చీలకుండ జాగ్రత్తపడ్డారు. ఇక తెలుగు మాట్లాడే, తెలుగు వారు ఉన్న ప్రాంతాల్లో మిశ్రమ ఫలితాలు వెలువడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇవ్వనందుకు బిజెపికి వ్యతిరేకంగా ఓటు వేయాలని ఏ.పి. ముఖ్యమంత్రి చంద్రబాబు పిలుపునివ్వగా.. ఫెడరల్ ఫ్రంట్లో భాగంగా జె.డి.(ఎస్)కు మద్దతు పలికిన తెలంగాణ ముఖ్యమంత్రి కెసిఆర్ తెలుగువారు ఆ పార్టీకి ఓటు వేయాలని కోరారు. అయినా తెలుగువారు ఎక్కువగా నివసించే ప్రాంతాల్లో బిజెపి గతంలో కంటే మెరుగైన ఫలితాలు సాధించింది.

1985 నుంచి ఇప్పటి వరకు కర్ణాటక ఓటర్లు అధికారంలో ఉన్న పాలక పార్టీని ఓడించి, మరో పార్టీకి పట్టం కడుతున్నారు. కానీ కర్ణాటకలో గత నాలుగేళ్లుగా పరిస్థితులు గతంలోలాగా లేవు. కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చాక కర్ణాటకలో లౌకిక, ప్రజాస్వామిక శక్తులపై దాడులు పెరిగాయి. హేతువాది కల్బుర్గీ, నీతికి, నిజాయితీకి మారుపేరైన సీనియర్ జర్నలిస్టు గౌరీలంకేశ్ హత్య మొదలైన ఘటనలు చూశాక బిజెపి ఏకఛత్రాధిపత్యం బలహీనపడాలని, ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షానికి కూడా బలమైన ఉనికి ఉండాలని అనేక సంస్థలతోపాటు వ్యక్తులు కోరుకున్నారు. దేశాన్ని రక్షించాలంటే బిజెపిని ఓడించండి అంటూ సినీనటుడు ప్రకాశ్‌రాజ్ రాష్ట్రవ్యాప్తంగా ప్రచారం చేశారు. ఇవన్నీ బిజెపికి ఓట్లు తగ్గడంలో ప్రధాన పాత్ర పోషించాయి.

**పార్టీలన్నింటికి పాస్ మార్కులే.. !**

తమను పాలించే మెజార్టీని ప్రజలు ఏ పార్టీకైనా ఇస్తున్నారా ? అంటే లేదనే చెప్పొచ్చు. మొత్తం ఓటర్లలో కనీసం సగం మంది కూడా ఏ ఒక్క పార్టీని పూర్తి స్థాయిలో విశ్వసించడం లేదు. మొత్తం 224 అసెంబ్లీ సీట్లు ఉన్న కర్ణాటకలో 222 స్థానాలకు ఎన్నికలు నిర్వహించారు. ఇందులో 104 సీట్లను గెల్చుకున్న బిజెపికి కేవలం 36.7 శాతం ఓట్లు రాగా, 78 సీట్లను గెల్చుకున్న కాంగ్రెస్‌కు 38.1 శాతం ఓట్లు వచ్చాయి. 38 సీట్లు గెల్చుకున్న జెడిఎస్‌కు 17 శాతం ఓట్లు పడ్డాయి. 1/3 ప్రజల మద్దతు మాత్రమే కూడగట్టగలిగిన ఈ పార్టీలపై మిగతా 60 శాతం ప్రజలకు సదభిప్రాయం లేదనే అర్థం చేసుకోవచ్చు. అలాంటప్పుడు పార్లమెంటరీ పార్టీలు చెప్పుకుంటున్న ఎన్నికల విజయాలు మెజార్టీ ప్రజల ఆకాంక్షలను ఎలా ప్రతిబింబిస్తాయన్నదే లక్ష డాలర్ల ప్రశ్న. డబ్బు, మద్యం ఎవరు ఎక్కువగా ఓటర్లకు పంచగలిగితే వారినే విజయం వరిస్తున్న ఎన్నికల ప్రజాస్వామ్యంలో పోలింగ్ బూత్ మెట్లెక్కని ఓటర్ల సంఖ్య కూడా 10 శాతం ఉండడం కూడా చర్చించాల్సిన విషయమే. ఇదిలా ఉంటే పోటీలో ఉన్న ఏ అభ్యర్థి నచ్చకపోవడంతో పోలింగ్ బూత్ వరకు వెళ్లి నోటా ఆప్షన్ను వేలాది మంది ఓటర్లు వినియోగించుకోవడం గమనార్హం.

ఓట్లు కాంగ్రెస్ కంటే తక్కువగానే వచ్చినప్పటికీ సీట్లు ఎక్కువ రావడంతో బిజెపి పెద్ద పార్టీగా అవతరించింది. కౌంటింగ్ జరుగుతున్న సమయంలో ఒక దశలో సొంతంగానే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తుందనే స్థాయిలో ఆధిక్యం ప్రదర్శించింది. కానీ గంటగంటకూ మారిన లెక్కలు.. బిజెపి ఆశలపై నీళ్లు చల్లాయి. తాము ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయకపోయినా బిజెపిని అధికారానికి దూరంగా ఉంచడంతోపాటు.. భవిష్యత్తు అవసరాల మేరకు కాంగ్రెస్ వేగంగా పావులు కదిపింది. కీలకనేతలను రంగంలోకి దింపి జెడిఎస్ అధినేత దేవేగౌడతో మంతనాలు జరిపింది. మూడో స్థానంలో ఉన్న జెడిఎస్‌కు బేషరతు మద్దతు ప్రకటించింది. అప్పటి వరకు ఎన్నిక క్షేత్రంలో ఉప్పునిప్పులా ఉన్న కాంగ్రెస్–జెడిఎస్ ఒక్కటి కావడం బిజెపికి మింగుడు పడలేదు. అప్పటి వరకు ఏదో ఒకటి చేసి, కొందరు ఎంఎల్ఏలను కొనేసి అధికారంలోకి వస్తామన్న ధీమాతో ఉన్న బిజెపి నాయకత్వం కాంగ్రెస్ ప్రకటనతో ఖంగుతిన్నది. ఇక ఆ క్షణం నుంచి కర్ణాటకలో చోటుచేసుకున్న పరిణామాలు బిజెపి నిత్యం వల్లించే నీతి, నిజాయితీ, అవినీతి, దేశభక్తిలాంటి నినాదాలు ఆ పార్టీ దృష్టిలో బూటకమని తేల్చేశాయి. నిర్ణీత మెజార్టీ సీట్లు లేకపోయినా సీఎంగా యడ్యూరప్ప ప్రమాణ స్వీకారం చేయడమనేది కేంద్రంలో అధికారంలో ఉన్న బిజెపి అధికార దుర్వినియోగానికి, గవర్నర్ వ్యవస్థలోని డొల్లతనానికి నిదర్శనంగా నిలిచింది. ఈ వ్యవహారంలో ఆ రాష్ట్ర గవర్నర్, ఒకప్పటి బిజెపి ఎంఎల్ఏ

వాజుభాయి రుదాబాయి వాలా తాను రాజ్యాంగబద్ధ పదవిలో ఉన్నాననే విషయం మరిచి సంఘ్ కార్యకర్తలా వ్యవహరించారు. మెజార్టీ లేదనే విషయం తెలిసి కూడా మెజార్టీ నిరూపణకు 15 రోజుల గడువు ఇవ్వడమంటే ప్రత్యర్థి పార్టీల ఎంఎల్ఏలను ప్రలోభపెట్టడానికి సమయం ఇవ్వడమేననే విషయం స్పష్టంగా అర్థమవుతోంది.

అయితే అప్పటికే గోవా, మేఘాలయ, మణిపూర్ రాష్ట్రాల్లో ఎక్కువ సీట్లు సాధించినప్పటికీ అధికార పీఠం ఎక్కలేకపోయిన కాంగ్రెస్ పార్టీ గత అనుభవాల నేపథ్యంలో కర్ణాటకలో దూకుడుగా వ్యవహరించింది. బిజెపి చేస్తున్న మతతత్వ, అరాచక రాజకీయాలను అడ్డుకోవడం, మరో రాష్ట్రం ఆ పార్టీ పాలనలోకి వెళ్లకుండా చూడడమే లక్ష్యంగా 38 సీట్లున్న జెడిఎస్‌కు అనూహ్యంగా మద్దతిచ్చి ప్రభుత్వ ఏర్పాటుకు కాంగ్రెస్ హామీ ఇచ్చింది. అలాగే మరో బిఎస్‌పి ఎంఎల్ఏతోపాటు, స్వతంత్ర ఎంఎల్ఏ జెడిఎస్‌కు మద్దతుగా నిలిచారు. అయినప్పటికీ యడ్యూరప్పను సిఎంగా ప్రమాణ స్వీకారానికి గవర్నర్ ఆహ్వానించడంతో వెంటనే అప్రమత్తమైన కాంగ్రెస్ పార్టీ సుప్రీంకోర్టు మెట్లెక్కింది. బిజెపికి సుప్రీంకోర్టులో ఊహించని ఎదురుదెబ్బ తగిలింది. మెజార్టీ నిరూపణకు గవర్నర్ ఇచ్చిన కాలవ్యవధిని సర్వోన్నత న్యాయస్థానం కుదించింది. మే 19న 4 గంటలకే అసెంబ్లీలో బలపరీక్ష నిర్వహించాలని ఆదేశించింది.

బలపరీక్షకు గడువు లేకపోవడంతో దేశ ప్రధాని మోదీ, బిజెపి జాతీయ అధ్యక్షుడు అమిత్‌షా గనుల కుంభకోణంలో జైలుకెళ్లి వచ్చిన సోదరద్వయం గాలి జనార్ధన్‌రెడ్డి, గాలి శ్రీనివాసులును రంగంలోకి దింపారు. వారితోపాటు ముఖ్యమంత్రి యడ్యూరప్ప, బిజెపి జాతీయ ప్రధాన కార్యదర్శి మురళీధర్‌రావు రంగంలోకి దిగి నేరుగా ఎంఎల్ఏలతో బేరసారాలు జరిపారు. ఈ కుట్రలను ముందే పసిగట్టిన కాంగ్రెస్ పార్టీ నేతలు ఎంఎల్ఏల ఫోన్లలో కాల్‌రికార్డింగ్ యాప్ ఇన్‌స్టాల్ చేయించారు. దీంతో నలుగురు ఎంఎల్ఏలతో సదరు నాయకులు మాట్లాడిన మాటలన్నీ రికార్డయ్యాయి. రూ.100 కోట్లు, మంత్రి పదవులను ప్రతాపగౌడ పాటిల్ లాంటి ఎంఎల్ఎలకు ఎరవేశారు. బలపరీక్షకు ముందే ఎంఎల్ఎల కొనుగోలు యత్నాల వాయిస్ రికార్డులను ఒక్కొక్కటిగా కాంగ్రెస్ పార్టీ మీడియాకు విడుదల చేయడంతో దేశవ్యాప్తంగా బిజెపి అప్రతిష్టపాలైంది. చివరికి బలపరీక్షకు ముందే ముఖ్యమంత్రి యడ్యూరప్ప తన పదవికి రాజీనామా చేస్తూ గవర్నర్‌కు లేఖ సమర్పించడంతో బిజెపి మూడు రోజుల పాటు నడిపిన హైడ్రామాకు తెరపడినట్లయింది. ఈ మూడు రోజుల ఎపిసోడ్లో ఆ రాష్ట్ర గవర్నర్ వాజుభాయి పక్కా ఆర్ఎస్ఎస్ కార్యకర్తగా పనిచేసిన విధానాన్ని దేశమంతా చూసి నివ్వెరపోయింది.

**ముచ్చటగా మూడోసారీ..**

ఇప్పటి వరకూ యడ్యూరప్ప మూడుసార్లు సిఎం పదవి చేపట్టారు. కానీ, ప్రతిసారి రాజకీయ కారణాలతో ఆ పదవి నుంచి అర్ధాంతరంగా తప్పుకోవడమో లేదా ప్రభుత్వం రద్దు కావడమో జరిగింది. తాజా రాజీనామాతో నిజలింగప్ప తర్వాత అత్యధికసార్లు పూర్తికాలం పదవిలో లేని సిఎంగా యడ్యూరప్ప కొత్త రికార్డు సృష్టించారు. తొలిసారిగా 2007 నవంబర్ 12న సిఎం కుర్చీలోకి వచ్చిన యడ్యూరప్ప వారం రోజుల్లోనే రాజీనామా చేశారు. నాడుకూడా ఆయన రాజీనామాకు కుమారస్వామియే కారణం కావడం గమనార్హం. ఆ తర్వాత 2008 మే 30న ముఖ్యమంత్రి పీఠం అధిష్టించిన యడ్యూరప్ప, 2013 మే 5 వరకు ఆ పదవిలో కొనసాగారు. ఆ తర్వాత అనూహ్య పరిణామాల నేపథ్యంలో రాజీనామా చేశారు. ఆయన తర్వాత సదానంద గౌడ, జగదీశ్ షెట్టర్ ఆ పదవిలో కొనసాగారు. తాజాగా 2018 మే 17న నాటకీయ పరిణామాల నేపథ్యంలో అధికారం చేపట్టిన యడ్యూరప్ప రెండు రోజులు (55 గంటలు) సిఎంగా కొనసాగి మే19న రాజీనామా చేశారు. ఈ రాజీనామాకు కూడా కుమారస్వామే కారణం కావడం గమనార్హం. ఇప్పటి వరకు కర్ణాటకలో అత్యధిక సార్లు పూర్తికాలం లేని సీఎంగా నిజలింగప్పకు స్థానం ఉంది. ఈయన నాలుగు సార్లు సీఎంగా పనిచేసినా.. ఎప్పుడూ పూర్తికాలం పదవిలో కొనసాగలేదు. తొలి అసెంబ్లీలో కె.సి.రెడ్డి, హనుమంతయ్య, మంజప్పతో కలిసి అధికారం పంచుకున్నారు. రెండో అసెంబ్లీలో బిడి జెట్టితో, మూడో అసెంబ్లీలో ఎస్. ఆర్కాంతితో, నాలుగో అసెంబ్లీలో వీరేంద్రపాటిల్‌తో కలిసి నిజలింగప్ప సీఎం పదవిని పంచుకున్నారు. కర్ణాటకలో 15 అసెంబ్లీల్లో పూర్తికాలం ముఖ్యమంత్రులుగా కొనసాగినవారు ఎస్.ఎం. కృష్ణ, సిద్ధరామయ్య మాత్రమే. వారిద్దరూ కాంగ్రెస్‌కు చెందిన వారే కావడం విశేషం.

కర్ణాటకలో బిజెపి అనుసరించిన అతిపెద్ద పార్టీ సిద్ధాంతాన్ని గోవా, మణిపూర్, మేఘాలయ, బిహార్ రాష్ట్రాల్లోని అతిపెద్ద పార్టీలు తమ ఆయుధంగా మల్చుకున్నాయి. కర్ణాటక తరహాలో తమకే ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం ఇవ్వాలని గోవా, మేఘాలయ, మణిపూర్‌లో ప్రతిపక్ష కాంగ్రెస్ పార్టీ, బిహార్‌లో ఆర్‌జెడి అక్కడి గవర్నర్‌లను డిమాండ్ చేశాయి. మొత్తం 40 మంది సభ్యులు ఉన్న గోవా అసెంబ్లీకి గతేడాది జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ 17 స్థానాలతో అతిపెద్ద పార్టీగా అవతరించింది. అయితే ప్రభుత్వ ఏర్పాటుకు కావాల్సిన మ్యాజిక్ ఫిగర్ 21 మాత్రం రాలేదు. దీంతో 14 సీట్లు వచ్చిన బిజెపి.. గోవా ఫార్వర్డ్ పార్టీ (ఎంజిపి), స్వతంత్ర్య అభ్యర్థుల (మొత్తం 9 సీట్లు) సాయంతో ఎన్నికల అనంతరం కూటమిగా ఏర్పడింది. అతి పెద్ద పార్టీని వదిలేసిన గవర్నర్ బిజెపికే ప్రభుత్వ ఏర్పాటుకు అవకాశం ఇచ్చారు. మేఘాలయ, మణిపూర్‌లో కూడా కాంగ్రెస్‌కు ఇదే అనుభవం ఎదురైంది. తాజాగా కర్ణాటక గవర్నర్ నిర్ణయంతో ఆయా రాష్ట్రాలకు చెందిన అతిపెద్ద పార్టీ నేతలు తమ రాష్ట్రాల గవర్నర్లను కలిసి ప్రభుత్వ ఏర్పాటుకు ఆహ్వానించమని, సమయమిస్తే తాము కూడా బలం నిరూపించుకుంటామని వినతిపత్రాలు సమర్పించడంతో బిజెపి ఆత్మవిమర్శలో పడాల్సిన పరిస్థితి నెలకొంది.

బిజెపి నేతలు కర్ణాటక ఎన్నికల ఫలితాలు తమ మతతత్వ రాజకీయాలకు, అసహన పోకడలకు, కార్పొరేట్ శక్తుల అనుకూల విధానాలకు ఆమోద ముద్ర అనుకుంటే పొరబాటే. పైకి దేశభక్తి, జాతీయత అని నీతులు వల్లించే బిజెపి అధికారం కోసం ఎంతటి అవినీతి చరిత్ర ఉన్న నాయకులనైనా తమ పార్టీలోకి చేర్చుకుంటుందనే విషయం కర్ణాటక రాజకీయాలను చూస్తే అర్థమవుతుంది. అవినీతికి మారుపేరైన గాలి సోదరులు, యడ్యూరప్పలాంటి వాళ్లు లేకుండా ఎన్నికల్లో గెలుపు అసాధ్యమని భావించే బిజెపి వారికి పెద్ద పీట వేసింది. అంతేగాక అప్పటి వరకు రాష్ట్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీపై ఉన్న వ్యతిరేకత కూడా బిజెపికి అనుకూలంగా మారింది.

కాంగ్రెస్ వృద్ధ నేతల్లో యువ ఓటర్లను ఆకర్షించే నేతలు రోజురోజుకు తక్కువైపోతున్నారు. కాంగ్రెస్ ఎన్నికల వ్యూహాలు కూడా జనానికి పాతబడిపోయాయి. బిజెపి ఎన్నికల వ్యూహాలు అధునాతనమైనవి,

# గనుల కోసమే గడ్చిరోలి హత్యాకాండ

**మావోయిస్టుల ఏరివేత పేరుతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న ఎన్‌కౌంటర్లన్నీ హత్యలేననీ, బహుళజాతి కంపెనీలకు వనరులను ధారాదత్తం చేసేందుకు చేస్తున్న ఈ మారణహోమంలో ఆదివాసులు తీవ్రంగా నష్టపోతున్నారనీ అంటున్నారు ఎన్. నారాయణరావు**

మహారాష్ట్ర గడ్చిరోలి జిల్లాలో 2018, ఏప్రిల్ 22న బోరియా, కసన్‌సూర్ అటవి ప్రాంతం, ఇంద్రావతి నది ఒడ్డున ఎన్‌కౌంటర్ జరిగిందని ఇందులో సుమారు 40 మంది వరకు మావోయిస్టులు మరణించారని పోలీసులు ప్రకటించారు. ఈ ఘటనపై నిజనిర్ధారణలో భాగంగా ప్రజాస్వామిక హక్కుల సంఘాల సమన్వయ సంస్థ (సిడిఆర్ఓ), మహిళలపై రాజ్య, లైంగిక హింసల వ్యతిరేక సంస్థ (డబ్ల్యుఎస్ఎస్), భారత ప్రజా న్యాయవాదుల సంఘం (ఐఎపిఎల్) సంస్థలకి చెందిన 44 మంది సభ్యులు 2018 మే 5,6,7 తేదీలలో గడ్చిరోలి జిల్లా బోరియా, కసన్‌సూర్, గట్టేపల్లి, గట్ట, కోయిన్‌వర్షి, రెకర్నార్, రాజారాం కాండ్ల గ్రామాల అడవీ ప్రాంతాలలో పర్యటించారు.

గడ్చిరోలిలో ఏప్రిల్ 22 నుండి 24 వరకు జరిగిన హత్యాకాండలో ఖచ్చితమైన సంఖ్య తెలియకుండా 50గా సంఖ్యను ఊహించు కుంటున్నాం. అందులో గట్టేపల్లి గ్రామస్థులు ఎనిమిది మంది. వారు మంగేష్ ఆత్రం (25), ఇరప మడావి (18), మంగేష్ బుజ్జి మడావి (18), అనిత గావడె (17), ఉస్సే మడావి (16), రాసోసుకు మడవి (20), బుజ్జి ఊసేండి, రాసోపోచ మడావి (15), ఐదుగురు మహిళలు, ముగ్గురు పురుషులు హత్య చేయబడ్డారు.

గడ్జిరోలి జిల్లా 1982లో ఏర్పడింది. అంతకు ముందు చంద్రపూర్ జిల్లాలో అంతర్భాగంగా ఉండేది. మహారాష్ట్రకి దక్షిణ తూర్పు ప్రాంతంలో ఉంది. గడ్చిరోలికి పశ్చిమాన చంద్రపూర్ జిల్లా, ఉత్తరాన గోండియా జిల్లా, తూర్పున ఛత్తీస్‌గడ్ రాష్ట్రం, దక్షిణాన తెలంగాణ రాష్ట్రం సరిహద్దులుగా ఉన్నాయి. గడ్చిరోలి జిల్లా మూడు సబ్ డివిజన్‌లుగా విభజించబడి ఉంది. గడ్చిరోలి, అహిరి, దేసాయగూడ, ఈ మూడు సబ్ డివిజన్లు ఒక్కొక్కటి నాలుగు తాలుకాలుగా ఏర్పాటు చేశారు. గడ్చిరోలి సబ్‌డివిజన్, గడ్చిరోలి, దనోరా, చమోర్శి, ముల్‌చర తాలూకాలుగా ఏర్పాటయ్యాయి. అహిరి సబ్‌డివిజన్ అహిరి, సిరోంచ, ఈటపల్లి, బాంబ్రాగాడ్ నాలుగు తాలూకాలుగా ఏర్పాటయ్యాయి. దేశాయిగూడ్ (దీనికి మరో పేరు వాడ్సా) సబ్‌డివిజన్, వాడ్సా, అర్మోరి, కుర్‌చెడ, కార్చి తాలూకాలుగా విభజించారు. గడ్చిరోలి జిల్లా 467 గ్రామ పంచాయితీలను కలిగి ఉంది. ఇందులో 1,688 రెవెన్యూ గ్రామాలు, 12 పంచాయితీలున్నాయి. ఈ జిల్లాలో 3 అసెంబ్లీ నియోజకవర్గాలున్నాయి – గడ్చిరోలి, అర్‌మోరి, అహిరి. ఈ జిల్లా పూర్తిగా నది పరివాహక ప్రాంతం కలిగి ఉన్న జిల్లా. గోదావరి నది పశ్చిమం నుండి తూర్పుకు ప్రవహిస్తుంది. దక్షిణ సరిహద్దుగా గోదావరి నది ఉంటుంది. ఈ గోదావరి నదిలో ప్రధాన భాగాలుగా ఇంద్రావతి, ప్రాణహిత నదులుంటాయి. ఇంద్రావతి నది గడ్చిరోలి జిల్లాకు, ఛత్తీస్‌గడ్ రాష్ట్రానికి సరిహద్దుగా ఉంటుంది. ధనోరా, ఈటపల్లి, అహిరి, సిరోంచ తాలూకాలు తూర్పున ఉన్న అడవీ ప్రాంతాలను కవర్ చేస్తాయి. బాంబ్రాగడ్ ప్రాంతం పూర్తిగా గుట్టలతో నిండి ఉంటుంది. ఇందులో తిప్పగడ్, పలాసగడ్, సూర్జాగడ్ ఉంటాయి.

2011 జనాభా లెక్కల ప్రకారం 10,72,942 గా ఉంది. ఇందులో అక్షరాస్యత 77 శాతంగా ఉంది. షెడ్యూల్డ్ జాతుల జనాభా 3,71,696 కాగా, షెడ్యూల్డ్ కులాలవారు 1,08,824 ఉన్నారు. ఈ జిల్లాకు ఒక ప్రత్యేకత ఉంది. ఈ జిల్లాలో ఏడు భాషలు మాట్లాడే ప్రజలు జీవిస్తున్నారు. ప్రధానంగా గోండి, మాడియా, మరాఠి, హిందీ, తెలుగు, బెంగాలి, ఛత్తీస్‌గడ్ భాషలు ఉన్నాయి. గడ్చిరోలి జిల్లా 79.36 శాతం అడవితో నిండి కొండ ప్రాంతాన్ని కలిగి ఉన్న జిల్లా. 2006లో పంచాయితీరాజ్ మంత్రిత్వ శాఖ గడ్చిరోలి జిల్లాను బాగా వెనుకబడిన జిల్లాల జాబితాలో చేర్చి దాన్ని మహారాష్ట్రలో 12వ జిల్లాలో ఇది ఒక జిల్లాగా గుర్తించి వెనుకబడిన రీజియన్స్ నిధులను సమకూర్చే పథకం కింద (బిఆర్‌జిఎఫ్) నిధులు విడుదల చేశారు. ఈ గడ్చిరోలి జిల్లా విదర్భ ప్రాంతానికి చెందినదైనప్పటికి ఇక్కడ ఆత్మహత్యలు లేకుండా ప్రజలు జీవిస్తున్నారు. పోరాటాలు ఉన్న దగ్గర విజయాలు ఉంటాయే తప్ప ఆత్మహత్యలు ఉండవు.

---

వేతనాలు ఇచ్చి మరీ టెకీలను వినియోగించుకొని తన భావజాల చెత్తనంతా సామాజిక మాధ్యమాల నిండా నింపేస్తోంది. దేశభక్తి మాటున అనేక అబద్ధాలను నిజాలుగా చాలా అందంగా ప్రచారం చేస్తోంది. స్మార్ట్‌ఫోన్లు ప్రతిఒక్కరి చేతిలో ఉంటున్న ఈ వాట్సాప్ యుగంలో అబద్ధాలు త్వరగా అందరికి చేరువవుతున్నాయి. అందివచ్చిన టెక్నాలజీని బిజెపి విస్తృతంగా ఉపయోగించుకుంటుంది. ఈ విషయంలో కాంగ్రెస్, ఇతర పక్షాలు చాలా వెనుకంజలో ఉన్నాయి.

వాస్తవానికి కాంగ్రెస్ అసమర్థ, ఉదారవాద రాజకీయాలే బిజెపి బలోపేతానికి ఊతమిచ్చాయి. ఏదేమైనప్పటికీ మేఘాలయ, గోవా, మణిపూర్ అనుభవాల దృష్ట్యానైనా కర్ణాటక విషయంలో కాంగ్రెస్ చురుకుగా వ్యవహరించింది. ఎన్నికల ఫలితాలు వెలువడగానే ఎలాంటి షరతులు లేకుండా అతి తక్కువ సీట్లు వచ్చిన జెడిఎస్ ప్రభుత్వం ఏర్పాటు చేసేందుకు సహకరించి తమకు ఎదురులేదని విర్రవీగుతున్న మోదీ, షా ద్వయానికి గట్టి షాకిచ్చింది. కాషాయ కబంధ హస్తాల్లోకి మరో రాష్ట్రం పోకుండా కాపాడగలిగింది. మతతత్వ తిరోగమన రాజకీయాలను వ్యతిరేకించే లౌకిక, ప్రజాతంత్ర శక్తులకు ఇదొక తాత్కాలిక ఊరట మాత్రమే.

(రచయిత పాత్రికేయుడు)

వీ

గడ్చిరోలి జిల్లా 1980కి ముందు పూర్తి సాంప్రదాయబద్ధంగా ఉండి ఫారెస్ట్ అధికారుల చేతుల్లో ఆదివాసీ ప్రజలు అనేక చిత్రహింసలకు, దాడులకు బలయ్యేవారు. 80ల తర్వాత మావోయిస్టు ఉద్యమం గోదావరి దాటి సిరోంచ గడ్చిరోలి ప్రాంతాలకు ప్రవేశించిన తర్వాత ఆదివాసీల జీవన విధానంలో మౌలికమైన మార్పులు తీసుకువచ్చింది. ఆదివాసీల్లో హక్కులకై పోరాటాలపై కేంద్రీకరించింది. ప్రపంచంలో ముస్లింలు ఎలాగైతే ప్రపంచవ్యాప్తంగా అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నారో అదే స్థాయిలో భారతదేశంలో కూడా ఆదివాసులు మాత్రమే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా బలమైన పోరాటాన్ని కొనసాగిస్తున్నారు.

వనరుల దోపిడీ వెనుక సాయుధ బలగాల మోహరింపు ఉంటుంది. పారామిలిటరీ బలగాల దాడిలో ఆదివాసీల హక్కుల హననం తీవ్రస్థాయిలో కొనసాగుతున్నది. గడ్చిరోలి జిల్లా సూర్జాగడ్‌లోని ఖనిజ వనరులను దోచుకెళ్లడం కోసం లియాండ్స్‌మెటల్ కంపెనీ 1993లో ఒప్పందం కుదుర్చుకున్నది. 2006-07లో తన లీజ్‌ను పునరుద్ధరించు కున్నది. కానీ 2011 వరకు ఈ లియాండ్స్ మైనింగ్‌ను ప్రారంభించ లేకపోయింది. ఎప్పుడైనా పనులు ప్రారంభించదల్చుకుంటే మావోయిస్టుల నుండి, ఆదివాసీల నుండి ఆందోళనను ఎదుర్కోవాల్సి వచ్చేది. అడవి ప్రాంతం కాబట్టి అటవీ హక్కుల చట్టం (వనాధికార చట్టం) పేసా చట్టం అమలులో ఉంటుంది. కాబట్టి గ్రామ సభ అనుమతి తప్పనిసరిగా తీసుకోవాల్సి ఉంటుంది. ఈ సూర్జాగడ్ ప్రాంతంలో సుమారు 70 గ్రామాలు మైనింగ్‌కు వ్యతిరేకంగా తీర్మాణాలు చేసి కలెక్టర్‌కు పంపించారు. అయినప్పటికీ మైనింగ్ తవ్వకాలు ప్రారంభించడానికి పునాది నిర్మాణా లను తయారు చేసుకుంటున్నాయి.

ఈ మైనింగ్‌కు వ్యతిరేకంగా ఆదివాసీల ఉద్యమాన్ని బలోపేతం చేయడంలో భాగంగా మైనింగ్‌కు చెందిన 70 వాహనాలను మావోయిస్టులు, గ్రామస్థులు దగ్ధం చేశారు. 2017 ఫిబ్రవరిలో మరొకసారి మైనింగ్‌ను ప్రారంభించే ప్రయత్నం చేయడంలో భాగంగానే గట్ట గ్రామం నుండి ఆలపల్లి గ్రామం వరకు 6 పారామిలిటరీ క్యాంపులను ఏర్పాటు చేయడమే కాక వాటిని ఆధునీకరించడం కూడా జరిగింది. ఇందులో ఎన్‌డ్రి క్యాంపు చాలా పెద్దది. సుమారు 2000కు పైగా బలగాలు ఉంటాయి. ఇందులో సి60, సిఆర్‌పిఎఫ్ స్థానిక బలగాలతో క్యాంపులు నింపుతున్నాయి. ఇందులో ప్రధానమైన సి60 కమాండోలు నెలలో 26 రోజులు ఆదివాసీ గ్రామాల చుట్టూ, అడవుల్లో కొండలపైన మకాం వేస్తారు. కేవలం 4 రోజులు మాత్రమే క్యాంపుల్లో బస చేస్తామని క్యాంపులోని జవాను మాకు తెలియజేశారు. గట్ట గ్రామ ప్రాంతంలోని అన్ని పారామిలిటరీ ప్రాంతాలను రీజన్‌ల వారీగా బలోపేతం చేస్తూ వస్తున్నది మహారాష్ట్ర ప్రభుత్వం.

ఇదే క్రమంలో 2017 అక్టోబర్‌లో అదుపులోకి తీసుకుని చిత్రహింసలు పెడుతూనే పోలీసులు క్యాంపుకు తరలించారు. కానీ అందులో నుండి దినేష్ పున్నుగోటి పారిపోయాడని పోలీసులు చెబుతున్నారు. ఈ ఘటన జరిగి 7 నెలలు అయినా ఇంతవరకు దినేష్ జాడ లేకుండా పోయింది. దినేష్ పున్నుగోటి తండ్రి మన్నుపున్నుగోటి ఈటెపల్లికి చెందిన సబ్‌డివిజన్ మెజిస్ట్రేట్‌కు, గడ్చిరోలి జిల్లా పోలీసు ఉన్నతాధికారికి తన కొడుకు ఆచూకీ విషయం కంప్లెయింట్ చేసినా నేటికి అధికారుల నుండి ఎటువంటి స్పందన లేదు. అంతేకాక దినేష్ మావోయిస్టు కాబట్టి మా నుండి తప్పించుకుని వెళ్లిపోయాడని అతని తండ్రికి బెదిరింపు ధోరణితో సమాధానాలిస్తున్నారు పోలీసులు.

పది రాష్ట్రాల్లో 106 జిల్లాల్లో బలంగా ఉన్న మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయడం కోసం జాతీయ విధానంలో భాగంగా కేంద్ర ప్రభుత్వం ఒక యాక్షన్ ప్లాన్‌ను రూపొందించింది. ఈ యాక్షన్ ప్లాన్‌లో ఇన్‌ఫార్మర్స్‌ను పెంచుకోవడం, లొంగుబాట్లను పెంచడం, పెద్ద ఎత్తున పోలీస్ క్యాంపులను ఏర్పాటు చేయడం, ఉద్యమ అణచివేతలో భాగంగా ఉన్న పారామిలిటరీ బలగాలకు అత్యాధునిక ఆయుధాలను ఇతర సాంకేతిక సామగ్రిని సప్లయి చేయడం ఈ పథకం కింద ప్రభుత్వం కొనసాగిస్తున్నది. 2009 నుండి క్యాంపులకు, కూంబింగ్‌లకు పరిమితమైన పారామిలిటరీ బలగాలకు వచ్చేసరికి ఆదివాసీ గ్రామాలపై సామూహిక హత్యలు చేయడం, సామూహిక అత్యాచారాలు చేయడం బూటకపు ఎన్‌కౌంటర్లతో హత్యలు చేయడం కొనసాగించారు.

2016 కు వచ్చేసరికి మిషన్ 2016 పేరుతో ఆదివాసీల హక్కుల కోసం పనిచేస్తున్న జర్నలిస్టులపై, హక్కుల కార్యకర్తలపై, మేధావులపై అగ్ని లాంటి ప్రైవేట్ సాయుధ మూకలతో దాడి చేయించారు. బస్తర్ నుండి న్యాయవాదులను, హక్కుల కార్యకర్తలను, జర్నలిస్టులను వెళ్లగొట్టడానికి దాడులు చేయించారు. ఎన్‌కౌంటర్ల పేరుతో హత్యలు కొనసాగించడం మొత్తంగా ఆదివాసీ పోరాటాలను తీవ్రస్థాయిలో అణచివేయాలని ప్రభుత్వ అప్రజాస్వామిక విధానం అమలులో సఫలం కాలేకపోయింది. ఇంకా ఒక అడుగు ముందుకేసి ప్రజాస్వామిక ప్రభుత్వాలుగా ఉంటూనే నిజనిర్ధారణలను కూడా నియంత్రించే స్థితికి చేరుకున్నాయి. 2017లో ఆపరేషన్ గ్రీన్‌హంట్ రూపం మార్చుకుని ఆపరేషన్ సమాధాన్ పేరుతో డ్రోన్, ఇన్‌ఫార్మర్స్, హెలికాప్టర్ల సహాయంతో మొత్తంగా పరాయి దేశంపై దాడి చేస్తున్నట్టుగానే ఆదివాసీ ప్రాంతాలలో పారామిలిటరీ బలగాల దాడులు కొనసాగుతున్నాయి. 2018 ప్రారంభం నుండి నేటి వరకు సుమారుగా 200కు పైగా ఉద్యమకారులను గానీ, గ్రామస్థులను గానీ, ఆదివాసీలను గానీ హత్యకు గురిచేశారు. ఈ హత్యలు తుపాకీ కాల్పులతో కాకుండా ఎక్కువగా చిత్రహింసలు పెట్టి, యాసిడ్‌లు పోసి గుండ్రటి మొఖాలను మాంసం ముద్దలుగా మార్చి హత్య గావిస్తున్నారు. ఈ స్థితిలోనే 2018, ఏప్రిల్ 22 నుంచి 24 వరకు గడ్చిరోలి, కసనసూర్ అడవి ప్రాంతంలో కొనసాగించిన ఊచకోతను మనం చూడొచ్చు.

2018, ఏప్రిల్ 21 సాయంత్రానికి పెనుగొండ అడవి ప్రాంతానికి సుమారు 35-40 వరకు గల మావోయిస్టు సభ్యుల బృందం అక్కడికి చేరుకున్నదని, ఆ మరుసటి రోజు అనగా ఏప్రిల్ 22న ఎన్‌కౌంటర్ హత్యాకాండ జరిగిందని మాతో వచ్చిన గ్రామస్థులు తెలిపారు. ఇదే విషయాన్ని గడ్చిరోలి ఎస్‌పి అభినవ్ దేశ్‌ముఖ్ ధృవీకరించారు. అంతేగాక ఈ ఎన్‌కౌంటర్ ఉదయం 9.30 గం.లకు ప్రారంభమైనదని కేవలం 90 నిమిషాలలో పూర్తయ్యిందని కూడా ప్రకటించాడు. ఏదైతే ఎన్‌కౌంటర్ జరిగిన స్థలంగా రేలా, కసనసూర్ అడవి ప్రాంతాన్ని చూపిస్తున్నారో అది ఇంద్రావతి నదీతీరం ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలోని పెనుగొండ గ్రామానికి చెందిన గ్రామంలోకి ఇంద్రావతి నది సగం వరకు ఛత్తీస్‌గడ్ మరొక సగం మహారాష్ట్ర భూభాగంలోకి వస్తుంది. మొత్తంగా ఈ ఎన్‌కౌంటర్ జరిగిన స్థలమంతా కూడా ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలోనే ఉంది. ఇక్కడికి మహారాష్ట్రకు చెందిన సి60 పోలీసులు కాని ఈ ఘటన మొత్తాన్ని

మహారాష్ట్ర ప్రభుత్వం తనదిగా ప్రకటించడం కాని తన భూ పరిధిలోకి రాని స్థలంలో హత్య చేయడమే కాక దాన్ని చట్టపరంగా ప్రకటించడం చట్ట ఉల్లంఘన కిందికే వస్తుంది.

2018, ఏప్రిల్ 22 ఉదయం 5గంటల ప్రాంతంలో సుమారు రెండు కంపెనీల సి60 కమాండోలు, సిఆర్‌పిఎఫ్ బలగాలు కలిసి దాడి చేశాయి. ఈ దాడిలో 22నాడే 16 మందిని చంపేసి 11గంటలకల్లా 16 మంది మరణించినట్టుగా ప్రభుత్వం ప్రకటించింది. 18 గంటల వరకు జర్నలిస్టులను కానీ మరెవరినీ కూడా ఘటనా స్థలానికి రానీయలేదు. శవాల ఫోటోలను కూడా ఘటనా స్థలంలో తీయనీయలేదు. అయితే ఇందులో నుంచి డివిజనల్ స్థాయి కమాండర్ నందుతో పాటు ఆరుగురిని 22 సాయంత్రమే జిమ్మలగడ్డ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. జిమ్మలగడ్డ పోలీస్‌స్టేషన్‌లో చిత్రహింసలకు గురిచేస్తున్న సమయంలో ఆ పోలీస్‌స్టేషన్ నుండి నందు సొంత గ్రామమైన అర్కపల్లిలోని ఒక వ్యక్తికి ఫోన్ చేసి నందూతో పాటు ఆరుగురు జిమ్మలగడ్డ పోలీస్‌స్టేషన్‌లో పోలీస్ చిత్రహింసలకు గురవుతున్నారు. మీమీ ప్రయత్నాలు చేసుకోండి అని చెప్పడం జరిగింది. 23 ఉదయం వీరిని తీసుకొని రాజారాంకాండ్ల అడవి ప్రాంతంలో మావోయిస్టులు పెట్టిన డంపును తెల్సుకుని దానిలోని డబ్బును స్వాధీనం చేసుకుని ఆ అడవి ప్రాంతంలోనే ఈ నందతో పాటు ఆరుగురిని చంపేశారు. నందును చంపిన తర్వాత అతని చెల్లెకు, అతని తండ్రికి విషయం తెలియబరిచారు. నందు వాళ్ల తండ్రి, చెల్లి పోస్ట్‌మార్టమ్‌కు ముందే నందు శవాన్ని చూస్తామని తెలియజెప్పినప్పటికి అటువంటి అవకాశమివ్వకుండానే పోస్ట్‌మార్టమ్ కానిచ్చారు. నందు చెల్లెలు చెప్పిన వివరాలప్రకారం నందు శవంలో తుపాకీ తూటా గాయాలు లేవు. కేవలం కుడి భుజంపై గొడ్డలితో నరికిన పెద్ద గాయం ఉంది.

24 నాడు 15 శవాలు ఇంద్రావతి నదిలో తేలాయని ప్రభుత్వం ప్రకటించింది. కాని అక్కడ ఇంద్రావతి నది ఎక్కువ ప్రవాహం లేకుండా, ఎక్కువ లోతు కూడా లేకుండా ఉంది. ఎన్‌కౌంటర్ జరిగిన తర్వాత వారు పారిపోవడానికి కూడా అవకాశాలు లేవు కాబట్టి ఇందులో ఒక్కరిని కూడా వదలకుండా చంపేశామని ఒక క్యాంపు దగ్గర ఇందులో పాల్గొన్న ఒక సిఆర్‌పిఎఫ్ జవాన్ మాకు తెలియజేశాడు. ఇందులో గ్రామస్థులు ఉన్నారు అన్న విషయాన్ని కూడా అతను స్పష్టం చేశాడు. 24న ప్రకటించిన 15 శవాలల్లో వైద్య నివేదికల ప్రకారం 8 మందికి ఊపిరితిత్తుల్లోకి నీరు చేరడం వల్లనే చనిపోయినట్టుగా ప్రకటించారు. కాబట్టి ఒక రోజు మొత్తంగా చిత్రహింసలకు గురిచేసి కదలలేని స్థితిలో ఉన్న వీరిని నీటిలో ముంచి చంపేశారు.

**నిజ నిర్ధారణ – పోలీసుల ఆటంకాలు**

నిజనిర్ధారణ కమిటీ ఎన్‌కౌంటర్ ఘటనా స్థలానికి చేరుకోవడం కోసం ఇంద్రావతి సరిహద్దు గ్రామమైన బోరియా గ్రామానికి సాయంత్రం 2 గంటల ప్రాంతంలో చేరుకున్నాం. బోరియా గ్రామానికి చేరుకుంటుండ గానే గ్రామం నిండా సి60 కమాండోలు ప్రతి ఇంట్లో కనిపించారు. వారి సబ్ ఇన్‌స్పెక్టర్ మాతోపాటు ఘటనా స్థలానికి వస్తామన్నారు. మేం వ్యతిరేకిస్తూ రావద్దూ అని చెప్పాం. పోలీసులెవరూ రాకుండానే ఇంద్రావతి నదిని దాటుకుని ఘటనా స్థలానికి వెళ్లేసరికి 5 గంటలయ్యింది. ఆ ఘటనా స్థలానికి అనుకుని ఉన్న ఇంద్రావతి నదిలో మొసల్లు ఉన్నాయన్న విషయానికి సత్యదూరంగానే గ్రామస్థులు అంగీకరించారు. మొత్తంగా కూడా 3,4 చోట్ల మావోయిస్టుల వస్తువులన్నింటిని కాల్చివేసినట్టుగా స్థల పరిశీలనలో నిర్ధారణ అయ్యింది. అప్పటికీ ఇంకా మావోయిస్టుల ప్లేట్లు, వాళ్ల గ్లాసులు, వాళ్ల బట్టలు, రెండు ఏళ్ల పాపకు సంబంధించిన కొత్త బట్టలు, నదీ తీరం వెంబడి నక్సలైట్ తూటాల మ్యాగజైన్ల బెల్టులు, వారి యూనిఫాంలు, వాళ్ల పుస్తకాలు ఇంకా ఇతరత్రా వస్తువులు మాకు కనిపించాయి. మొత్తంగా అక్కడ ఎన్‌కౌంటర్ జరిగినట్టుగా మాకు ఏమి ఆనవాళ్లు కనిపించలేదు. అంతేకాక అక్కడ పెద్దపెద్ద వృక్షాలు కూడా లేవు. ఆ స్థలమంతా కూడా పూర్తి మైదాన ప్రాంతంలాగా ఉంది. కొండ దిగువన ఒక 4,5 చోట్ల వెదురు చెట్ల గుంపులున్నాయి. ఇవి ఒక దగ్గర స్నానం కోసం ఏర్పాటు చేసుకున్న కర్రలతో కూడిన ప్రత్యేక స్థలం ఉంది. అక్కడ పెట్టిన లుంగీలు అక్కడనే ఉన్నాయి.

ఇదంతా కూడా ఎటువంటి ఎన్‌కౌంటర్ లేకుండా అందరిని బంధీలుగా పట్టుకుని చిత్రహింసలతో చంపిన స్థితి ఉన్నది. పోలీసులు ఇంతటి హత్యాకాండపై కేసు కోసం జాగ్రత్త చేయాల్సిన వారి కిట్ బ్యాగులు కాని, ఆయుధాల పౌచులు గాని, ఇంద్రావతి నదిలో విసిరివేశారు. వాటన్నిటిని కమిటీ చూడగల్గింది. శవాలను హెలికాప్టర్‌లో తరలించినవారు వీరి అన్ని వస్తువులను తరలించకుండా అక్కడనే దగ్ధం చేయడం అంటేనే ఇది ఎన్‌కౌంటర్ కాదని అర్థం అవుతుంది. ఈ దాడిలో ఎక్కడ కూడా చట్టపరంగా వ్యవహరించలేదు కాబట్టే రెండు ఏళ్ల పాపతో సహా 8 మంది గట్టేపల్లి గ్రామస్థులతో సహా 40 మందితో కూడిన మావోయిస్టు దళాన్ని కూడా ప్రభుత్వం హత్య చేసింది.

ఘటనా స్థలాన్ని పరీక్షించిన తర్వాత వెనుతిరిగి బోరియా గ్రామంలోకి సుమారు ఆరున్నర గంటల ప్రాంతంలో తిరిగి వస్తున్న కమిటీని అడ్డగిస్తూ గ్రామం వెలుపలే సుమారు వందమందితో కూడిన నక్సల్ పీడిత కమిటీ మమ్మల్నందర్నీ అడ్డగించింది. అంతేకాకుండా మాకు వ్యతిరేకంగా నినాదాలు చేసింది. వారు చేస్తున్న ఈ ఘటన అంతా రికార్డ్ చేయడం కోసం గడ్చిరోలి నుంచి కిరాయికి ఫోటోగ్రాఫర్లను కూడా తీసుకుని వచ్చారు. రెండు కొత్త బస్సుల్లో ఈ వంద మందిని తరలించడానికి పోలీసులు తీవ్రంగా ప్రయత్నం చేశారు. గ్రామంలోని పోలీసులందరు నది తీరంలోని అడవిలోకి వచ్చేసి మేం తిరిగి వస్తున్న క్రమంలో మమ్మల్నందరినీ వారి వద్ద ఉన్న ఫోన్లలో రికార్డ్ చేస్తున్నారు. వాటినేం పట్టించుకోకుండా గ్రామంలోకి వచ్చేసరికి ఈ నక్సల్ పీడిత కమిటీ మమ్మల్ని చుట్టుముట్టింది. కమిటీ నాయకులతో చాలా సేపు వాదనలు కూడా జరిగాయి. మా కమిటీని వారు అడిగిన ప్రశ్న ఒక్కటే. మీరు ఈ ప్రభుత్వం మీద విశ్వాసం కోల్పోయారా? నక్సల్స్ చనిపోతేనే మీరు వస్తారు, నక్సల్స్ చంపితే మీరు రారా అని మమ్మల్ని ప్రశ్నించారు. ఇది పూర్తిగా ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమిటీ. అంతేకాకుండా ప్రభుత్వం చేస్తున్న హత్యాకాండలు, బాహ్య ప్రపంచానికి తెలియనీయకుండా ఈ నిజనిర్ధారణ కమిటీలపై ఇటువంటి ఒత్తిడీలు తీసుకువస్తే ఈ నిజనిర్ధారణలు ఆగుతాయని ప్రభుత్వాలు భ్రమ పడుతున్నాయి. ఆ నక్సల్ వ్యతిరేక కమిటీ సభ్యులకు కూడా మేం పరిస్థితులను అర్థం చేపించి వారి దరఖాస్తును హిందీ భాషలో తీసుకుని వచ్చాం. కానీ వాళ్లలో ఎక్కువమందికి ఎందుకు వచ్చామో కూడా తెలియదు. ప్రభుత్వం ఇలాంటి ప్రయత్నాలు చేయడం రాజ్యాంగ విలువలను ఇంకా దిగజార్చడంగా మేం భావిస్తున్నాం. ఈ నక్సల్ పీడిత కమిటీ సభ్యులపై ఒకవేళ

మావోయిస్టులు దాడి చేసిన వారిపై ప్రభుత్వాలు చట్టపరమైన చర్యలు తీసుకోవాలి తప్ప హక్కుల సంఘాలపైకి, నిజనార్ధణ కమిటీలపైకి ప్రభుత్వమే పంపడమనేది ప్రభుత్వ దిగజారుడు తనానికి నిదర్శనం.

**గట్టేపల్లి గ్రామంలో పోలీసుల నిర్బంధం**

2018, ఏప్రిల్ 5న బోరియా గ్రామం నుంచి బయలుదేరిన నిజనిర్ధారణ బృందం రాత్రి 8.30–9.30 గం.ల ప్రాంతంలో గట్టేపల్లి గ్రామానికి చేరుకున్నది. ఎన్‌కౌంటర్ జరిగిన తర్వాత నాటి నుండి సి60 పోలీసులు ఈ గ్రామంలోనే క్యాంపు వేసి ఉన్నారు. ఈ గ్రామంలోనే వంట చేసి గ్రామస్థులకు భోజన సదుపాయాలను కల్పిస్తున్నారు. ఇదే విషయాన్ని సి60 పోలీసులను అడుగుతూ పోలీసులకు పౌర ఆర్థిక విషయాల్లో పోలీసులు జోక్యం చేసుకోవద్దనే చట్టబద్ధతను మీరెందుకు ఉల్లంఘిస్తున్నారని ప్రశ్నించగా మాకు పై అధికారుల నుంచి ఆజ్ఞలున్నాయి. మేం అందుకే చేస్తున్నాం అని చెప్పారు. మా కమిటీ ఈ గట్టేపల్లి గ్రామం నుండి ఆచూకీ తెలియకుండా పోయిన 8 మంది గ్రామస్థుల వారి బంధువులను కలవాలనే ప్రయత్నం కొనసాగకుండా ఆ బాధిత గ్రామస్థుల ఇండ్లల్లోనే సుమారు 10–15 మంది సి60 పోలీసులు మకాం వేసి ఉన్నారు. బాధిత ఇండ్లలోని వారు ఎవరితోనూ మాట్లాడనీయకుండా ఎక్కడికి వెళ్లనీయకుండా పూర్తి నియంత్రణలో ఉంచుతున్నాయి. అయినప్పటికి మంగేష్ కుటుంబ సభ్యులతో మాట్లాడడం జరిగింది. అతని కుటుంబ సభ్యులు మాట్లాడుతూ ఒక్కసారి కూడా శవాల గుర్తింపు కోసం శవాలను చూపించలేదు.

గట్టేపల్లికి చెందిన 8 మందిలో ఐదుగురు మహిళలు, 3 పురుషులు కసన్‌సూర్ గ్రామంలో జరుగుతున్న పెళ్లికి వెళ్తూ మావోయిస్టులను కల్సినట్టుగా పోలీసులు దాడిచేసినప్పుడు బందీలుగా చిక్కి వీరు హత్యకు గురైనట్టుగా గ్రామస్థులు అనుమానిస్తున్నారు. పోలీసులు గట్టేపల్లికి చెందిన 8 మంది గ్రామస్థులు మరణించనట్లుగా ప్రకటించలేదు. అందుకే ఏప్రిల్ 23న పోలీస్‌స్టేషన్‌లో కంప్లెయింట్ చేయడానికి గ్రామస్థులు వెళితే వారిని గడ్చిరోలి హెడ్‌క్వాటర్స్‌కి పిలుపించుకుని వారిదగ్గరున్న ఆధారాలు ఆధార్‌కార్డ్ ఇతర గుర్తింపుకార్డులన్నింటిని పోలీసులు స్వాధీనం చేసుకుని మేం మిస్సింగ్‌కేసు నమోదు చేస్తున్నాం. ఇకముందు విచారణకు ఈ కార్డులు ఉపయోగపడుతాయని వారి వద్దనే ఉంచుకున్నారు.

గట్టేపల్లికి చెందిన సాయినాథ్ చనిపోయిన మావోయిస్టులలో అగ్రనాయకుడే. ఇదే గట్టేపల్లి గ్రామం నుండి 15 ఏళ్ల క్రితం మావోయిస్టు ఉద్యమంలోకి వెళ్లాడు. సాయినాథ్ గ్రామంతో నేటికి సజీవ సంబంధాలు ఏర్పరుచుకుంటూనే వీరిని కలవాలనే ప్రయత్నంలోనే వీరు మావోయిస్టులతో కలిసారని గ్రామస్థులు చెపుతున్నారు. గ్రామస్థులను పట్టుకున్న పోలీసులు ఎందుకు విడిచిపెట్టలేదు. వారి దగ్గర ఆయుధాలు కూడా లేవు. వారు గ్రామస్థులు కదా! పోలీసులు నిరాయుధులైన ఈ గ్రామస్థులను ఎందుకు చంపినట్టు? గట్టేపల్లి గ్రామస్థులని తెలిసిన తర్వాత కూడా పోలీసులు వీరిని చంపినట్టుగా గ్రామస్థులు భావిస్తున్నారు. ఒక 8 శవాలు ఎటువంటి దుస్తులు లేకుండానే గడ్చిరోలి మార్చురీకీ తరలించారని మార్చురీకి ఉద్యోగులు మా దృష్టికి తీసుకొచ్చారు. అయితే ఈ గ్రామం నుంచి వెళ్లిన బిజ్జి అనే మహిళ శవాన్ని ఒకరు గుర్తు పట్టడం వలన ఆ శవాన్ని తీసుకోగలిగారు గాని గట్టేపల్లి గ్రామం వరకు తరలించడానికి శవం పరిస్థితులు అనుకూలించలేదు. పూర్తిగా డీ కంపోజ్ అవడం వలన ఈ శవాన్ని గడ్చిరోలిలోనే పూడ్చేసి వచ్చారు.

**రాజారాంకాండ్ల**

అహిరి తాలూకా అర్కపల్లి గ్రామానికి చెందిన నంద చనిపోయిన మావోయిస్టులలో ఒక దళనాయకుడే. నంద ఇంటర్‌మీడియట్ వరకు చదివాడని, బ్రిలియంట్ స్టూడెంటని కాలేజీలో బాగా చదివేవాడని ఇంటర్‌మీడియట్‌లోనే మావోయిస్టుల్లో చేరాడని నంద చెల్లెలు చెప్పింది. నంద చెల్లెలు ఆ గ్రామ సర్పంచ్‌గా కూడా కొనసాగుతున్నది. నందతో పాటు నిర్బంధించబడిన వారిలో నలుగురు మహిళలు ఒక పురుషుడు. ఇందులో నంద భార్య కూడా ఉంది. వీరందరిని జిమ్మలగడ్డ పోలీస్‌స్టేషన్‌లో చిత్రహింసల తర్వాత దంపును స్వాధీనం చేసుకున్న తర్వాత వీరందరిని హత్య చేశారు.

నూటికి రెండు శాతం మాత్రమే నిజమైన ఎన్‌కౌంటర్‌లు కాగా 98 శాతం ప్రభుత్వ హత్యలే. నేడు ప్రపంచంలో ఆర్థిక సంక్షోభంలో భాగంగా బహుళజాతి కంపెనీలు ముడివనరులు ఉచితంగా దోచుకోవడం కోసం, పెద్ద ఎత్తున లాభాలను ఆర్జించడడంలో భాగంగా మన దేశ ప్రజల్నే చంపి ఎంఎన్‌సి బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పడమే అభివృద్ధిగా ప్రభుత్వాలు ప్రచారంచేస్తున్నాయి.

కానీ అడవి హక్కుల చట్టం, పేసా చట్టాన్ని ఉల్లంఘిస్తూ అడవిపై ఆదివాసీలకు హక్కులు లేకుండా చేయడం చివరికి ఆదివాసీలు అడవిలో జీవించకుండా చేయడం ఏ విధంగా అభివృద్ధి అవుతుందో ప్రభుత్వం ప్రజలకు చెప్పాల్సి ఉంది. బాధ్యత విస్మరిస్తున్న ప్రభుత్వాలను, ప్రభుత్వ విధానాలను ప్రశ్నిస్తున్న వాళ్లను పోరాడుతున్న ప్రజలకు అండగా నిలబడుతున్నవారిని దేశద్రోహులుగా ముద్రవేసి కౄరమైన చట్టాలతో అక్రమ నిర్బంధాలకు గురిచేస్తున్నారు.

2011 ఆగస్టు 20న గడ్చిరోలి జిల్లా మకడ్‌చుహా, రనీత (రాంకోహిచామి) చంపేశారు. , 2012 జనవరి 12న సిరోంచ తాలుకా బేజ్జపల్లికి చెందిన మంగ్రూ (లింగా)ను చంపేశారు. 2013లో జనవరి 20న గోవింద్‌గామ్ గ్రామానికి చెందిన ఉమేవ్వర్ లకడా (శంకర్) ,చంద్రయ్యకొడపే(వినోద్), గీతా ఊసెండి, మోహన్ కవాసి (తులసి), జూరూమట్టామి, సునీత కొడపేలను ఎన్‌కౌంటర్ పేరుతో చంపేశారు. 2013 ఏప్రిల్ 12న ధనోర గ్రామంలో పంకజ్ గావ్‌డేను, చంప తుర్సవ్, వసంతి కవచి, సంగీత ఆత్రంలను ఎన్‌కౌంటర్ పేర్లతో చంపేశారు. 2015 సెప్టెంబర్ 7న గడ్చిరోలి ధనోర ప్రాంతంలో ప్రమాద్ కచ్లామి (దల్‌పట్)ను చంపేశారు. 2016 ఏప్రిల్ 19న గడ్చిరోలిలో సరిత కోలు కవాసేను చంపారు. అదే సంవత్సరం మే 10న రజితరాంకో రిసి ఉసెండీను చంపేశారు.

ఆదివాసీల హననానికి కారణమవుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్, ఆపరేషన్ సమాధాన్‌లను వెంటనే నిలిపివేయాలి. బోరియా, కసన్‌సూర్ హత్యాకాండలో భాధ్యులైన సి60 పోలీసులతో పాటు గడ్చిరోలి ఎస్‌పిపై హత్యానేరం కేసు నమోదు చేయాలి. గట్టేపల్లి గ్రామస్థులను కాల్చి చంపి కనీసం శవాలను కూడా గుర్తించకుండా అమానవీయంగా వ్యవహరించిన పోలీసులపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. కోయన్‌వర్షి, రాంకుమార్ హత్య చేసిన పోలీసులపై హత్యానేరం కేసు నమోదు చేయాలి. గడ్చిరోలి జిల్లాలోని పారామిలిటరీ సి60 పోలీసు క్యాంపులను వెంటనే ఎత్తివేయాలి. ఎన్‌కౌంటర్ హత్యలను నిలువరించడం కోసం 2009లో ఏపి హైకోర్టు ఫుల్‌బెంచ్ ఇచ్చిన తీర్పుపై సుప్రీంకోర్టు ఇచ్చిన స్టేను వెంటనే తొలగించాలి.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, పౌరహక్కుల సంఘం)* వీ

# మక్కా మసీదు కేసులో అన్యాయమైన తీర్పు

***మక్కా మసీదు పేలుళ్ల కేసులో ఆధారాలు లేవని, అభియోగాలు నిరూపించడంలో ప్రాసిక్యూషన్ విఫలమైందనే నెపంతో దోషులను నిర్దోషులుగా విడుదల చేయడం వెనక పాలకుల కుట్ర దాగి ఉందని అంటున్నారు* సంతోష్**

దేశవ్యాప్తంగా 11 ఏళ్ల క్రితం సంచలనం సృష్టించిన మక్కా మసీదు బాంబు పేలుళ్ల కేసులో కీలక పరిణామాలు చోటు చేసుకున్నాయి. "జస్టిస్ డిలెయిడ్ ఈజ్ జస్టిస్ డినైయిడ్ (ఆలస్యంగా జరిగే న్యాయం, న్యాయం నిరాకరించడంతో సమానం) అన్న నానుడికి హైదరాబాదులోని మక్కా మసీదు పేలుళ్ల ఘటనపై నాంపల్లి జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ) న్యాయస్థానం ఏప్రిల్ 16న ఇచ్చిన తీర్పు దర్పణం పడుతోంది. 2007, మే 18న జరిగిన మక్కా మసీదు బాంబుపేలుళ్ల ఘటనపై 11 సంవత్సరాలపాటు దర్యాప్తు జరిగింది. ఈ కేసులో ఆరోపణలు ఎదుర్కొన్న ఐదుగురు నిందితులను ఎన్ఐఎ ప్రత్యేక కోర్టు ఏప్రిల్ 16న నిర్దోషులుగా ప్రకటించింది. నిందితులుగా ఉన్న స్వామి అసీమానంద్, దేవేందర్ గుప్తా, లోకేష్ శర్మ భరత్ బాయి, రాజేందర్ చౌదరిలపై అభియోగాలు నిరూపించడంలో ప్రాసిక్యూషన్ విఫలమైందని న్యాయస్థానం వ్యాఖ్యానిస్తూ ఆ ఐదుగుర్ని నిర్దోషులుగా ప్రకటించడం లౌకిక, ప్రజాస్వామిక వాదులందరినీ తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేసింది.

2007 'మక్కా' బాంబు పేలుడు సంఘటనలో ఐదుగురు అక్కడికక్కడే చనిపోయారు. ఆ తరువాత ఆస్పత్రిలో నలుగురు చనిపోయారు. అనంతరం జరిగిన అల్లర్లు, పోలీసు కాల్పుల్లో ఐదుగురు మరణించారు. కొందరు క్షతగాత్రులయ్యారు. మత మారణహోమంలో అమాయకులు సమిధలైనారు. బాంబుల తయారీకి ఆర్.డి.ఎక్స్, టి.ఎస్.టిలను 60:40 నిష్పత్తిలో కలిపి, సైకోటాల్ అనే ఐఇడిని 10/3 అంగుళాల పైపులో అమర్చి టైమర్ సహాయంతో పేల్చినట్టు సిట్ బృందం గుర్తించింది. ఈ పేలుళ్ల వెనుక లష్కరే తాయిబా, హర్కతుల్ జిహాద్ అల్ ఇస్లామీ (హుజీ) వంటి తీవ్రవాద సంస్థల పాత్ర ఉన్నట్టు భావించి, విదేశాలకు వెళ్లిన యువతపై నిఘాపెట్టింది. ఇటువంటి దుర్ఘటనలను అదుపు చేయాల్సిన పాలకులు ఏమీపట్టనట్టు వ్యవహరించారు.

మొదట కేసును హైదరాబాద్ సిట్ సంస్థకు అప్పగించారు. మక్కా మసీదు బాంబు పేలుళ్ల కేసులో సిట్ బృందం అనుమానాలు తప్ప సాధించింది ఏమిలేదు. 2011లో ఈ కేసును సి.బి.ఐకి అప్పగించారు. మాలేగావ్ కేసు ఆధారంగా దేవేందర్‌గుప్తా, లోకేశ్‌శర్మను నిందితులుగా పేర్కొంటూ సి.బి.ఐ అరెస్టు చేసింది. చార్జిషీట్‌లో వారి పేర్లను పొందిపరిచింది. అటు తర్వాత 2011 మేలో ఎన్ఐఏకు అప్పగించారు. ఈ కేసు దర్యాప్తును జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఏ)కు అప్పగించారు. ఈ కేసులో పదిమంది.. దేవేందర్‌గుప్తా (ఏ1), లోకేశ్‌శర్మ (ఏ2), సందీప్‌డాంగ్(ఏ3) , రామచంద్ర కళాసంగ్రా (ఏ4), సునీల్‌జోషి (ఏ5), స్వామి ఆసీమానంద్ (ఏ6), భరత్ భాయ్ (ఏ7), రాజేందర్‌చౌదరి (ఏ8), తేజోరామ్ పర్మార్ (ఏ9), అమిత్‌చౌహాన్ (ఏ10)ను ఎన్ఐఏ నిందితులుగా పేర్కొంటూ విచారణ ప్రారంభించింది. వీరిలో సునీల్‌జోషి హత్యకు గురయ్యాడు. ఇద్దరు నిందితులు పరారీలో ఉండగా, మరో ఇద్దరిపై ఎన్ఐఏ చార్జిషీట్ దాఖలు చేయలేదు. మిగతా ఐదుగురిపై ఎన్ఐఏ 2013 జూన్‌లో చార్జిషీట్ దాఖలు చేసింది. అభినవ్ భారత్ సంస్థ నేతలు దేవేందర్ గుప్తా ఆసీమా ఇన్ని దర్యాప్తు సంస్థలు మారినా అసలు దోషులు దొరకలేదు. కేసులోని చిక్కుముడులు విడిపోలేదు. మన అంతర్గత దర్యాప్తు సంస్థల బలహీనతా లేక కేసును నీరుగార్చడంలో రాజకీయ జోక్యం ఏమైనా ఉందా అంటే, ఉందనే అనిపిస్తుంది.

ఈ కేసులో మొదట ఒక సామాజిక వర్గాన్ని అనుమానించారు. ఈ ఘాతుకానికి పాక్ ప్రేరేపిత ఉగ్రవాద సంస్థ హర్కతుల్ జిహాద్ అల్ ఇస్లామీ (హుజీ) కారణమని... హైదరాబాద్‌కు చెందిన ఉగ్రవాది బిలాల్ అలియాస్ షాహెద్ బాధ్యుడని ప్రాథమికంగా భావించారు. అత్యుత్సాహంతో పోలీసులు దాదాపు రెండు వందల మంది అనుమానితులను అదుపులోకి తీసుకున్నారు. వారంతా ఒక వర్గానికి చెందిన వారే కావడం, అందులోనూ కొందరికే బిలాల్‌తో సంబంధాలు ఉన్నట్టు తేలడంతో మొదటి ఎదురుదెబ్బ తగిలింది. అనుమానితుల్లో 38 మందిని మక్కా మసీదు పేలుడులో బాధ్యుల్ని చేస్తూ అరెస్టు చేయగా.. మరో 180 మందిపై గోపాలపురం పోలీసుస్టేషన్‌లో కుట్ర కేసు నమోదు చేశారు. కుట్ర కేసు వీగిపోగా.. పేలుడు కేసులో అనుమానితులుగా పేర్కొన్న వారికి కోర్టులో క్లీన్‌చిట్ లభించింది. దీంతో ముస్లిం తీవ్రవాదులు కారణం కాదు అని తేలిపోయింది.

తర్వాత కొందరిని గుర్తించారు. వారు కూడా కాదని కోర్టు తీర్పు చెప్పింది. హైదరాబాద్ పోలీసుల దర్యాప్తు, అరెస్టుల తీరుపై విమర్శలు రావడంతో... కేంద్ర దర్యాప్తు సంస్థ (సి.బి.ఐ)ను రంగంలోకి దింపారు. అజ్మీర్ దర్గాలో పేలుడు ఘటనకు సంబంధించి రాజస్తాన్ పోలీసులు చేసిన అరెస్టులతో మక్కా మసీదు పేలుడు కేసు చిక్కుముడి వీడింది. కొందరు నిందితులను అరెస్టు చేసిన సి.బి.ఐ అధికారులు... వారిపై చార్జిషీట్ సైతం దాఖలు చేశారు. 2007 జూన్ 10న సి.బి.ఐ ఎస్.పి. ఆర్.ఎస్.దినకర్ ప్రసాద్ నేతృత్వంలో డి.ఎస్.పి ఠాకూర్, ఇన్‌స్పెక్టర్లు శర్మ, ప్రక్యాల్‌లతో కూడిన బృందం ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చి అధికారికంగా దర్యాప్తు ప్రారంభించింది. 2008 అక్టోబర్ 28 మహారాష్ట్రలోని మాలేగావ్ పేలుడు కేసులో అక్కడి యాంటీ టెర్రరిస్ట్ స్క్వాడ్ (ఏటీఎస్) అధికారులు అభినవ్ భారత్ సంస్థకు చెందిన సాధ్వీ ప్రజ్ఞాసింగ్, శ్రీకాంత్ పురోహిత్‌లను అరెస్టు చేశారు. వారిని

విచారించినప్పుడు రాజస్థాన్‌లోని అజ్మీర్‌లో పేలుళ్లకు బాధ్యులైన దేవేంద్ర గుప్తా, లోకేశ్ శర్మ, రామచంద్ర, సందీప్‌ల పేర్లు బయటికి వచ్చాయి.

2010 ఏప్రిల్ 28న రాజస్తాన్ పోలీసులు దేవేంద్ర గుప్తా, లోకేశ్ శర్మలను అరెస్టు చేసి విచారించిన సమయంలో... మక్కా మసీదులో పేలుళ్లకు పాల్పడింది కూడా తామేనని వెల్లడించారు. దీంతో సి.బి.ఐ అధికారులు వారిని విచారించాలని నిర్ణయించారు. 2010 జూన్ 18న రాజస్తాన్‌కు వెళ్లిన సి.బి.ఐ అధికారులు... దేవేంద్ర, లోకేశ్‌లను హైదరాబాద్‌కు తీసుకువచ్చారు. కోర్టు అనుమతితో వారిని కస్టడీలోకి తీసుకుని విచారించగా... స్వామి అసీమానంద పేరు వెలుగులోకి వచ్చింది. 2010 నవంబర్ 19న ఉత్తరాఖండ్‌లోని హరిద్వార్‌లో మారుపేరుతో రహస్య జీవితం గడుపుతున్న స్వామి అసీమానందను సి.బి.ఐ అధికారులు అరెస్టు చేశారు. రామచంద్ర, సందీప్‌ల కోసం గాలింపు ముమ్మరం చేశారు.

2010 డిసెంబర్ 13న సి.బి.ఐ అధికారులు ప్రిలిమినరీ చార్జిషీట్ దాఖలు చేశారు. అసీమానంద మినహా మిగతా ఇద్దరు నిందితులు దేవేంద్ర, లోకేశ్‌లపై నాంపల్లికోర్టులో 75 పేజీల అభియోగపత్రం దాఖలు చేశారు. అప్పట్లో అసీమానంద పోలీసు కస్టడీలో ఉండటంతో అభియోగాలు నమోదు చేయలేదు. 2011 ఏప్రిల్ 7న కేంద్ర హోం శాఖ నిర్ణయం మేరకు మక్కా పేలుడు కేసు దర్యాప్తు సి.బి.ఐ నుంచి జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఏ)కు బదిలీ అయింది. పరారీలో ఉన్న రామచంద్ర, సందీప్, అశోక్‌లపై రు. 20 లక్షల రివార్డు ప్రకటించిన ఎన్ఐఏ గాలింపు ముమ్మరం చేసింది. 2011-2013 మధ్యకాలంలో ఎన్ఐఏ అధికారులు 2011 మే, 2012 జూలై, 2013 ఆగస్టులలో అసీమానంద సహా పలువురిపై మూడు సప్లిమెంటరీ చార్జిషీట్లు దాఖలు చేశారు. అరెస్టయిన వారిలో తేజోరామ్ పర్మార్‌పై మాత్రం అభియోగాలు నమోదు కాలేదు.

సాక్షుల ప్రాణాలకు ముప్పు ఉందనే ఉద్దేశంతో వారి వివరాలను గోప్యంగా ఉంచారు. ఈ కేసు విచారణకు వచ్చేలోగా కేంద్రం జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఏ)ను ఏర్పాటు చేయడంతో.. కేసులు దాని పరిధిలోకి వెళ్లాయి. దర్యాప్తు చేసిన ఎన్ఐఏ మరి కొందరు నిందితులను అరెస్టు చేసింది. ఒక్కొక్కరు ఒక్కో తీరులో, వివిధ కోణాల్లో దర్యాప్తు చేయడం కేసులో ఓ స్పష్టత లేకుండా పోయింది. పేలుడు ఘటనలో ప్రమేయమున్న మధ్యప్రదేశ్ ఇండోర్‌కు చెందిన సందీప్ వి డాంగే అలియాస్ వాసుదేవ్, రామచంద్ర కల్సంగ్రా రాంజీ అలియాస్ ఓ.ఎమ్‌జీ మాత్రం ఇంకా దొరకలేదు. మధ్యప్రదేశ్ దేవాస్‌కు చెందిన మరో నిందితుడు సునీల్‌జోషి పేలుడు జరిగిన ఏడాదే హత్యకు గురయ్యాడు. దర్యాప్తు సంస్థల వైఫల్యం, రాజకీయ జోక్యం వలన వాస్తవాలు వెలుగుచూడలేదన్నది స్పష్టం.

మక్కా మసీదు బాంబు పేలుడు కేసు దేశంలోనే సంచలనం సృష్టించింది. దేశ అంతర్గత భద్రతకు సవాళ్లు విసిరింది. అయినా పాలకులు అప్రమత్తం కాలేదు. అపరాధులను గుర్తించనేలేదు. పదకొండేండ్లు అయినా కేసును ఛేదించటంలో విఫలమయ్యారు. మొదటినుండీ కేసులో తప్పటడుగులు పడుతూనే ఉన్నాయి. కేసు నిరూపణలో ఎన్ఐఏ విఫలమైందని న్యాయమూర్తి స్పష్టం చేశారు. ఎన్ఐఏ చార్జిషీటు వేసి సరైన సాక్ష్యాధారాలను ఎందుకు సమీకరించు కోలేకపోయింది. అసలు ఈ చార్జిషీట్ ఏ ఆధారాలను బట్టి ఎన్ఐఏ వేసింది. వాటిని కోర్టు ముందు ఎందుకు నిరూపించలేకపోయింది అన్నది అసలు ప్రశ్న. ఆ సంగతులు దర్యాప్తు సంస్థకు తెలియదా అనే అనుమానం కలుగుతోంది. అసలు దోషులు ఎవరన్నది అందరినీ ఆందోళనకు గురిచేస్తున్న అంశం. కావాలనే కేసును నీరుగార్చారు అనే అనుమానం కలుగుతున్నది. కొన్ని కీలక ఆధారాలను పరిశోధనలో పక్కకు పెట్టినట్టు అర్థమవుతుంది.

దుండగులు రెండు బాంబులతో పేలుళ్లకు ప్రయత్నించారు. ఒకటి మాత్రమే పేలింది. రెండవ బాంబు పేలలేదు. అక్కడికి వెళ్లిన పోలీసులు ఓ బ్యాగును స్వాధీనం చేసుకున్నారు. దానిలో ఒక తాళం చెవి, ఒక టీషర్ట్ ఉన్నట్టు కనుగొన్నారు. కానీ అవి ఎన్ఐఏ దర్యాప్తులో లేవని తెలుస్తున్నది. అంత ముఖ్యమైన వాటిని ఎందుకు వదిలేశారు అన్నది ప్రశ్నగానే మిగిలిపోయింది. 2013లో గయా బాంబు పేలుడు కేసులో అక్కడ దొరికిన ఓ బ్యాగ్ ఆధారంగానే ఆ కేసు ఛేదించారు. మక్కాలో దొరికిన బ్యాగ్ కూడా కీలకపాత్ర పోషించే అవకాశం వుండొచ్చు. అంతటి ముఖ్యమైన ఆధారాలు ఎవరు తొలగించారు? సమాధానం లేని ఈ ప్రశ్న దావానలంలా దహించివేస్తున్నది. మక్కా మసీదు పేలుళ్ల కుట్రను నిరూపించడంలో సాక్ష్యాధారాలను సమర్పించడంలో ఎన్ఐఎ ఉద్దేశ పూర్వకంగానే విఫలమయ్యేట్లు వ్యవహరించిందన్న విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

**నిందితులపై అభియోగాలు :** దేవేందర్ గుప్తా, బాంబు పేలుళ్లకు మిగతా నిందితులతో కలసి కుట్ర పన్నాడు. మనోజ్‌కుమార్ పేరుతో తప్పుడు స్కూల్ సర్టిఫికెట్, బాబూలాల్ యాదవ్ పేరుతో తప్పుడు రేషన్‌కార్డు తయారు చేశాడు ఈ తప్పుడు రేషన్‌కార్డుతో డ్రైవింగ్ లైసెన్స్ పొందాడు. దీని ఆధారంగా సిమ్ కార్డు తీసుకున్నాడు. ఈ ఫోన్ నంబర్ ద్వారానే మిగతా నిందితులతో మాట్లాడాడు. మత విద్వేషాలను రెచ్చగొట్టేలా ప్రసంగాలు ఇవ్వడంలో దిట్ట. మొబైల్ ఫోన్‌ను ఉపయోగించి అజ్మీర్ దర్గా వద్ద ఎలా పేలుడు జరిపారో.. అదే తరహాలో మక్కా మసీదు వద్ద పేలుళ్లు జరిపారు. లోకేశ్ శర్మ, మొబైల్ ఫోన్లు సంపాదించి పెట్టడంలో కీలక పాత్ర పోషించారు. మక్కా మసీదు పేలుళ్లు ఎలా జరపాలన్న స్కెచ్ రూపొందించింది ఇతనే. స్వామి అసీమానంద, హిందూ దేవాలయాలపై జరుగుతున్న దాడులకు ప్రతీకారంగా... మక్కా మసీదు, అజ్మీర్ దర్గాలలో పేలుళ్లు జరపాలని ప్రతిపాదించాడు. తన పథకాన్ని వివరించి రామచంద్ర కల్సాంగ్ర, భరత్ మోహన్‌లాల్ రాతేశ్వర్‌ల ద్వారా సిమ్ కార్డులు సంపాదించాడు.

పేలుళ్ల తరువాత స్వామి ఓంకారానంద్‌గా మారుపేరుతో హరిద్వార్ సమీపంలోని ఆత్మాల్‌పూర్ బొంగ్లా గ్రామంలో దాక్కున్నాడు. పోలీసులు అసీమానందను అరెస్ట్ చేసి.. హరిద్వార్ చిరునామాతో ఉన్న ఓటర్, రేషన్ కార్డులను, నాబాకుమార్ సర్కార్ పేరుతో ఉన్న పాస్‌పోర్టును స్వాధీనం చేసుకున్నాడు. భరత్ మోహన్‌లాల్ రాతేశ్వర్, పేలుడు కుట్రకు సంబంధించి కీలక పాత్ర పోషించాడు. గుజరాత్‌లోని మహదేవ్‌నగర్‌లో ఉన్న భరత్ ఇంట్లోనే అందరూ భేటీ అయి పేలుడుకు ప్రణాళిక రూపొందించారు. అక్కడే పేలుళ్ల కోసం రామచంద్ర కల్సాంగ్రకు రు.

40 వేలు ఇచ్చారు. సునీల్ జోషికి రు. 25 వేలు ఇచ్చి పిస్టళ్లు, సిమ్‌కార్డులు పొందారు. రాజేంద్ర చౌదరి, మక్కా మసీదులో బాంబు పెట్టిన ప్రధాన వ్యక్తి. 2007 ఏప్రిల్‌లో మరో వ్యక్తితో కలసి మక్కా మసీదు వద్ద రెక్కీ నిర్వహించాడు. సంఝౌతా ఎక్స్‌ప్రెస్ బాంబు పేలుడు, మాలేగావ్ పేలుళ్ల కేసుల్లోనూ రాజేంద్ర నిందితుడు.

**వివిధ పేలుళ్ల కేసుల విచారణ తీరు**

మక్కా మసీదు పేలుళ్లతోపాటు దేశ వ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో జరిగిన మరికొన్ని పేలుళ్ల కేసుల్లో హిందుత్వ అతివాదులు ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఆయా కేసుల దర్యాప్తు, విచారణ దశాబ్ద కాలానికిపైగా కొనసాగుతుంది. మహారాష్ట్రలోని నాసిక్ జిల్లా మాలెగావ్ పట్టణంలో 2006 సెప్టెంబర్ 8న జరిగిన వరుస బాంబు పేలుళ్లలో 37 మంది మృతి చెందారు. ఈ కేసులో లోకేశ్ శర్మ, ధన్‌సింగ్, మనోహర్ సింగ్, రాజేంద్ర చౌదరిలపై చార్జిషీట్లు దాఖలయ్యాయి. వీరితోపాటు మరో ముగ్గురికి 2011 నవంబర్ 16న బెయిల్ మంజూరైంది. 2016 ఏప్రిల్ 25న పూర్తిగా కేసు నుంచి వీరికి విముక్తి లభించింది. ఈ కేసులో ముంబై ఏ.టి.ఎస్, సి.బి.ఐ నిర్ధారణలతో జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఏ) విభేదించింది. మాలేగావ్‌లోనే 2008 సెప్టెంబర్ 29న రంజాన్ సందర్భంగా జరిగిన శక్తిమంతమైన పేలుడు ఘటనలో ఆరుగురు మృతి చెందారు. బాంబు పేలుడుకు ఉపయోగించిన మోటార్ బైక్ సాధ్వి ప్రజ్ఞాసింగ్ పేరిట నమోదై ఉంది. ఆమెతోపాటు లెఫ్టినెంట్ కర్నల్ ప్రసాద్ పురోహిత్ తదితరులపై ఎన్ఐఏ అభియోగాలు నమోదు చేసింది. నిందితులు కేసు విచారణను ఎదుర్కొంటున్నారు.

సంఝౌతా ఎక్స్‌ప్రెస్ పేలుడు, భారత్, పాకిస్థాన్ మధ్య నడిచే సంఝౌతా ఎక్స్‌ప్రెస్ రైలులోని రెండు బోగీల్లో 2007 ఫిబ్రవరి 17న అర్ధరాత్రి దాటిన తర్వాత జరిపిన శక్తిమంతమైన బాంబు పేలుళ్లతో 68 మంది మృతి చెందారు. వారిలో అత్యధికులు పాకిస్థానీయులే. హర్యానాలోని పానిపట్‌లో జరిగిన పేలుడు కేసు దర్యాప్తును ఎన్ఐఏ నుంచి సి.బి.ఐకి అప్పగించారు. ఈ కేసులో సూత్రధారి స్వామి అసీమానందపై బలమైన సాక్ష్యాధారాలు ఉన్నాయి. అతడితోపాటు సందీప్ డాంగె, రాంజీ కల్సాంగ్రా అభియోగాలు ఎదుర్కొంటున్నారు. అజ్మీర్ షరీఫ్ పేలుడు, రాజస్థాన్‌లోని అజ్మీర్ షరీఫ్ దర్గా పక్కన గల కోర్టు ప్రాంగణంలో 2007 అక్టోబర్ 11న మోటారు సైకిల్‌లో పెట్టిన బాంబు పేలుడు పేలడంతో ముగ్గురు మృతి చెందారు. గతేడాది మార్చి 8న ఎన్ఐఏ ప్రత్యేక న్యాయస్థానం దేవేంద్ర గుప్తా, భావేశ్ పటేల్‌తోపాటు మరణించిన సునీల్ జోషిలను దోషులుగా నిర్ధారించింది. స్వామి అసీమానందతో పాటు మరో ఐదుగురిపై సాక్ష్యాధారాలు లేకపోవడంతో నిర్దోషులుగా ప్రకటించింది.

కేంద్రంలో ఆర్.ఎస్.ఎస్, బి.జె.పి నేతృత్వంలో అధికారంలో ఉన్న ఎన్.డి.ఏ ప్రభుత్వం చేతిలో ఒక సాధనంగా ఎన్ఐఏ వ్యవహరించి దోషులను తప్పించే ప్రయత్నం చేసిందన్న ఆరోపణలు కూడా ఎదుర్కొంటున్నది. 2-జి స్పెక్ట్రమ్ కేసులో, జయలలిత కేసులో, సి.బి.ఐ న్యాయమూర్తి బిహెచ్ లోతూ అనుమానస్పద మృతిపై వెలుబడిన తీర్పులు రాజకీయ జోక్యాన్ని స్పష్టం చేశాయి. అలాగే గుజరాత్‌లో నరోదా పాటియాలో జరిగిన మారణకాండకు పురికొల్పిన మంత్రి మాయా కోద్నానీకి కింది కోర్టులో శిక్షకు గురయ్యారు. అదే కేసులో మాయా కొడ్నానీతో సహా 18 మందిని నిర్దోషులుగా గుజరాత్ హైకోర్టు ఏప్రిల్ 20న తీర్పు వెల్లడించింది.

దీంతో భారత్‌లో నిఘా సంస్థలు 'చేసేది తక్కువ మనేది ఎక్కువ' అన్న చందంగా మారాయి. అరెస్టులు చేస్తారు, సంచలన వార్తలు వ్యాప్తి చేస్తారు. కస్టడిలోకి తీసుకుని విచారణ జరుపుతారు. మరిన్ని సాక్ష్యాలు కావాలంటారు. అంతా ముగిసాకా తగిన సాక్ష్యాధారాలు లేవని, నిర్ధారణలు సరిగాలేవని కేసులు కొట్టివేయడం ఒక ప్రహసనంగా మారింది. మక్కా కేసులో సంఘటన నిజమైనప్పుడు దానికి కారణం ఏవరో ఉండి తీరాలి కదా! ఈ సందేహాలకు సమాధానాన్ని ఆధారాలతో సహా నిరూపించాల్సిన బాధ్యత దర్యాప్తు సంస్థలది. మక్కా మసీదు పేలుళ్ల కేసులో నిర్దోషులుగా ప్రకటించబడిన ఐదుగురు నిందితుల్లో ఒకరు ఇప్పటికే అజ్మీరు దర్గా కేసులో దోషిగా నిర్ధారించబడ్డాడు. ఇది నాంపల్లి కోర్టు ఇచ్చిన తీర్పులోని డొల్లతనాన్ని ధృవీకరిస్తోంది. కేసును నీరుగార్చటం వెనుక ఉన్న శక్తులు ఎంత బలమైనవో అనే భావన సర్వత్రా కలుగుతున్నది. ఆ శక్తులను బయటపెట్టాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

మక్కా మసీదు పేలుళ్ల కేసులో మొత్తం 230 మంది సాక్షులను ఎన్ఐఎ విచారించి చివరకు "కొండను తవ్వి ఎలుకను కూడా పట్టని" చందంగా వ్యవహరించిందనే చెప్పాలి. అందుకు కారణం.. కారకులు ఎవరనేది బహిరంగ రహస్యం... జగమెరిగిన సత్యమే. స్వామి అసీమానంద్, తదితరులు ముస్లింల ప్రార్థనా ప్రదేశాలను లక్ష్యంగా చేసుకోడానికి కుట్ర పన్నినట్లు నిందితులుగా ఎన్ఐఎ చార్జిషీటులో పేర్కొంది. 2005-2007 మధ్య మక్కా మసీదు పేలుళ్లతో సహా పలు ప్రాంతాల్లో మైనార్టీలపై దాడులకు పాల్పడేందుకు వీరు ప్రణాళిక రచన చేసినట్లుగా ఎన్ఐఎ చార్జిషీటులో పేర్కొంది. ఎన్ఐఎ 2011, ఏప్రిల్‌లో కేసు విచారణను చేపట్టి 2011, మే 16న అనుబంధ చార్జిషీటు దాఖలు చేసింది. రెండవ అనుబంధ చార్జిషీటు 2012, జూలై 16న, మూడవ చార్జిషీటు 2013, ఆగస్టు 28న ఎన్ఐఎ దాఖలు చేసింది.

2014, ఫిబ్రవరి 13న ఎన్ఐఎ కోర్టు నిందితులపై అభియోగాలు మోపి, సాక్షులకు సమన్లు జారీ చేసింది. అసీమానంద్ నేరంగీకార ప్రకటనపైనే ఎన్ఐఎ ఎక్కువగా ఆధారపడింది. న్యూఢిల్లీలోని తీస్‌హజారీ కోర్టులో మెజిస్ట్రేట్ ఎదుట అసీమానంద్ తన నేరంగీకార ప్రకటన ఇచ్చారు. మక్కా మసీదుతో సహా వివిధ ప్రదేశాల్లో బాంబు పేలుళ్లకు కుట్ర పన్ని అమలు చేయడానికి ప్రయత్నించినట్లు మెజిస్ట్రేట్‌కు ఆయన "వెల్లడించాడు". ఆ తరువాత అసీమానంద్ మాట మార్చి బలవంతంగా తన చేత నేరంగీకార ప్రకటన చేయించారని పేర్కొన్నారు. నిందితులపై నేరాన్ని నిరూపించేందుకు ప్రాసిక్యూషన్ మొత్తం 226 మంది సాక్షులను విచారించి చార్జిషీటు దాఖలు చేసింది. నిందితులపై ఆరోపణలకు సాక్ష్యాలు చూపడంలో ఎన్ఐఎ విఫలమైందని తీర్పులో పేర్కొన్నారు. పేలుడుకు వాడినట్లు ఆరోపిస్తున్న సిమ్ కార్డులు నిందితులు వినియోగించినట్లుగా ఆధారాలు లేవు. మక్కా మసీదు, అజ్మీర్ దర్గా పేలుళ్లకు ఒకే సిమ్ కార్డు వినియోగం చేశారనే దానికీ ఆధారాలు లేవు. బాబూలాల్ యాదవ్ పేరిట దేవేందర్‌గుప్తా సిమ్ కార్డును

కొన్నారడానికీ సాక్ష్యాలు లేవు. స్వామి అసిమానంద నేరంగీకారానికి చట్టబద్దత లేదు.

మక్కామసీదు బాంబు పేలుళ్ల పూర్వాపరాలలోకి వెళితే, హైదరాబాదు లోని చార్మినార్ సమీపంలో గల మక్కా మసీదు లోపల వజూఖానా వద్ద ఇంప్రూవైజ్డ్ ఎక్స్‌ప్లోజివ్ డివైస్ (ఐఇడి) పేలుడు సంభవించింది. మసీదు లోపల పెట్టిన మరో రెండు ఐఇడిలను కూడా కనుగొని వాటిని బాంబ్ స్క్వాడ్ బలహీనం చేసింది. వజూఖానా వద్ద ఐఇడి పేలుడు ఘటనలో తొమ్మిది మంది మరణించగా 58 మంది గాయపడ్డారు. పేలుడు సంభవించిన సమయంలో శుక్రవారం ప్రార్థనలు చేసేందుకు మసీదు లోపల 10 వేల మంది వరకు జనం ఉన్నారు. మక్కా మసీదు పేలుళ్ల ఘటన అనంతరం జరిగిన ఆందోళనను అణచివేసేందుకు పోలీసులు జరిపిన కాల్పుల్లో మరో 9 మంది మరణించారు. సంచలనం సృష్టించిన మక్కా మసీదు పేలుళ్ల కేసును నాంపల్లి న్యాయస్థానం కొట్టేసి, నిందితులను నిర్దోషులుగా ప్రకటిస్తూ తీర్పు యివ్వడంతో ప్రజలు న్యాయ వ్యవస్థపట్ల విశ్వాసం కోల్పోయారు.

దేశంలో ప్రస్తుతం దోషులు నిర్దోషులుగా మారిపోతున్నారు. సాక్ష్యాధారాలు లేవని, అభియోగాలు నిరూపించడంలో ప్రాసిక్యూషన్ విఫలమైందన్న కారణం చూపి నిందితులను నిర్దోషులుగా ప్రకటించి, కేసు కొట్టివేయడం దోషులను తప్పించే ప్రయత్నంగా కనిపిస్తున్నదనడం నిస్సందేహం. అయితే ఈ వైఫల్యానికి కారణం ఏమిటి? యాదృచ్ఛికమా.. పై నుండి ఏదైనా వత్తిడి వచ్చిందా? నిజంగానే ఆధారాలు దొరకలేదు.. దొరికినా పట్టించుకోలేదా? అన్న సందేహాలకు సమాధానాలు కావాలి. వ్యవస్థలన్నింటిని నాశనం చేసి సర్వాధికారాలను తమ చేతిలో పెట్టుకోవాలని పాలకులు తపిస్తున్న ప్రస్తుత పరిస్థితుల్లో ఏ సందేహాన్ని విస్మరించలేని సందర్భంలో మనమున్నాం.

ప్రతి పరిణామాన్ని అనుమానించాల్సిన దుస్థితి నేడుంది. నిష్పక్షపాతంగా దర్యాప్తు సంస్థలు చేయాల్సిన పనిని పాలకవర్గాలు తమ ఆశ్రితుల కోసం, స్వార్థ ప్రయోజనాల కోసం దర్యాప్తు సంస్థలను, కోర్టులను ప్రభావితం చేస్తున్నారు.

మక్కా పేలుళ్ల కోర్టు తీర్పుపై ప్రభుత్వం ఉన్నత న్యాయస్థానంలో అప్పీలుకు వెళ్లి తమ చిత్తశుద్ధిని నిరూపించు కోవడంతోపాటు దోషులకు శిక్షలు పడేటట్లు చూడవలసిన అవసరం, పేలుళ్లలో మరణించిన బాధితుల కుటుంబాలకు న్యాయం జరిగేటట్లు చూడవలసిన బాధ్యత తమపై ఉందన్న విషయం గుర్తెరిగి వ్యవహరించి నైతికతను నిరూపించుకోవలసిన అవసరం ఉంది.

తీర్పు వెల్లడించిన వెంటనే మరో రెండు మాసాలలో పదవీ విరమణ చేయనున్న ఎన్ఐఏ న్యాయస్థానం ప్రధాన న్యాయమూర్తి రవీందర్ రెడ్డి ఆ తర్వాత కొద్ది గంటల్లోనే రాజీనామా సమర్పించడం తీవ్ర సంచలనం సృష్టించింది. రాజీనామా లేఖను ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి పంపించారు. ఇది పలు అనుమానాలు రేకెత్తడానికి, పలు ప్రశ్నలు లేవనెత్తడానికి దారితీసింది. న్యాయమూర్తి రవీందర్‌రెడ్డి నిందితులను నిర్దోషులుగా ప్రకటిస్తూ తీర్పు ఇవ్వడానికి ఆయనపై కేంద్ర ప్రభుత్వాధినేతలు ఎవరైనా ఒత్తిడి చేశారా? ఆ విధంగా తీర్పు వెలువరించవలసి రావడం తన మనస్సాక్షి అంగీకరించని కారణంగానే రవీందర్‌రెడ్డి రాజీనామా చేశారా? లేక మరేమైనా కారణాలు ఉన్నాయా అన్న ప్రశ్నలు ఉదయిస్తున్నాయి.

కోర్టు తీర్పు వెలువడగానే సమస్యను సమస్యగా చూడకుండా సంఘటన తీవ్రత గమనించకపోవటం బాధాకరం. ఈ సమయంలో బిజెపి, కాంగ్రెస్, ఎం.ఐ.ఎం పరస్పర విమర్శలు చేసుకోవడం బాధ్యతారాహిత్యం తప్ప మరొకటి కాదు. మక్కా మసీదు సంఘటన జరిగిన కాలంలో కాంగ్రెస్ అధికారంలో ఉంది. కోర్టు తీర్పు సమయంలో బిజెపి పాలన కొనసాగుతున్నది. కాంగ్రెస్, బిజెపిలు రెండు పార్టీలు దేశంలో మైనార్టీ ప్రజల్లో అభద్రతా భావాన్ని పెంచి పోషించాయి. బాబ్రీ మసీదును కూల్చింది బిజెపి పార్టీ, ఆర్ఎస్ఎస్ శ్రేణులే! పాలనలో ఉండి కూడా ఏమీచేయలేకపోయింది కాంగ్రెస్. సుదీర్ఘకాలం పేరు మోసిన దర్యాప్తు సంస్థలు పరిశోధించినా మక్కా బాంబు పేలుడు కేసులో దోషులను పట్టుకోకపోవడం ఈ సంస్థల వైఫల్యం మాత్రమే కాదు, పాలకుల అసమర్థతేనని మరవకూడదు. ఏలికలకు చిత్తశుద్ధి ఉంటే ఏనాడో దోషులు దొరికేవారు. తీర్పు వెలుబడిన తరువాత ఇప్పుడు సమీక్షిస్తామని అధికారులు చెబుతున్నారు. ఈ సమీక్షలు, వివరణలు ఎలా ఉన్నప్పటికీ మక్కా మసీదు కేసులో దోషులెవరో ఇప్పటికైనా తేల్చాలి. వారికి శిక్ష పడేలా చూడాలి. శిక్షించాలి.

న్యాయం, ధర్మంపై నమ్మకం పోతే, ఇదే విధంగా దోషులు నిర్దోషులుగా బయటికి వస్తే, అమానుష మారణకాండలన్నీ సహజ మరణాలుగా మారిపోతే లేదా హంతకులకు శిక్షపడకపోతే దాని ప్రభావం సమాజంపై ఏ విధంగా ఉంటుందోనన్న ఆందోళన ప్రతి ఒక్కరిని వేధిస్తుంది. ప్రజలకు న్యాయ వ్యవస్థ పట్ల విశ్వాసం కల్పించాలి. దీనికి భిన్నంగా జరిగితే సామాన్యులు న్యాయ వ్యవస్థపై నమ్మకం కోల్పోయే ప్రమాదం ఉంది. అదే జరిగితే ప్రజాస్వామ్యమే ప్రమాదంలో పడుతుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

## వచ్చే సంచికలలో...

- **దళితుల చరిత్ర - భౌగోళిక మూలాలు - డా. కత్తి పద్మారావు**
- **భారతదేశంలో ఫాసిజం - బి. అనురాధ**
- **మార్క్స్ పరాయీకరణ సిద్ధాంతం - అరణ్య, మార్క్సిజం మానవాళి విముక్తి సిద్ధాంతం - చిమ్మె జాన్ బర్నబాస్, మార్క్సిజాన్ని నేర్చుకుందాం - వెంకటేశ్వర రావు, తత్వశాస్త్రానికి మార్క్స్ కానుకలు - ఎన్. వేణుగోపాల్.**

# ఆంధ్రప్రదేశ్‌లో పెరిగిన అత్యాచారాలు

***రాష్ట్రంలోనే కాకుండా దేశవ్యాప్తంగా ఎక్కడ చూసినా మహిళలపై, ముఖ్యంగా చిన్నారులపై లైంగిక దాడులు తీవ్రమయ్యాయనీ, నిందితులకు కఠినమైన శిక్షలు, పిల్లల్లో చైతన్యం పెంపొందించడం ద్వారా ఈ దుర్మార్గాలను అరికట్టవచ్చనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇటీవల చిన్నారులపై అత్యాచారాలు జరగడం సర్వసాధారణమైపోయింది. పూర్తిగా 5 – 10 ఏళ్ల వయస్సులోపు పిల్లలపై అత్యాచార సంఘటనలు చాలా ఎక్కువగా నమోదు అవుతున్నాయి. ఆడుతూ పాడుతూ ఆనందంగా గడపాల్సిన బాల్యం మృగాళ్ల విష కౌగిట్లో చిక్కుకుంటోంది. సుకుమారమైన లేతప్రాయం కామాంధుల ఉక్కు పిడికిళ్ల మధ్య నలిగిపోతోంది.

ఇటీవల (మే 2న) గుంటూరు జిల్లా దాచెపల్లిలో 9 ఏళ్ల చిన్నారిపై 55 ఏళ్ల వ్యక్తి (అన్నం సుబ్బయ్య) సాగించిన అత్యాచారం గురించి ఆందోళన చెందని వ్యక్తి లేదు. మౌనంగా రోదించిన హృదయాలు ఎన్నో.

రాష్ట్రంలో ఇటీవల మహిళలపై అత్యాచారాలు, లైంగిక దాడులు, అరాచకాలు, హత్యలు ఎక్కువైపోయాయి. దాదాపు పసి పిల్లల నుంచి పండుటాకుల్లాంటి ముసలివాళ్ల దాకా ఈ అత్యాచార ఘటనలకు బాధితులవుతున్నారు. వీటి బారి నుండి తప్పించుకోలేక పోతున్నారు. ఇవన్నీ కేవలం వెలుగులోనికి వచ్చిన సంఘటనలే. వెలుగులోనికి రానివి ఎన్ని ఉన్నాయో? లెక్క తెలియదు.

ప్రతి జిల్లాలోనూ, ప్రతి మండలంలోనూ ఏదో ఒక రకమైన అత్యాచారం, లైంగిక దాడి మహిళలపై జరుగుతూనే ఉన్నాయి. వెలుగులోనికి వచ్చిన సంఘటనలపై కూడా ప్రభుత్వ అధికారుల స్పందన, సహకారం–తోడ్పాటు సరిగ్గా ఉండడంలేదు. బాధితులకు రక్షణ కల్పించడంలో విఫలమవుతున్నారు. అత్యాచారం జరిగిన తర్వాత కూడా నిందితుల నుంచి, నిందితుల బంధువుల నుంచి రక్షణ ఉండడం లేదు. కశ్మీర్‌లోనైతే ఏకంగా నిందితుల అరెస్ట్‌ను నిరసిస్తూ నిరసన ప్రదర్శనలు, రాస్తారోకోలు జరిగాయి.

ఇంత దుస్థితిలో ఈ దేశ మహిళల పరిస్థితి ఉంది. దీనికి మొత్తం సమాజంలోనే మార్పు రావలసిన అవసరం ఉన్నది. ప్రజల నుంచి తీవ్రమైన నిరసన, ఆందోళన, ప్రతిఘటన ఉన్న చోట్లలోనే ప్రభుత్వం త్వరగా స్పందిస్తున్నది.

దీనికి ఉదాహరణ గుంటూరు జిల్లా దాచేపల్లి సంఘటనలో ప్రజా వ్యతిరేకతను, నిరసనను ప్రభుత్వం చవి చూడాల్సి వచ్చింది. అందుకే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రాష్ట్ర వ్యాప్తంగా ప్రజా ప్రదర్శనలకు పిలుపునిచ్చాడు. బహిరంగ సభలు ఏర్పాటు చేశాడు. వాస్తవానికి అధికారంలో ఉన్నవారి అండదండలతోనే ఇలాంటి కేసులు విచారణను ఎదుర్కోకుండా, పోలీస్ స్టేషన్‌లోనే రాజీ అయ్యే పరిస్థితి నెలకొని ఉంది. కేవలం కొన్ని కేసులు మాత్రమే నేరం విచారణను ఎదుర్కొని శిక్షలు వేయబడే స్థాయికి వస్తున్నాయి.

ఈ నెల మొదటి వారంలోనే గుంటూరు జిల్లాలో దాదాపు 12 కేసులు నమోదయ్యాయి. మహిళలపై నేరాలకు సంబంధించి జనవరి నుంచి ఏప్రిల్ 2018 వరకు (4 నెలల్లో) ఇప్పటికే 281 కేసులు నమోదయ్యాయి. ఆడ పిల్లలను బయటకు పంపించాలంటేనే భయపడి పోయే పరిస్థితి నెలకొన్నది. ఈ మధ్య కాలంలో చిన్న పిల్లలపై ఎక్కువ అఘాయిత్యాలు చేస్తున్నారు. అందుకు తమను ఎవరూ ఏమీ చేయలేరనే ధీమా నేరం చేసే వారిలో ఉంది కాబట్టే ఆ విధమైన బరితెగింపుకు పాల్పడుతున్నారు.

మొన్న కథువా, నిన్న ఉన్నావ్, తాజాగా దాచేపల్లి, పాపం పుణ్యం ఎరుగని చిన్నారులపై అఘాయిత్యాలకు సంబంధించిన ఘటనలు దేశమంతటా మరీ ఇటీవల ఉభయ తెలుగు రాష్ట్రాలలో ఎక్కువగా వెలుగు చూస్తున్నాయి. పన్నెండు ఏళ్లలోపు బాలికలపై అత్యాచారానికి పాల్పడితే మరణ శిక్ష విధిస్తామని, మునుపటి కనీస శిక్షల కాలాన్ని పెంచుతూ లైంగిక దాడుల నుంచి పిల్లలను కాపాడుకునేందుకు బాలల రక్షణ చట్టం (పిఒసిఎస్ఒ) యాక్ట్‌కు సవరణలు తీసుకొని వచ్చినా దురాగతాలకు అడ్డుకట్ట పడడం లేదు. దీని ఫలితంగా ఆనందం, ఆత్మ విశ్వాసంతో ఎదగవలసిన బాల్యం ఆందోళన, అభద్రతల మధ్య నలిగిపోతోంది.

ఎన్‌సిఆర్‌బి (నేషనల్ క్రైం రికార్డ్ బ్యూరో) ప్రకారం దేశంలో 2016లో బాలలపై సగటున రోజుకు 293 నేరాలు చోటు చేసుకుంటున్నాయి. వాటిలో 100 లైంగిక దాడులు, అత్యాచారాలకు సంబంధించినవే కావడం విచారకరం, విశృంఖలతకు, విష సంస్కృతికి అద్దం పడుతోంది.

ఆంధ్రప్రదేశ్‌లో సగటున రోజుకు 5, తెలంగాణలో సగటున రోజుకు 8 నేరాలు నమోదవుతున్నాయి. గత సంవత్సరం 2017, అంతకు ముందు 2016తో పోల్చితే దాదాపు 19.6 శాతం నేరాలు పెరిగాయి (బాలలపై). ఇందులో 4.40 శాతం లైంగిక దాడులు, అత్యాచార ఘటనలు. బాధితులలో 43.2 శాతం మంది మైనర్ బాలికలే కావడం గమనార్హం. వారిలోనూ 5.4 శాతం మంది పన్నెండు ఏళ్లలోపు చిన్నారులే కావడం విచారకరం.

ఇంత జరుగుతున్నా నేరాల నియంత్రణలో సంబంధిత వ్యవస్థలు, విచారణ ఏజెన్సీలైన పోలీసు వ్యవస్థ, స్త్రీ–శిశు సంక్షేమ శాఖ, సాంఘిక సంక్షేమ శాఖ ఘోరంగా విఫలమయ్యాయి. కేసులను సమగ్రంగా దర్యాప్తు చేసి, అభియోగ పత్రాలు దాఖలు పరిచి నేర నిరూపణ జరిగేలా చర్యలు తీసుకోవడంలో ఘోరంగా విఫలమవుతున్నాయి, సమర్థవంతంగా వ్యవహరించలేకపోతున్నాయి.

వాస్తవానికి అత్యాచారాలకు పాల్పడే నిందితులలో ఎక్కువ 90 శాతం మంది పరిచయస్తులు, బంధువులు, అదే వీధిలో నివసించేవారే. కొన్ని

సందర్భాలలో కుటుంబానికి అత్యంత సన్నిహితులు కూడా కావచ్చు. ఎన్నో రోజుల నుంచి అదే పనిగా కాపుగాసి, ఒక కసితో అత్యాచారానికి పాల్పడుతున్నారు.

2015లో నివేదిక సమర్పించిన జాతీయ నేర గణాంక సంస్థ (ఎన్‌సిఆర్‌బి) ప్రకారం దేశ వ్యాప్తంగా బాలికలపై 8,800 అత్యాచార ఘటనలు, పిఒసిఎస్‌ఒ చట్టం ప్రకారం నమోదు కాగా అందులో 8,341 మంది బాధితులకు తెలిసినవారు, సన్నిహితులేనని తేలింది. అందులో 3,149 మంది బాధితులు ఇరుగు-పొరుగు వారేనని తేలింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 132 ఘటనలు, తెలంగాణలో 135 ఘటనలు చోటు చేసుకున్నాయి. ఇవి కేవలం రికార్డులలో నమోదైనవి మాత్రమే, బయటికి వచ్చిన విషయాలు మాత్రమే. బటయ పడనివి ఎన్నో.

మొత్తం అన్ని సంఘటనలలోను చిన్నారులను నమ్మించి, మోసం చేసి, వారికి వేరే తిండి పదార్థాలు ఆశచూపి అత్యాచారాలకు పాల్పడిన ఘటనలే. బాధితులలో చాలా మంది అనవసర పరువు-ప్రతిష్టలకు పోయి లేదా నిందితులకు భయపడి పోలీస్ స్టేషన్‌లలో ఫిర్యాదు చేయడం లేదు. దీనివలన సమాజంలో నేరగాళ్లకు అడ్డూ అదుపూ లేకుండా పోయింది. అందువలన మళ్లీ మళ్లీ అదే విధమైన నేరాలకు పాల్పడుతు న్నారు. పైగా నిందితులలో కొంతమంది కుటుంబ సభ్యులు, తల్లిదండ్రు లు, ఎవరూ ఉండకపోవడం, మానసికంగా కృంగి, తాము బయట ఉన్నా, జైల్లో ఉన్నా ఒక్కటే అనే స్వభావం కూడా అత్యాచారాలకు ఒడిగట్ట డానికి ఒక కారణంగా కూడా ఇటీవల మానసిక వైద్యులు నిర్ధారించారు.

బాలికలపై అత్యాచారాలు, నేరాలు జరిగినప్పుడు హడావిడి చేసే పోలీసు యంత్రాంగం, బాధితులకు సంపూర్ణమైన రక్షణ కల్పించడంలో పూర్తిగా విఫలమవుతున్నారు. పైగా కోర్టులలో కేసులు విచారణకు వచ్చే వరకు, బాధితులకు సహాయ సహకారాలు అందించడంలో పోలీసు వ్యవస్థ వైఫల్యం చెందుతున్నది. నిందితుల నుంచి ఏదో ఒక విధంగా డబ్బు వసూలు చేసుకొని బాధితుల రక్షణ బాధ్యత తమది కాదన్నట్లు వ్యవహరిస్తున్నారు. అవసరమైన శాస్త్ర, సాంకేతిక, న్యాయ వైద్య శాస్త్ర (ఫోరెన్సిక్ రిపోర్ట్) ఆధారాల సేకరణను పకడ్బందీగా నిర్వహించడం లేదు.

పిఒసిఎస్‌ఒ చట్టం కింద కేసులు నమోదవుతున్నా న్యాయ స్థానాలలో నిరూపించబడడం లేదు. టెక్నికల్‌గా కేసులు వీగిపోతున్నాయి. 2014-16 సంవత్సరాల మధ్య దేశ వ్యాప్తంగా బాలలపై నేరాలకు సంబంధించి 64,464 కేసులు విచారణ పూర్తి కాగా, అందులో 21,324 కేసుల్లో మాత్రమే శిక్షలు పడ్డాయి. గత 3 ఏళ్లలో సగటు శిక్షలు 33.13 శాతం మాత్రమే. దీని ప్రకారం న్యాయ స్థానాలలో విచారణ పూర్తయిన కేసులలో నూటికి 67 కేసులు కొట్టివేయబడుతున్నవని తేలిపోయింది. దీని ద్వారా ప్రాసిక్యూషన్ ఎంత నిర్లక్ష్యంగా ఉందో అర్థమవుతుంది.

ఈ అత్యాచారాలు మదర్సాలలోను, చర్చిలలోను, ఆశ్రమాలలోను విచ్చలవిడిగా జరుగుతున్నాయి. వారికి విద్యను బోధించే క్రమంలో, సేవల పేరుమీద లైంగికంగా వేధిస్తూ, చివరకు వారిని లోబర్చుకొని, వారిని గర్భిణులుగా మార్చుతున్నారు. ఇది ఏదో ఒక విధంగా బయటకు వచ్చినప్పుడు అవి కేసులుగా నమోదు కాబడుతున్నాయి.

ఇటీవల హైదరాబాద్‌లోని ఆసిఫ్‌నగర్ పోలీస్ స్టేషన్ పరిధిలోని మదర్సాలో (అరబ్బీ, ఉర్దు, ఖురాన్ బోధించే పాఠశాల) మహ్మద్ రెహాన్ అనే ఉపాధ్యాయుడు చిన్న పిల్లలపై వరుసగా అత్యాచారాలకు పాల్పడుతున్నాడు. ఇతను ఉద్యోగం కొరకు బీహార్ రాష్ట్రంల నుంచి వచ్చి ఇక్కడ పనిచేస్తున్నాడు. ఇతనిపై పిఒసిఎస్‌ఒ చట్టం 2012తో పాటు ఐపిసి సెక్షన్ 377, 506 కింద కేసు నమోదు కాబడింది. ఈ ఉపాధ్యాయుడు దాదాపు 15 మంది పిల్లలను అత్యాచారం గావించినట్లు పోలీసు విచారణలో తేలింది. హైదరాబాద్ నడిబోడ్డునే ఈ పరిస్థితి ఉంటే మారుమూల ప్రాంతాలలో ఎంత దారుణంగా ఉంటుందో ఊహించుకోవచ్చు.

సెల్‌ఫోన్‌లు, ఇంటర్నెట్‌లు, టివిల వినియోగం పెరిగిన తర్వాత పిల్లలలో నేర ప్రవృత్తి ఎక్కువైందన్నది నిర్వివాదాంశం. ఇందుకు ఎన్‌సిఆర్‌బి గణాంకాలే నిదర్శనం. అంతర్జాలం అంతగా అందుబాటులో లేని రోజుల్లో అనగా 2010లో దేశ వ్యాప్తంగా మైనర్లపై 858 అత్యాచార ఘటనలు నమోదు కాగా, 2016 నాటికి ఇవి 1905కు చేరింది. అనగా 54.96 శాతం పెరిగింది. అనగా పిల్లలలో పెరిగిన అత్యాచార నేర స్వభావం తీవ్రత ఏ విధంగా ఉందో అర్థమవుతున్నది.

బాల్యంలో లైంగిక దాడికి గురైన బాధితులు, యుక్త వయస్సు వచ్చాక కూడా ఆ దారుణ స్మృతుల నుండి బయటపడలేక పోతున్నారు. ఈ చేదు జ్ఞాపకాలు చాలా మందిని జీవితాంతం వెంటాడుతున్నాయి. మానసిక ఆందోళనలకు, వ్యధలకు గురిచేస్తున్నాయి. పదే పదే ఆ ఘటనలను గుర్తు చేసుకుంటూ కుమిలిపోతున్నారు. ప్రభుత్వ సంస్థలు వారికి సరైన కౌన్సిలింగ్ ఇప్పించి, వారిలో ఆత్మస్థైర్యం నింపేలా కృషి చేయాలి. నేరస్థునికి సాధ్యమైనంత త్వరితగతిన శిక్షలు పడేలా విచారణా ప్రక్రియ పూర్తవ్వాలి.

ఈ నేపథ్యంలోనే ఇటీవల పిఒసిఎస్‌ఒ చట్టానికి సవరణలు చేశారు. రెండు నెలల్లో దర్యాప్తు, విచారణ పూర్తవ్వాలని కాలపరిమితి విధించడం ఆహ్వానించదగినదే. కుటుంబంలో పెద్దలు, పాఠశాలల్లో ఉపాధ్యాయులు పిల్లలను చైతన్య పరిచే బాధ్యతను తీసుకోవాలి. పాఠశాల స్థాయిలలో నైతిక విలువలు, మానవతా విలువలు బోధనాంశాలుగా విద్యా బోధన ఉండాలి. ప్రభుత్వ సంస్థలన్నింటిలోను పిఒసిఎస్‌ఒ చట్టంపై రాత మూలకంగా ఉండాలి. గోడ పత్రికలు విడుదల చేయాలి, చైతన్య ర్యాలీలు చేపట్టాలి. ప్రజలు ఫిర్యాదు చేయడానికి ఒక ప్రత్యేక శాఖను ఏర్పాటు చేయాలి. అప్పుడే ఇలాంటి దాడులను కొంతైనా అరికట్టవచ్చు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. - సం.*

# అత్యాచారాలకు అంతమెప్పుడు?

***కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చాక దళిత, ఆదివాసి, మైనారిటీల హత్యలు, మహిళలపై అత్యాచారాలు పెరిగిపోయాయనీ, వీటిని అరికట్టడానికి ప్రజావెల్లువ ఉద్యమించాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* లింగంగుంట్ల గజేంద్రమ్మ**

కేంద్రంలో బిజెపి ఆధ్వర్యంలో నరేంద్రమోడీ ప్రభుత్వం ఏర్పడిన తరువాత మహిళలపై అకృత్యాలు పెరగడం ఒకెత్తయితే వాటిలో కుల, మతాలను చొప్పించడం మరో ఎత్తు. వరుసగా జరుగుతున్న దారుణ అత్యాచార సంఘటనలు దేశ వ్యాప్తంగా సంచలనం కాగా, సామాన్య ప్రజలలో భయందోళనలు నెలకొన్నాయి. చిన్నపిల్లలపై లైంగిక అత్యాచారాలు జరుగుతున్న వార్త వినని రోజు లేదు. ఈ పరిస్థితి ఏ ఒక్క రాష్ట్రానికో, ప్రాంతానికో పరిమితమైనది కాదు. దేశంలో రోజుకు పదుల సంఖ్యలో ఈ ఘటనలు జరుగుతున్నాయి. ఈ వరుస సంఘటనలను పరిశీలిస్తే దేశంలో కేంద్ర, రాష్ట్రాలలో ప్రజాపాలన ఉందా? అటవిక గణరాజ్యాలు కొలువు తీరాయా? అన్న సందేహాలు కలగక మానవు.

కశ్మీరు కథువా అత్యాచార ఘటనలు కామంతో కళ్లు మూసుకుపోయిన కామ పిశాచాలకు గుడికి, ఇంటికి తేడా తెలియదు. ఆసిఫా కేసులో ఈ సమాజం పతనా స్థాయిని మనం చూడవచ్చు. సభ్య సమాజం సిగ్గుతో తలదించుకునే అంశాలున్నాయి. నేరస్థులను కాపాడడానికి హిందూ ఏక్తామంచ్, కొన్ని హిందుత్వ శక్తులు, బిజెపి ప్రేరేపిత న్యాయవాదులు నల్లకోట్లు వేసుకొని ఆసిఫాకు న్యాయం నిరాకరిస్తూ ర్యాలీలు నిర్వహించి కోర్టుల బంద్‌కు పిలుపునిచ్చిన న్యాయవాదుల పాత్ర ఉంది. నిందితులను విడుదల చేయాలంటూ నిస్సిగ్గుగా ఇద్దరు బిజెపి మంత్రులు నిరసన ర్యాలీలు, ధర్నాలకు దిగారు. ఇలాంటివి సర్వసాధారణమని, చిన్న సంఘటనలు అని, పటించుకోవలసిన అవసరం లేదని, అక్కడి బిజెపి నేత వ్యాఖ్యానించాడు.

యుపిలోని 'ఉన్నావ్' ఘటనలో కూడా అధికార బిజెపి ఎంఎల్ఎ కుల్దీప్ సింగ్ తనపై అత్యాచారం చేశాడని 17 ఏళ్ల దళిత యువతి పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేసినా పట్టించుకోలేదు. న్యాయం కోసం ఆ యువతి ముఖ్యమంత్రి యోగి ఇంటిముందు ధర్నాకు దిగింది. ధర్నా చేసిందనే అక్కసుతో ఆ ఎంఎల్ఎకి చెందిన సోదరుడు, గూండాలు బాధితురాలి ఇంటిపై దాడి చేసి ఆమె తండ్రిని కిడ్నాప్ చేసి దారుణంగా కొట్టారు. నిలువెల్లా నెత్తురోడుతూ బాధితురాలి తండ్రి స్థానిక పోలీస్ స్టేషన్‌కు వెళ్లి తనపై జరిగిన దాడిని చెప్పుకొని అక్కడే తనువు చాలించాడు. అయినా యోగి సర్కారులో చలనం రాలేదు. విషయం బయటికి పొక్కి హైకోర్టు రంగంలోకి దిగి సిబిఐ విచారణకు ఆదేశించాకనే ఎంఎల్ఎను అరెస్ట్ చేశారు. ఇది అటవిక రాజ్యం కాక మరేమిటి? నిందితుడైన బిజెపి ఎంఎల్ఎ బహిరంగంగానే బాధితురాలు తక్కువ కులానికి చెందిందని వ్యాఖ్యానించి, తక్కువ కులం మహిళలను ఎక్కువ కులస్థులు ఏమైనా చేయడానికి అధికారం ఉన్నట్లు బరితెగించాడు.

కశ్మీర్ కథువా ఘటనలో బాధితురాలైన ఆసిఫా ముస్లిం అయినందున ఆమెను చెరబట్టేందుకు హిందువులైన నిందితుల హక్కు అన్నట్లు వ్యవహరించారు. ఈ ఘటనపై ప్రధాని మోడీ తొలుత నోరు మెదపలేదు. పౌర సమాజం నుంచి పెద్ద ఎత్తున నిరసనలు వెల్లువెత్తాకనే మొక్కుబడిగా ఖండించి చేతులు దులుపుకున్నాడు. ఇలా ఈ నేరాలకు తన సమర్థనను తెలియజేసుకున్నాడు. 2012లో నిర్భయ సంఘటన జరిగినప్పుడు తీవ్ర నిరసన వ్యక్తం చేస్తూ అప్పటి ప్రధాని మన్‌మోహన్ సింగ్‌కు గాజులు పంపిన ప్రస్తుత బిజెపి కేంద్ర మంత్రులు స్మృతి ఇరానీ, సుష్మాస్వరాజ్‌లు మౌనం దాల్చారు. ఇప్పటి ప్రధానమంత్రికి ఏం పంపుతారోనని దేశ ప్రజలు ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. ఇది బిజెపి పాలిత భారతదేశంలోని 'బేటీ బచావ్', 'బేటీ పడావ్' ప్రభుత్వ నినాదాల మర్మం.

ఈ వరుస సంఘటనలను ప్రజలు మరువకముందే గుంటూరు జిల్లాలో మరో దారుణం జరిగింది. ఆడుతూ పాడుతూ ఆనందంగా గడపాల్సిన బాల్యం కామపిశాచి విష కౌగిట్లో చిక్కుకుంది. జిల్లాలోని పల్నాడు ప్రాంతమైన దాచేపల్లిలో 9 ఏళ్ల ముస్లిం మైనారిటీకి చెందిన చిన్నారిపై రిక్షానడిపే 55 ఏళ్ల వృద్ధుడు సుబ్బయ్య సాగించిన అమానుష అత్యాచారం గురించి విని చెమర్చని కళ్లులేవు. చలించని హృదయంలేదు.

దేశంలో మహిళలపై అందులో పసికూనలపై అత్యాచారాలు, అఘాయిత్యాలు, అరాచకాలకు అంతు ఉండడం లేదు. పసిపిల్లల నుంచి పండుటాకుల దాకా అత్యాచార బాధితులే. దేశంలో లైంగిక దాడుల ఘటనలు నానాటికీ పెరిగిపోతున్నాయి. గత నాలుగేళ్లుగా లైంగిక దాడి కేసులు వేల సంఖ్యలో నమోదు కావడమే ఇందుకు నిదర్శనం. ఈ ఘటనలు దేశంలో సామాజిక సంక్షోభానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి. ఈ సమాజపు పూర్తిస్థాయి పతన స్థితిని చూపుతున్నాయి.

దాచేపల్లి ఘటనపై ప్రజాగ్రహం వెల్లువెత్తింది. జిల్లా వ్యాప్తంగా ఆగ్రహావేశాలు వ్యక్తం అయ్యాయి. పలుచోట్ల నిరసన ప్రదర్శనలు జరిగాయి. దాచేపల్లిలో రెండు రోజులు ఆందోళనలు, బంద్‌లు కొనసాగాయి. అద్దంకి – నార్కట్‌పల్లి జాతీయ రహదారిపై రాస్తారోకోలు కొనసాగాయి. కొన్ని గంటల పాటు ట్రాఫిక్ స్తంభించింది. విశేషమేమంటే మొత్తం పౌర సమాజం కుల మతాలకతీతంగా స్పందించింది. ప్రజా ఆగ్రహాన్ని గ్రహించిన ప్రభుత్వం వెంటనే స్పందించింది. మొత్తం ప్రభుత్వ యంత్రాంగం దాచేపల్లిలో తిష్టవేసి పరిస్థితిని పర్యవేక్షించింది. ప్రత్యేక దళాలను రంగంలో దింపింది. వత్తిడికి గురైన నిందితుడు సుబ్బయ్య చెట్టుకు ఉరి వేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రజాగ్రహం ఎంతదాకా వెళ్లిందంటే సుబ్బయ్య మృతదేహాన్ని తమకు అప్పగించాలని, నడీ రోడ్డుపై

దానిని తగలపెట్టాలని దాచేపల్లిలో ఆందోనాకారులు భీష్మించుకు కూర్చున్నారు. హోంమంత్రి చినరాజప్ప కాన్వాయ్‌ని అడ్డుకుని ఆందోళన చేపట్టారు. రాజ్యాంగ వ్యవస్థలు విఫలమైననాడు ప్రజలే తిరగబడతారని, నేరగాళ్లకు వ్యతిరేకంగా ఉద్యమిస్తారు అనడానికి దాచేపల్లి సంఘటన చక్కటి ఉదాహరణ.

ఇక్కడ ప్రధానాంశం ఏమిటంటే అత్యాచార బాధితులు దాదాపు దళితులు, ముస్లింలు, ఆదివాసులు. ఉమ్మడి తెలుగు రాష్ట్రాలలో సంచలనం సృష్టించిన ఆయేషా మీరాపై అత్యాచారం, హత్యా సంఘటనలో అమాయకుడైన సత్యంబాబు చేయని నేరానికి శిక్ష అనుభవించి కోర్టు నిర్దోషిగా ప్రకటించడంతో ఇటీవల జైలు నుంచి విడుదలైనాడు. నిజమైన నిందితులు కనీసం ఇంతవరకు అరెస్ట్ కాలేదు. కారణం నిందితులు సంఘంలో రాజకీయ పలుకుబడి కలవారు కాబట్టి.

ఇక బిల్కిస్‌బానో 2002 గుజరాత్ అల్లర్ల సమయంలో తన సొంత గ్రామంలో (దాహోద్ జిల్లా) హిందూ మతోన్మాదుల మూక దాడి నుంచి తప్పించుకునే క్రమంలో దొరికిపోయి సామూహిక అత్యాచారినికి గురైన 19 ఏళ్ల గుజరాతీ ముస్లిం మహిళ ఆమె కళ్లెదుటే ఆమె 3 ఏళ్ల బిడ్డను, సొంత కుటుంబ సభ్యులైన మరో 13 మందిని మతోన్మాదులు కిరాతకంగా హతమార్చారు. ఇప్పుడు ఆమె వయస్సు 35 ఏళ్లు. ఆమెకు సరైన న్యాయం ఇప్పటికీ దక్కలేదు.

కశ్మీర్ కథువ బాధితురాలు ఆసిఫా 8 ఏళ్ల ముస్లిం పసిమొగ్గ. 'దోషులను ఉరితీయండి, లేదా మమ్మల్ని కాల్చి చంపండి' అంటూ బాలిక తల్లి ఆగ్రహిస్తూ న్యాయంపై అనుమానం వ్యక్తం చేసింది. అలాగే యుపి ఉన్నావ్ ఘటన బాధితురాలు దళిత యువతి. మహారాష్ట్రలోని భండార్ జిల్లాలో జరిగిన ఖైర్లాంజి ఘటనలో కూడా అత్యాచారం జరిపింది దళితులపైనే. 2007లో విశాఖ జిల్లా వాకపల్లిలో గ్రేహౌండ్ పోలీసులు 11 మంది ఆదివాసి మహిళలపై సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. ఈ ఘటనపై ఇంకా విచారణే పూర్తి కాలేదు. దోషులకు శిక్ష పడలేదు.

ఈ మొత్తం సంఘటనలో బాధితులు బలహీన వర్గాలేనన్నది గుర్తించాలి. ఈ వర్గాల ప్రజలు ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా బలహీనులు. రక్షణ చట్టాలున్న ఆధిపత్య వర్గాలకు చుట్టాలుగా మారడం, అమలులో జాప్యం, నిర్లక్ష్యం ఫలితంగా ఆది నుండి ఈ వర్గాలకు అన్యాయం జరుగుతుంది.

గత 70 ఏళ్ల భారత స్వాతంత్ర్య చరిత్రలో మహిళల రక్షణ కోసం అనేక చట్టాలు వచ్చాయి. 2012 నిర్భయ చట్టం చాలా కఠినమైనది. 12 లోపు బాలికలపై అత్యాచారం జరిపిన వారికి మరణ దండన విధించేలా (ఆర్డినెన్స్) చట్టాలు చేశారు. కానీ అత్యాచారాలు పెరుగుతూనే ఉన్నాయి. జాతీయ నేర గణాంకాల ప్రకారం 2014లో కేసుల సంఖ్య దేశ వ్యాప్తంగా 89,423 ఘటనలు చోటు చేసుకుంటే, పిల్లలపై అత్యాచారాలు 2015లో 94,172కి పెరిగాయి.

ఇక 2016లో ఈ సంఖ్య 1,06,958కి పెరిగాయి. 2017లో 2 లక్షలు దాటిందని అంచనాలు వేస్తున్నారు. రెండు మూడు కేసుల్లో దోషులకు మరణ శిక్షలు విధించిన తరువాత కూడా అత్యాచారాల సంఖ్య పెరిగిందే కానీ తగ్గలేదు.

ఇప్పుడు చేయాల్సింది అత్యాచారాలకు గల సామాజిక మూలాలను విశ్లేషించి ఒక మెరుగైన సమాజాన్ని నిర్మించుకోవాలి. ఇది నేడు మేధావులు, మొత్తం సమాజం ముందున్న కర్తవ్యం.

ఈ ప్రకృతిలో మొత్తం జంతువుల లైంగిక ప్రవృత్తిని పరిశీలిస్తే ఇవి ఓ నిర్ణీత సమయంలో స్త్రీ లింగ జంతువులు సంతానోత్పత్తికి సిద్ధమైనప్పుడు (యదైనప్పుడు) మాత్రమే సంభోగిస్తాయి. మిగతా సమయంలో వాటికి ఆ ఆలోచనే ఉండదు. అంటే ఏ జంతువు కూడా స్వజాతిని లైంగిక వాంఛతో చంపేంతగా అనుభవించవు అనేది స్పష్టం. మరి నాగరికుడుగా చెప్పుకునే మనిషి లైంగిక వాంఛతో తమ స్వజాతి పసి మొగ్గలను చంపేంత హీనస్థితికి దిగజారడానికి కారణాలు ఏమిటి? అనేదే అసలు ప్రశ్న.

ఆకాశం నుండి చక్కర్లు కొడుతూ భూమ్మీద ఉన్న కోడిపిల్లల వైపు దూసుకు వస్తున్న డేగను చూడగానే తల్లి కోడి ఒక రకమైన శబ్దంతో తమదైన భాషలో ప్రమాదాన్ని హెచ్చరిస్తూ తన పిల్లలను రెక్కల చాటున దాచుకుంటుంది. ఆహా! ఆ దృశ్యం చూడడానికి ఎంత ఆహ్లాదకరం. ఇలా మూగజీవులైన పక్షులు, జంతువులు తమ పిల్లల పట్ల ఎంత బాధ్యత, శ్రద్ధ చూపుతాయి. కానీ మన సభ్యసమాజంలో మానవ మృగాళ్ల నుండి పిల్లలకే కాదు తల్లులకు రక్షణ లేకుండా పోవడానికి కారణాలు ఏమిటి? దేశంలో పాతుకుపోయి ఉన్న బ్రాహ్మణీయ భావాజాలం. దీనికి మూలమైన మనుస్మృతి సమాజంలో నాటుకుపోయిన పితృస్వామ్య భావాజాలం, కులతత్వం, మతోన్మాదం కారణాలని పదేపదే రుజువు అవుతుంది.

ఈ దేశ బ్రాహ్మణీయ భూస్వామ్య సంస్కృతి స్త్రీని ఓ భోగ వస్తువుగా, శృంగార సాధనంగా చేస్తే, పెట్టుబడిదారీ సమాజం, సామ్రాజ్యవాద విష సంస్కృతి స్త్రీని సరుకుగా, ప్రకృతి పరమైన (సంతానోత్పత్తికి) సెక్స్‌ని వ్యాపారంగా అంగట్లో అంగడి బొమ్మగా చేసింది.

1991 నుండి దేశంలో అమలవుతున్న నూతన ఆర్థిక విధానాలు (ఎల్‌పిజి) మానవ సంబంధాలను మార్కెట్ సంబంధాలుగా మార్చి వేశాయి.

ఈ విష సంస్కృతి సమాజంలో పాతుకుపోయి బూతు సినిమాలు, మానవీయత విలువలు లేని సినిమాలు, టివి కార్యక్రమాలు, ఇంటర్నెట్, సెల్‌ఫోన్స్, మద్యం మొదలగు విచ్చలవిడి సెక్స్‌కు ఊతమిస్తున్నాయి. ఈ విష సాంస్కృతిక దాడి శ్రమ సంస్కృతిని దూరం చేయడమే కాక, కార్మిక, కర్షక, రైతుకూలీ మధ్య తరగతి ప్రజలపై తీవ్ర చెడు ప్రభావం చూపుతున్నాయి. కాబట్టి ఈ దుర్మార్గపు వ్యవస్థను ధ్వంసం చేయాలి. దీనికి పరిష్కారం సోషలిజంలోనే ఉంది.

వ్యక్తిగత ఆస్తికి తావులేని సమసమాజ నిర్మాణంలోనే మానవాళికి విముక్తి లభిస్తుంది. మొత్తం సమస్యలకు పరిష్కారం ఉంటుంది. సమాన పనికి సమాన వేతనం ఇక్కడ ప్రతి మనిషికి ఉపాధి, మంచి విద్య, వైద్య సౌకర్యాలు లభిస్తాయి. కుక్క కూడా ఆకలి చావు చావదు.

కొన్ని దశాబ్దాల పాటు రష్యా, క్యూబా, చైనాలలో కొనసాగిన సోషలిజం మానవాళికి ఒక అత్యున్నత, అద్భుత సమాజాన్ని పరిచయం చేసింది. ఈ స్ఫూర్తిని తీసుకొని సమసమాజ స్థాపన కోసం, స్త్రీ విముక్తి కోసం ఉద్యమిద్దాం.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

# కెసిఆర్-మోడీ పాలనలో పెరిగిన రైతుల ఆత్మహత్యలు

*నాలుగేళ్ల క్రితం అటు కేంద్రంలో నరేంద్రమోడీ, ఇటు రాష్ట్రంలో కెసిఆర్ అధికారంలోకి రావడానికి రైతులకు అనేక వాగ్దానాలు చేశారనీ, ఆ వాగ్దానాలు అమలు కాకపోగా ఈ పాలనా కాలంలో రైతు ఆత్మహత్యలు ఇంకా పెరిగాయనీ అంటున్నారు* **సాయన్న**

గత రెండు దశాబ్దాలుగా దేశ వ్యాప్తంగా మూడు లక్షల మంది, రాష్ట్రంలో దాదాపు 50 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడానికిగల కారణాలను పరిశీలించాల్సిన అవసరముంది. ఆ నేపథ్యంలో వ్యవసాయం రాష్ట్రం విషయం అయినా కేంద్ర ప్రభుత్వ పరిధిలో చాలా అంశాలున్నాయి. కేంద్రంలో, రాష్ట్రంలో ఎనిమిదేండ్లు కాంగ్రెస్ చేపట్టిన విధానాలు సంక్షోభాన్ని పెంచాయి. స్థూలంగా ఈ విధానాలు కార్పొరేట్లకు వ్యవసాయాన్ని అప్పగించే దిశగా ఉన్నాయి. ఈ పరిస్థితిని ఓటుగా మార్చుకోవడానికి నరేంద్రమోడీ రైతాంగానికి అనేక హామీలిచ్చాడు. తెలంగాణ సాధనకు కృషిచేసిన పార్టీగా టిఆర్ఎస్‌పై ప్రజలకు ఆశలు ఉండడం సహజం. అయితే ఈ ప్రభుత్వాలు రైతుల కష్టాలను తీర్చకపోగా మరింత పెంచాయి.

మోడీ మొదటి మూడేండ్ల పాలనలో 42 వేల మంది ఆత్మహత్య చేసుకున్నారు. కాంగ్రెస్ పాలనతో పోలిస్తే 12 శాతం పెరిగాయి. బిజెపి పాలిత రాష్ట్రాలైన మహారాష్ట్ర, ఛత్తీస్‌గఢ్, మధ్యప్రదేశ్‌లలో 50 శాతం పెరిగాయి. మన రాష్ట్రం మహారాష్ట్ర తరువాత రెండో స్థానంలో ఉంది. కెసిఆర్‌కు అవార్డులిస్తున్న సంస్థలు ఇందుకు కూడా అవార్డు ఇవ్వాల్సిందే. ఆత్మహత్య చేసుకుంటున్న వారిలో మహిళా రైతుల సంఖ్య పెరుగుతుంది. అదే విధంగా వ్యవసాయ కార్మికుల మీద ఈ సంక్షోభ ప్రభావముంది. వారి ఆత్మహత్యలను ప్రభుత్వం లెక్కలోకి తీసుకోవడం లేదు.

రుణమాఫీ అమలులో ప్రభుత్వం అవలంబించిన విధానం వల్ల రైతులకు లాభం కన్నా నష్టమే ఎక్కువ జరిగింది. రుణమాఫీకి మూడు సంవత్సరాలు పట్టింది. ఈ కాలంలో రైతులపై వడ్డీ భారం పడింది. ప్రభుత్వం చెల్లించిన మేరకే బ్యాంకులు రుణాలు ఇచ్చాయి. అంటే ఈ మూడు సంవత్సరాలు బ్యాంకు రుణాలు రైతులకు అందలేదు. అంతేకాదు ఇంకా రుణమాఫీ జరగని రైతులున్నారు. రైతులు పూర్తిగా ప్రైవేట్ అప్పుల మీదనే ఆధారపడాల్సి వచ్చింది. ఈ అస్తవ్యస్త విధానం వల్ల 2014-16 మధ్యలో పెద్దఎత్తున ఆత్మహత్యలు జరిగాయి. వీటిని నివారించాలని అన్ని రైతు సంఘాలు రాష్ట్రవ్యాప్తంగా చేపట్టిన నిరసనల వల్ల ప్రభుత్వం రుణవిమోచన బిల్లును తెచ్చింది. కాని మొన్నటివరకు రూల్స్ రూపొందించలేదు. కోర్టు ఆదేశాలతో రూల్స్ ప్రకటించినా కమిషన్ నేటికీ అమలులోకి రాలేదు. ఆత్మహత్య చేసుకుంటున్న వారిలో అత్యధికులు కౌలు రైతులే. వీరికి బ్యాంకు రుణాలు అందించడంలో ప్రభుత్వం తీవ్ర నిర్లక్ష్యం చేస్తుంది. ఉదాహరణకు 2015-16లో 4 లక్షల రుణఅర్హత కార్డులు ఇవ్వాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. కాని ఇచ్చింది 40 వేల మందికే. 2017-18లోనైతే 20 వేలే ఇచ్చారు. సాధారణంగా బ్యాంకులు 40 శాతం రుణ అవసరాలనే తీరుస్తున్నాయి. అది కూడా ఆగస్టు, ఫిబ్రవరిలో. అందుకోసం రైతులు రోజుల తరబడి బ్యాంకుల ముందు పడిగాపులు కాయాలి. ఈలోపు పెట్టుబడి అవసరాలకు ప్రైవేటు వ్యాపారులే దిక్కవుతున్నారు. దీన్ని ఆసరాగా తీసుకొని ఏజెన్సీలో వడ్డీ వ్యాపారులు సాలుకు 25-30 శాతం వడ్డీతో రైతులను దోచుకుంటున్నారు.

1960లో రూపొందించిన రూల్స్ ప్రకారం కలెక్టర్ అనుమతితో చట్టం ప్రకారమే వ్యాపారం నిర్వహించాలి. కాని ప్రభుత్వం వీరిని నియంత్రించే స్థితిలో లేదు. రాజధానికి కూతవేటు దూరంలో ఉన్న సంగారెడ్డిలో ఫైనాన్స్ కంపెనీలు రైతులకు తమ దళారీల ద్వారా ఉత్పాదకాలను ఇస్తున్నాయి. తిరిగి రైతు పంటను కారుచౌకగా కొంటున్నాయి. ఈ ఫైనాన్స్ మాఫియాను అరికట్టడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. అదే విధంగా నోట్ల రద్దు వల్ల కూడా బ్యాంకు రుణాలు అందలేదు.

రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన రైతుబంధు పథకం కౌలు రైతులకు విస్తరింపచేయడం లేదు. ఎందుకంటే కౌలుదారి చట్టం అడ్డువస్తుందట! ఎంత ఆశ్చర్యం. బ్యాంకులు లోన్లు ఇవ్వగా అడ్డురాని చట్టం ప్రభుత్వ పెట్టుబడి పథకానికి ఎలా అడ్డువస్తుంది? కమిషనర్‌ను మేం అడిగితే ఆయన 'ఏమో నాకు తెలియదు. మీరు మినిస్టర్‌నే అడగండి' అన్నాడు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 16 లక్షల మంది కౌలు రైతులున్నారు. వీరు దాదాపు 30 శాతం భూమిని సాగుచేస్తున్నారు. ఇంత మందిని ప్రభుత్వం ఎందుకు విస్మరిస్తోంది? భూస్వాములకు, ఆబ్సెంటీ భూ యజమానులకు ఈ పథకం వర్తించకపోతే వారి నుండి వచ్చే వ్యతిరేకత తనకు రాజకీయంగా నష్టం చేస్తుందనే కావచ్చు. రాష్ట్రంలో 40 లక్షల మంది రైతులున్నారు. కాని ప్రభుత్వం 55 లక్షల మందికి చెక్కుల పంపిణీ చేపట్టింది. వీరంతా జమీందారులు, జాగీర్దారులు, ఇజార్‌దార్లు. రైతులు వీరి భూములు ఎప్పటి నుండో సాగుచేసుకుంటున్నారు. కాని వీరికి ఇప్పటికీ భూమిపై హక్కులు లభించలేదు. సాదా బైనామా దరఖాస్తుల్లో సింహభాగం ఇవే.

11 లక్షల దరఖాస్తుల్లో రెండు లక్షలే సెటిలయ్యాయి. మిగతావి పెండింగ్‌లో ఉన్నాయి. అదే విధంగా అటవీ హక్కుల చట్టం పాక్షికంగానే అమలైంది. ఇంకా లక్షా 50 వేల మందికి పట్టాలు అందలేదు. వీరు కూడా రైతుబంధుకు నోచుకోవడం లేదు. సబ్ అర్బన్ ఏరియాల్లో ఎప్పుడో వ్యవసాయ భూమి రియల్ ఎస్టేట్‌గా మారిపోయింది. వీరికి చెక్కులు అందుతున్నాయి. సీలింగ్ చట్టంలోని లొసుగులను ఉపయోగించుకొని చాలామంది వందల ఎకరాలను కలిగి ఉన్నారు. వీరే ఫాం హౌజ్‌లను నిర్వహిస్తున్నారు. అయితే ఈ పథకం ద్వారా వీరికి కూడా లబ్ది చేకూరుతుంది. అధీకృత సాగుదారుల చట్టం 2011 ప్రకారం పంటకు సంబంధించిన ప్రతి మద్దతు కౌలుదారులకే చెందాలి. చిన్న, సన్నకారు రైతులకు, కౌలు రైతులకు పెట్టుబడి మద్దతు (అంటే ఉచితంగా విత్తనాలు, ఎరువులు, మందులు, కూలీ) అందించాలని రైతు సంఘాలు చాలా

సంవత్సరాలుగా ఉద్యమిస్తున్నాయి. ఉద్యమం ఫలితంగానే ఈ పథకం వచ్చింది. అయితే చట్టానికి, ఉద్యమ డిమాండ్‌కు విరుద్ధంగా చంద్రశేఖర్‌రావు నిజమైన సాగుదారులను తప్పించి భూస్వాములకు, రియల్ ఎస్టేట్లకు, ఆబ్సెంటీ ల్యాండ్ ఓనర్లకు ఈ పథకం ద్వారా లబ్ధి చేకూరుస్తున్నాడు. వాస్తవ సాగుదారుల్లో దాదాపు సగం మందిని విస్మరిస్తున్నాడు.

2014 నుండి రైతాంగం గిట్టుబాటు ధర కోసం చేస్తున్న పోరాటం వల్ల ప్రభుత్వం స్వామినాథన్ కమిషన్ సిఫారసుల ప్రకారమే గిట్టుబాటు ధర నిర్ణయిస్తామని ప్రకటించింది. రబీలోనే అన్ని పంటలకు 50 శాతం కలిపి ధర నిర్ణయించామని మోడీ ప్రచారం ప్రారంభించాడు. వాస్తవానికి ఈ ధరల వల్ల వివిధ పంటలకు పెరిగింది 3 నుండి 38 శాతమే. కొన్ని పంటల ధరలు పడిపోతాయి కూడా. మోడీగారి దృష్టిలో ఉత్పత్తి ఖర్చు అంటే విత్తనాలు, ఎరువులు, మందులు, కూలీ ఖర్చులు, కుటుంబ శ్రమ మాత్రమే. ఆయన పెంచింది వీటిని ఆధారం చేసుకొనే. ఉత్పత్తిలో వీటితో పాటు సాగునీరు, అప్పులపై వడ్డీలు, బీమా ప్రీమియం, పంటకోత తరువాత ఖర్చులు, కౌలు మొదలైనవి వస్తాయి. ఉత్పత్తి ఖర్చులను లెక్కించడానికి వేసిన రమేష్‌చంద్ కమిటీ వీటన్నింటిని పరిగణలోకి తీసుకోవాలని ప్రభుత్వానికి సిఫారసు చేసింది. అయినా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. అయితే ప్రభుత్వం అన్ని పంటలకు ధరలు నిర్ణయించడం లేదు. 16 పంటలకే నిర్ణయిస్తుంది. ఉదాహరణకు మిర్చి పంటను కొనుగోలు చేయాలని తెలుగు రాష్ట్రాల్లో గతేడాది పెద్ద ఉద్యమం చేయాల్సి వచ్చింది. అయినా ప్రభుత్వం పది శాతం కూడా కొనలేదు. అదే విధంగా పాల ఉత్పత్తి, పశువుల పోషణ, చేపల, పట్టు పురుగుల, తేనెటీగల పెంపకాన్ని వ్యవసాయ ఉత్పత్తులుగా గుర్తించడం లేదు. అంతేకాదు ధర నిర్ణయించిన పంటలను కూడా కొనడానికి కేంద్ర ప్రభుత్వం సిద్ధంగా లేదు. వరి, మొక్కజొన్న, కందులు మొదలైన అన్ని ఆహార పంటలను తాను సేకరించబోనని ఇటీవల రాష్ట్రాలకు స్పష్టం చేసింది. రాష్ట్ర ప్రభుత్వాలే కొని అమ్ముకోవాలని, నష్టం వస్తే సగం అంతకన్నా తక్కువ నష్టాన్ని భరిస్తానని చెప్పింది. ఈ విధంగా కేంద్రం బాధ్యత నుండి వైదొలుగుతోంది.

కనీస మద్దతు ధర అయినా రైతుకు దక్కుతుందా? అంటే అదీ లేదు. 2017లో ప్రధాన పంటలకు అందిన ధరలు.

| పంట | ప్రభుత్వ అంచనా ప్రకారం ఉత్పత్తి ఖర్చు (రు.) | కనీస మద్దతు ధర (రు.) | మార్కెట్‌కు వచ్చినవి (క్వింటాళ్లు) | ఎంఎస్‌పి కంటే తక్కువ ధరకు కొన్న పంట | ఎంఎస్‌పి కంటే తక్కువ ధరకు కొన్న శాతం |
|---|---|---|---|---|---|
| మొక్క జొన్న | 1396 | 1425 | 1886896 | 1414458 | 75% |
| పత్తి | 4376 | 4320 | 6085893 | 1973179 | 76% |
| సోయాబీన్ | 2921 | 3050 | 185644 | 68576 | 37% |
| కంది | 4612 | 5450 | 633682 | 266633 | 42% |

పై పట్టికను బట్టి ఎంఎస్‌పి ఎండమావే. మరి ప్రభుత్వ రంగ సంస్థలు ఏం చేస్తున్నాయి? అవి పై పంటలను 1 నుండి 10 కూడా కొనలేదు. అంటే అవి పేరుకే ఉన్నాయి. 2015లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు స్వామినాథన్ కమిషన్ సిఫారసులు ఎందుకు అమలు చేయడం లేదని కేంద్ర ప్రభుత్వాన్ని ప్రశ్నించింది. ఇటీవల ఉత్తరాఖండ్ హైకోర్టు స్వామినాథన్ సిఫారసులను అమలు చేయాల్సిందేనని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదేశాలు జారీ చేసింది. అయినా ప్రభుత్వం దారికొస్తుందా?

2016లో ఈనామ్ ద్వారా గిట్టుబాటు ధర వస్తుందని ప్రచారం ప్రారంభించాడు. దీని ద్వారా దళారీలు మాయమౌతారని నమ్మబలికాడు. కాని ఆచరణలో ఎక్కడా గిట్టుబాటు ధర వచ్చిన దాఖలాలు లేవు. మన రాష్ట్రంలో 44 మార్కెట్లు ఈనామ్ కిందకు వచ్చాయి. కాని గిట్టుబాటు ధర మాత్రం దక్కలేదు. స్థానిక మార్కెట్లను బడా పెట్టుబడిదారులైన రిలయన్స్, ఏటిసి, టాటాలకు అందుబాటులోకి తీసుకురావడానికే ఈ పథకం ఉపయోగపడింది. డబ్ల్యుటిఒ విధానాల వల్లనే రెండు దశాబ్దాలుగా మన వ్యవసాయ ఉత్పత్తులకు ధరలు పడిపోతున్నాయని అందరూ అంగీకరిస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ప్రభుత్వం 16 దేశాలతో ప్రాదేశిక ఆర్థిక సమగ్ర ఒప్పందం (ఆర్‌సిఇపి) చేసుకోవడానికి సిద్ధపడింది. ఈ ఒప్పందాలకు సంబంధించిన సమావేశాలను అక్టోబర్‌లో హైదరాబాద్‌లో నిర్వహించింది. ఈ ఒప్పందం అమల్లోకి వస్తే మనం ఇప్పటివరకు 35-70 శాతం వరకు విదేశీ వాణిజ్యంపై విధిస్తున్న సుంకాలను 5-0 శాతానికి తగ్గించుకోవాల్సి వస్తుంది. ఇది మన వ్యవసాయ రంగంతో పాటు అన్ని రంగాలను తీవ్రంగా దెబ్బతీస్తుంది. ఒప్పంద వివరాలను ప్రభుత్వం అత్యంత గోప్యంగా ఉంచింది. అదే విధంగా జిఎస్‌టి వల్ల కూడా రైతాంగానికి తీవ్ర అన్యాయం జరిగింది. వ్యవసాయ ఉత్పత్తులకు మినహాయింపు ఇస్తూనే రైతు కొనే అన్ని పరికరాలపై 12-18 శాతం వరకు జిఎస్‌టి వేశాడు. సాధారణంగా రైతులు వ్యవసాయం చేయలేని స్థితికి చేరుకున్నా పశువులను అమ్ముకుంటారు. వచ్చిన డబ్బులకు కొన్ని డబ్బులు కలిపి కొత్తవి కొంటారు. కేంద్రం తెచ్చిన గోవధ నిషేధ చట్టం వల్ల రైతుకు ఆర్థికంగా నష్టం జరిగింది. ఇది పైకి విశ్వాసాలకు సంబంధించిన అంశంగా కనిపించినా దీనిలో రైతు వ్యవసాయాన్ని దెబ్బతీసి కంపెనీల ప్రవేశాన్ని వేగవంతం చేసే కుట్ర ఉంది. ఇది విశ్వాసాల మాటున బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్ రైతు ఆర్థిక వ్యవస్థపై దాడికి దిగిందనే అనాలి. వ్యవసాయ భూములు సేకరించి కంపెనీలకు కట్టబెట్టడానికి భూ ఆర్డినెన్స్ తెచ్చిన మోడీ గిట్టుబాటు ధర అడిగితే 'వ్యవసాయం రాష్ట్రాల పరిధిలోనిది. మేము మద్దతుగా ఉన్నాం అంతే' అంటున్నాడు. ఉమ్మడి పరిధిలోని అంశాలను రాష్ట్రాలకే ఇవ్వాలంటున్న కెసిఆర్ గిట్టుబాటు ధరల గురించి మోడీ మీద నెట్టేస్తున్నాడెందుకు? మన పక్క రాష్ట్రమైన కర్ణాటక ఎంఎస్‌పిని గ్యారంటీ చేస్తూ ఒక కమిషన్ వేసింది. అందుకోసం బడ్జెట్‌లో కొంత నిధిని ఏర్పాటు చేసింది. కొంత వరకు సమస్యను పరిష్కరించింది. అదే విధంగా సి2 ధరకు ఎంఎస్‌పికి మధ్య లోటును బోనస్ రూపంలో చెల్లిస్తున్నాయి. మన ముఖ్యమంత్రి ఈ పాపం చేయదలచుకోలేదు. కాని గిట్టుబాటు ధరకోసం అంటూ రైతు సమన్వయ సమితులను ఏర్పాటు చేశారు. దీనికి 500 కోట్లు కేటాయిస్తామన్నాడు. ఇది ఎలా సరిపోతా యనుకున్నాం? కాని బడ్జెట్‌లో ఒక్క రూపాయి కూడా కేటాయించ లేదు. ఇప్పుడు అర్థమైంది. ఏ పోస్టులు రాక అసంతృప్తితో ఉన్న పార్టీ కార్యకర్తలకు పోస్టుల కోసమే రైతు సమన్వయ సమితిలు అని.

నాలుగేండ్లలో మొదటి రెండేండ్లు తీవ్ర కరువు ఏర్పడింది. 360 మండలాలను ప్రభుత్వం కరువు మండలాలుగా ప్రకటించింది. హుడా కమిటీ సిఫారసుల ప్రకారం సకాలంలో ఆహార పంటలకు పదివేలు, వాణిజ్య పంటలకు ఇరవై వేల నష్టపరిహారం ఇన్‌పుట్ సబ్సిడీ ఇవ్వాలి.

రుణాలు రీ షెడ్యూల్ చేసి కొత్త రుణాలు ఇవ్వాలి. కాని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎలాంటి చర్యలు చేపట్టలేదు. రైతులు పిట్టల్లా రాలిపోయింది ఈ కాలంలోనే. అరకొర నష్టపరిహారం ఎప్పుడో ఇచ్చారు. కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలోని వ్యవసాయ బీమా కంపెనీ పంటలకు బీమా కల్పించేది. నరేంద్రమోడీ వచ్చాక ప్రధాన మంత్రి ఫసల్ బీమా యోజన పథకాన్ని ప్రవేశపెట్టాడు. వ్యవసాయ బీమాలోకి ప్రైవేట్ కంపెనీలను ఆహ్వానించాడు. వివిధ పంటలకు ప్రభుత్వం బీమా చెల్లిస్తుంది. రైతులు కొంత కడతారు. ఇది కంపెనీలకు వరంగా మారింది. 2016-17లో కంపెనీలు 21,500 కోట్ల ప్రీమియం వసూలు చేశారు. రైతులకు కేవలం 3.31 శాతం మాత్రమే చెల్లించారు. 2016 ఖరీఫ్‌లో 4,270 కోట్లకు రైతులు క్లెయిమ్ చేసుకోగా కేవలం 714 కోట్లు మాత్రమే పంపిణీ చేశారు. ఈ విధంగా ప్రైవేట్ బీమా కంపెనీలు ప్రజల నిధులను దర్జాగా దోచుకుంటున్నాయి. కంపెనీల కోసమే మోడీ రైతు పంటకు కనీస భద్రత లేకుండా చేశాడు.

విత్తనమే పంటలో ప్రధానమైంది. ప్రభుత్వం కనీసం మేలురకం విత్తనం గ్యారంటీ చేయలేకపోయింది. 2015-16లో ఖమ్మం, వరంగల్‌లో నకిలీ మిర్చి విత్తనాలు 2016-17లో ఆదిలాబాద్ పత్తి విత్తనాలు వేల ఎకరాల్లో నష్టం కలిగిస్తే 2017-18లో బీటి-3 ఏకంగా 18 లక్షల ఎకరాల్లో పూతా, ఖాతా లేకుండా రైతును నట్టేట ముంచింది. రాష్ట్రంలో దాదాపు 5 లక్షల ఎకరాల్లో వివిధ విత్తనాలు ఉత్పత్తి అవుతున్నాయి. కాంట్రాక్ట్ ఫార్మింగ్ ఆక్ట్ ప్రకారం విత్తనోత్పత్తి కంపెనీలకు రైతులకు మధ్య రాతపూర్వక ఒప్పందం ద్వారా జరగాలి. అప్పుడు విత్తనోత్పత్తి దారులుగా రైతుల హక్కులు కాపాడబడతాయి. కాని కంపెనీలు మధ్య దళారీలను ఏర్పర్చుకొని వారి ద్వారా రైతులకు మూల విత్తనాలు ఇస్తున్నాయి. దీనివల్ల లాభాలు కంపెనీలకు-దళారీలకు, వెట్టిచాకిరి రైతులది అవుతుంది. అదే విధంగా విత్తనోత్పతి ప్రక్రియపై ప్రభుత్వానికి నియంత్రణ లేదు. నకిలీ విత్తనాలకు మూలం ఇక్కడే ఉంది. ఫెయిల్ అయిన విత్తనాలను కూడా కంపెనీలు-దళారీలు ఒక మాఫియాగా మారి రైతుకు అంటగడుతున్నారు. విత్తనోత్పత్తి దారులు-వినియోగదారులైన రైతులను యథేచ్ఛగా దోపిడీ చేస్తున్నారు. కెసిఆర్ బీరాలు పలకడం జూన్‌లో కొన్ని దాడులు జరగడం యాదృచ్ఛికం. తెలంగాణ నకిలీ విత్తన భాండాగారంగా మారిపోయింది.

ఎరువుల ఉత్పత్తి కోసం రాష్ట్ర ప్రభుత్వం ఉచితంగా సరఫరా చేస్తామన్న జింక్-జిప్సం తగ్గించింది. దీంతో ఎరువుల ధరలు పెరిగాయి. అదే విధంగా నకిలీ ఎరువులను అరికట్టడానికి ఎరువులను సహకార సంఘాల ద్వారా పంపిణీ చేయాలని రైతు సంఘాలు డిమాండ్ చేస్తున్నా ప్రభుత్వం పట్టించుకోదు. ఇన్‌సెక్టిసైడ్స్ ఆక్ట్ 1968 విదేశీ పురుగు మందుల నాణ్యతను పరిశీలించేది. వాటి వ్యాపారాన్ని నియంత్రించేది. ఇప్పటికే బహుళజాతి కంపెనీలు 40 శాతం మార్కెట్‌ను కైవసం చేసుకున్నాయి. ప్రభుత్వం తెస్తున్న పెస్టిసైడ్ మేనేజ్‌మెంట్ బిల్లు 2017 వాటి దోపిడీకి తలుపులు బార్లా తెరిచింది. తెలంగాణలో గులాబీ రంగు పురుగు పత్తి పంటను నాశనం చేసింది. ఇన్ని పురుగు మందులు ఏమీ చేయలేకపోయాయి. అంటే వీటి నాణ్యత ప్రశ్నార్థకమే కదా. ఈ నియంత్రణలు కూడా ఎత్తివేస్తే పరిస్థితి మరింత దారుణంగా తయారవుతుంది.

నేటి సంక్షోభంలో ముఖ్యమైన అంశం సాగుచేస్తున్న రైతు చేతిలో భూమి లేకపోవడం. ఆత్మహత్యలు చేసుకుంటున్న వారిలో 60 శాతం సరిపడ/అసలే భూమిలేని రైతులు. వీరు పూర్తిగానో పాక్షికంగానో కౌలుపై ఆధారపడుతున్నారు. వీరికి సొంత భూమి దక్కడం ద్వారానే శాశ్వత పరిష్కారం లభిస్తుంది. ఎస్.సి, ఎస్.టి.లకు మూడెకరాల భూ పంపిణీ టిఆర్ఎస్ ఎన్నికల హామీ. కాగా ఎస్.సి.లకు ఇప్పటి వరకు పంచింది 6704 కుటుంబాలకు 18,981 ఎకరాలే. అప్పుడే ఈ పథకానికి నిధుల కేటాయింపు తగ్గించారు. ఎస్.టి.లకు పంచలేదు. హరితహారం పేరుతో భూములను భారీగానే గుంజుకుంది. వ్యవసాయ యోగ్యమైన ప్రభుత్వ భూములను పంచాలని పోరాడుతున్నా పంచడం లేదు. భూమిలేని రైతులకు భూ పంపిణీ చేయాలనే ఆలోచన లేదు కాని, దాదాపు 5 లక్షల ఎకరాల రైతాంగ భూములను బడా పెట్టుబడిదారుల కోసం, బహుళజాతి కంపెనీల కోసం గుంజుకుంది. ఇందులో మోడీ, కెసిఆర్‌లు ఒక్కటయ్యారు. కెసిఆర్ 2017 చట్టం తెచ్చాడు. మోడీ ఆర్డినెన్స్ రద్దయిన స్థానంలో ఈ చట్టం వచ్చింది. అంతేకాదు కంపెనీలకు వ్యవసాయ భూములు లీజుకిచ్చే విధంగా 'వ్యవసాయ భూముల నమూనా కౌలు చట్టం' తయారు చేసి రాష్ట్రాలకు పంపాడు. దీనిని అమలు చేయాల్సిందిగా ముఖ్యమంత్రులను ఆదేశించాడు.

ప్రపంచ బ్యాంకు, డబ్ల్యుటిఒ ఆదేశాల మేరకే గత ప్రభుత్వాలు నడిచాయి. వ్యవసాయానికి నిధులు తగ్గిస్తూ వచ్చాయి. తనకన్నా మించిన దళారీ మరొకడు ఉండబోడని నిరూపిస్తూ మోడీ 2016-17 బడ్జెట్‌లో 1.2 శాతం నిధులు కేటాయించాడు. కెసిఆర్ 5.2 శాతం కేటాయించాడు. ఎన్నికల వేళ ఏదో నటించక తప్పదు కాబట్టి 2017-18 బడ్జెట్‌లో 2.3 శాతం కేటాయించి 10 లక్షల బ్యాంకు రుణాలను బడ్జెట్ కేటాయింపుగా చూపడానికి ప్రయత్నించాడు. ఈ కేటాయింపులను కొన్ని పత్రికలు కొండంతలుగా రాశాయి. కెసిఆర్ వ్యవసాయానికి ప్రత్యేక బడ్జెట్ ప్రవేశపెట్టాడు. రు. 1,74,453.83 కోట్ల బడ్జెట్‌లో వ్యవసాయ రంగానికి రు. 12,734 కోట్లు కేటాయించాడు. పెరిగిన లెక్కల ప్రకారం ఇదంతా రైతుబంధు పథకానికే సరిపోతుంది. మిగతా వేటికీ కేటాయింపులు లేవు. మూడేండ్లు నామమాత్రపు కేటాయింపులతో వ్యవసాయాన్ని సంక్షోభంలోకి నెట్టివేశాడు. ఇప్పుడు ఎకరాకు నాలుగు వేలు చేతిలో పెట్టి గద్దెనెక్కాలని చూస్తున్నాడు. బడ్జెట్‌లను ఏ స్థాయికి దిగజార్చారో దీనిని బట్టి అర్థం చేసుకోవచ్చు. వ్యవసాయ రంగానికి కేటాయింపులు 50 శాతం నుండి 5 శాతంకు పడిపోయాయి. రైతుల ఆదాయాలు కూడా ఈ విధంగానే పడిపోతున్నాయి. స్థూల ఆదాయంలో వ్యవసాయ రంగం వాటా 16 శాతం దాటడం లేదు. రైతు కుటుంబాల సగటు ఆదాయం రు. 6,000గా నీతి ఆయోగ్ లెక్కించింది. ఈ విధానాల పర్యవసానంగానే రోజుకు 52 మంది రైతులు ఆత్మహత్య చేసుకుంటున్నారు.

తమ ఆదాయాలు ప్రమాదంలో పడడంతో 2015లో పదివేల మంది రైతులు ఆదాయ భద్రత కోసం, భూ సేకరణ ఆర్డినెన్స్ రద్దు కోసం ఢిల్లీలో కదం తొక్కారు. ఈ ర్యాలీని యోగేంద్ర యాదవ్ నాయకత్వంలోని స్వరాజ్ అభియాన్ నిర్వహించింది. 2016లో మనరాష్ట్రంలో గిట్టుబాటు ధరకోసం పెద్ద ఎత్తున పోరాటాలు జరిగాయి. గిట్టుబాటు ధర అడిగినందుకు మధ్యప్రదేశ్‌లోని మంద్‌సౌర్‌లో ఆరుగురు రైతుల ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. దీంతో రైతాంగంలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. ఉద్యమం మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్, హర్యానా, రాజస్థాన్‌లకు విస్తరించింది. ప్రభుత్వాలను ఉక్కిరిబిక్కిరి చేసింది. దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున ఆందోళనలు జరిగాయి.

దేశవ్యాప్తంగా 160 రైతు సంఘాలు ఒక్కతాటిపైకి వచ్చి అఖిల భారత రైతాంగ పోరాట సమన్వయ కమిటీ (ఎఐకెఎస్‌సిసి) ఏర్పడింది. తమిళనాడు రైతుల పోరాటం దేశవ్యాప్త రైతాంగాన్ని ఉత్తేజపరిచింది. ఎఐకెఎస్‌సిసి ఆధ్వర్యంలో దేశ వ్యాప్తంగా కిసాన్ ముక్త యాత్ర జరిగింది.

# తెలంగాణ ఆర్థిక వికాసం - అప్పులు

*తెలంగాణ అభివృద్ధి పథంలో ముందుకు పోతుందని పాలకులు చేస్తున్న ప్రచారానికి, వాస్తవ ఆర్థిక పరిస్థితికి చాలా వ్యత్యాసముందనే విషయాన్ని ఆర్థిక రంగ సంస్థలే బయటపెడుతున్నాయని అంటున్నారు* **ఎ. పున్నయ్య**

సుదీర్ఘకాలంపాటు ప్రత్యేక రాష్ట్ర ప్రజా పోరాటంలో భాగంగా ఉన్న తెలంగాణ రాష్ట్ర సమితిని ప్రజలు అత్యంత విశ్వాసంతో ప్రభుత్వంలోకి ఆహ్వానించారు. అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం ఉద్యమ క్రమంలో ప్రకటించిన లక్ష్యాలను దూరం పెడుతూ, భ్రమల్లో ఉంచుతూ ప్రజలను వంచించడం ప్రారంభించింది. నాలుగున్నర కోట్ల ప్రజల ఆకాంక్షల కంటే పిడికెడు మంది ఆశ్రితుల ప్రయోజనాల కొరకే పాటు పడుతుంది. ఉద్యమ సమయంలో మాట్లాడిన మాటలను మళ్లీ మళ్లీ వల్లిస్తూ ఆ మాటలకు వ్యతిరేక దిశలో పాలన కొనసాగిస్తుంది. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింపజేస్తూ, పునరుత్తేజితంతో ఆర్థిక వికాసానికి పాటుపడుతామన్నారు. రాష్ట్ర సమగ్రాభివృద్ధికి, బావి తెలంగాణ భవిష్యత్ కోసం ఎంతటి సాహసానికైనా సిద్ధమని వాగ్దానం చేశారు. వాస్తవంలో వాగ్దానాలు గత పాలకుల గారడీ మాటలను సైతం మించినాయి.

అత్యంత సహజంగా ప్రభుత్వాలు అర్థవంతమైన ఉపాధి కల్పన ద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించాలి. ఉపాధి ద్వారా ఆత్మగౌరవంతో పాటుగా కొనుగోలు శక్తి పెరుగుతుంది. పెరిగిన కొనుగోలు శక్తి జీవన ప్రమాణాన్ని పెంచుతుంది. ఫలితంగా పేదరికం తగ్గి సమసమాజ భావనతో సమానత్వానికి దారితీస్తుంది. అందువల్ల ప్రభుత్వాలు తమ వ్యయాల ద్వారా విద్య, ఆరోగ్యం, మౌలిక వసతులు, సామాజిక భద్రత సౌకర్యాలను ప్రజలందరికి అందించాలి. దీని ద్వారా నాణ్యమైన, గుణాత్మకమైన మానవ వనరుల అభివృద్ధి జరుగుతుంది. ఈ మానవ వనరుల అభివృద్ధే రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి మూలం. అయితే ఏడు దశాబ్దాలుగా తెలంగాణ ప్రాంతాన్ని 13 మంది ముఖ్యమంత్రులు పాలించి పాక్షిక అభివృద్ధితో పాటు 70,000 కోట్ల అప్పును అందిస్తూ 2014 జూన్ 2న ప్రత్యేక తెలంగాణను ప్రకటించినారు. ప్రకటించిన తెలంగాణ లో కేవలం నాలుగు సంవత్సరాలలో రు. 1,80,238 కోట్లకు అప్పును పెంచారు. ప్రభుత్వ ఆర్థిక క్రమశిక్షణ లోపించడంతో పాటుగా ఆర్థిక అరాచకత్వంవల్ల ధనికరాష్ట్రంగా ఉన్న తెలంగాణ అప్పుల రాష్ట్రంగా మారింది.

**తెలంగాణ రాష్ట్రంలో అవినీతి ఎంత? అభివృద్ధి ఎంత?**

ఉద్యమకారులు చెమట, రక్తం, ప్రాణాలు అర్పించి సాధించుకున్న తెలంగాణలో ఎన్నికైన పెద్దలు ఉద్యమ క్రమంలో మాట్లాడిన మాటలకు, ఇచ్చిన హామీలకు, ఆచరిస్తున్న కార్యచరణకు ఎలాంటి పొంతన లేదు. కడుపుకట్టుకొని పనిచేస్తూ ఎలాంటి అవినీతికి ఆస్కారం ఇవ్వకుండా పారదర్శకంగా అశ్రిత పక్షపాతం లేకుండా పరిపాలన చేస్తూ భారతదేశ చిత్రపటంపై అభివృద్ధిలో అగ్ర భాగాన నిలబడతామన్నారు. కాని పరిపాలనలోకి అడుగిడిన తర్వాత మిగులు రాష్ట్రంగా ఉన్న తెలంగాణను అప్పుల ఊబిలోకి నెట్టినారు. సంక్షేమ పథకాల పేరుతో కోట్లాది ప్రజా ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. ఆంధ్రా కాంట్రాక్టర్లకు అవసరానికి మించిన కేటాయింపులతో పర్సెంటేజీలకు పనులు కట్టబెడుతున్నారు. అభివృద్ధిలో దేశంలో ఏ స్థానంలో ఉన్నామో కాని సెంటర్ ఫర్ మీడియా సర్వీసు సంస్థ సర్వే ప్రకారంగా అవినీతిలో మాత్రం రెండవ స్థానంలో నెలబెట్టారు. వివిధ పౌర సేవలకు రు. 2500 కోట్ల నుంచి 2800 కోట్లు ప్రజల లంచమిచ్చినట్లు సర్వే ప్రకటించడాన్ని చూస్తే తెలంగాణ

---

నవంబర్‌లో 50 వేల మందితో కిసాన్ సంసద్ (రైతు పార్లమెంట్) జరిగింది. ఇందులో రుణ విముక్తి బిల్లు, గిట్టుబాటు ధర బిల్లులను ఆమోదించాం. పార్లమెంట్‌లో ప్రైవేట్ బిల్లు ప్రవేశ పెట్టాం. 12 ప్రధాన పార్టీలు అంగీకరించాయి. ఇదే సమయంలో మహారాష్ట్ర రైతాంగం చేసిన నాసిక్ టు ముంబాయి మార్చ్ దేశ వ్యాప్తంగా అన్ని వర్గాలు రైతు సమస్యలపై ఆలోచించేలా చేసింది. అదే విధంగా రాజస్థాన్ రైతాంగం గిట్టుబాటు ధరకోసం పెద్ద సమ్మె నిర్వహించారు. పాలు, కూరగాయలు బంద్ చేసి ప్రభుత్వం దిగివచ్చేలా చేశారు.

తెలంగాణలోను కంపెనీల భూసేకరణకు వ్యతిరేకంగా (ఆదిలాబాద్, వరంగల్, మహబూబ్‌నగర్), అక్రమ భూసేకరణకు వ్యతిరేకంగా (కరీంనగర్, మెదక్), హరితహారంకు వ్యతిరేకంగా (ఖమ్మం, వరంగల్) పెద్ద ఎత్తున పోరాటాలు వచ్చాయి. కొన్ని చోట్ల విజయం సాధించారు. మరికొన్ని చోట్ల నిలువరిస్తున్నారు. ఈ పోరాటాలన్నింటిని సమన్వయం చేసి ప్రభుత్వాన్ని నిలువరించలేక పోవడం వల్ల కొన్నిచోట్ల భూములు కోల్పోయారు. ఏది ఏమైనా రైతాంగం తీవ్ర నిరాశ నిస్పృహలకు గురై ఆత్మహత్యలు చేసుకుంటున్న సందర్భంలో ఈ పోరాటాలు ఒక చిరు ఆశను కల్పించాయనడంలో సందేహం లేదు. అదే విధంగా ప్రభుత్వాలకు కూడా ఏదో ఒకటి చేయక తప్పని పరిస్థితి కల్పించాయి. అయితే వ్యవసాయాభివృద్ధి ఇరుసుగా ఉండే అభివృద్ధి నమూనా దార్శనికత లేకుండా ఈ పోరాటాలు సంపూర్ణ విజయాన్ని సాధించలేవు. ఇందుకోసం వామపక్ష శక్తుల చొరవ, కృషి అవసరం.

పై విధానాలన్నీ పరిశీలిస్తే నరేంద్రమోడీ – కెసిఆర్‌లు రైతాంగానికి చేసిందేమీ లేదని స్పష్టమౌతుంది. వీరు బహుళజాతి కంపెనీలకు, బడా పెట్టుబడిదారులకు, నయా భూస్వాములకు రైతాంగం నుండి భూములను గుంజుకొని, వారి శ్రమను కారుచౌకగా కొల్లగొట్టి వారి వ్యవసాయాన్నే అప్పగించే దళారులుగా మారారు. ఇందుకోసం రైతాంగంపై కేసులు పెట్టి జైల్లో వేయడమే కాక, కాల్చి చంపడానికీ వెనుకాడలేదు. అయినా ఈ ఫాసిస్టు జంట దుర్మార్గపు విధానాలకు వ్యతిరేకంగా రైతాంగం పెద్ద ఎత్తున ఉద్యమాల్లోకి వస్తూనే ఉన్నారు. ఈ పోరాటాలు సమరశీల పోరాటాలుగా మారినప్పుడే వీరి పతనం ప్రారంభమౌతుంది. రైతాంగం రక్షించబడుతుంది.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, తెలంగాణ రైతాంగ సమితి)* వీ

రాష్ట్ర ప్రభుత్వ మౌలిక స్వరూపం అర్థమవుతుంది. ఇదే పరిస్థితి కొనసాగితే రాబోయే ఐదు సంవత్సరాలలో బీహార్, ఒడిశాల కంటే పేద రాష్ట్రంగా తెలంగాణ మిగులుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. అంతర్జాతీయంగా ఒక అనుభవాన్ని అవలోకనం చేసుకుంటే సిరి సంపదలతో, ఆర్థిక పరిపుష్టితో అన్ని దేశాలకన్నా గొప్పగా ఉన్న 'వెనిజులా దేశం' లోపించిన ఆర్థిక క్రమశిక్షణ, మితిమీరిన ఖర్చులతో దేశం పూర్తిగా దివాలా తీసింది. నేడు ప్రజలకు అన్నం కూడా దొరకని స్థితిలో ఉంది. సరిగ్గా తెలంగాణలో కూడా పరిపాలనలో క్రమశిక్షణ లేదు. నైపుణ్యం గల ప్రణాళికలతో ముందుకు పోవాలనే దూరదృష్టి లేదు. ఆర్థిక, సంక్షేమ పథకాల అమలు పేరుతో, ఆర్థిక అసమానతలతో పాటుగా సామాజిక అసమానతలను సృష్టిస్తుంది. సమాజాన్ని కులాలుగా విడదీస్తుంది.

**అంతరాలను మరింత పెంచే విద్యా వికాసం**

తెలంగాణ రాష్ట్రంలో అత్యంత నిర్లక్ష్యానికి గురైన రంగం విద్యా రంగం. ప్రపంచ స్థాయి ప్రమాణాలుండే విద్యా రంగాన్ని ప్రవేశ పెడతామని కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యనందిస్తామని ప్రకటించినారు. విద్యా రంగాన్ని ఒకే గొడుగు కిందికి తీసుకొచ్చి కామన్ స్కూల్ విధానాన్ని ప్రవేశపెడతామన్నారు. ఆచరణలో విద్యా రంగానికి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 14 శాతం నిధులు బడ్జెట్‌లో కేటాయిస్తే తెలంగాణ ఏర్పడిన తర్వాత కేవలం 7.29 శాతం నిధులు కేటాయించారు. ప్రభుత్వ విద్యా రంగాన్ని కనుమరుగు చేసే ప్రయత్నం చేస్తున్నారు. కనీసం సర్వీసు రూల్స్ పునరుద్ధరణ జరగలేదు. విద్యా హక్కు చట్టాన్ని తుంగలో తొక్కినారు. దురదృష్టం కొద్ది విద్యా రంగంలో కులాలను ప్రవేశపెట్టి అంతులేకుండా అసమానతలను పెంచుతున్నారు. 62 లక్షల మంది విద్యార్థులుండగా గురుకులాల పేరుతో 3 లక్షల మందికి అంటే 4 శాతం మందికి విద్యనందిస్తున్నారు. కామన్ స్కూల్ విధానమే నా కల అన్న ముఖ్యమంత్రి కామన్ మ్యాన్‌కు విద్య అందకుండా చేస్తున్నారు. ఉద్యమ సమయంలో ఆంధ్ర కార్పొరేట్ విద్యా సంస్థలను జాతీయం చేస్తామని నేటికి కనీస చర్యలు లేకపోగా సమాన విద్య కోసం ఉద్యమించిన విద్యార్థులపై కేసులు పెట్టి నిర్బంధాలకు గురిచేస్తున్నారు. ఉన్నత విద్యను అభివృద్ధి చేయకపోగా విదేశీ విశ్వవిద్యాలయాల కోసం ప్రైవేట్ విశ్వవిద్యాలయాల బిల్లును శాసన సభలో ఆమోదించుకున్నారు. ఉన్నత విద్యా రంగంలో మౌలిక వసతుల కల్పన గాని, సిబ్బంది నియామకం చేయకుండా ప్రభుత్వం కాలయాపన చేస్తుంది. ప్రభుత్వ విద్యా రంగాన్ని పూర్తిగా సంక్షోభంలోకి నెట్టి, ప్రైవేట్ విద్యా రంగానికి ఎర్రతివాచి పరిచింది.

**ఆర్థిక అసమానతలను మరింతగా పెంచే రైతు పెట్టుబడి సాయం పథకం**

తెలంగాణ రాష్ట్రంలో అత్యధిక ప్రజానీకం వ్యవసాయ రంగంపై ఆధారపడి జీవిస్తున్నారు. గడిచిన కొన్ని సంవత్సరాలుగా వ్యవసాయ రంగం తీవ్ర ఇబ్బందుల్లో ఉంది. ఈ రంగం అభివృద్ధి ఎగుడు దిగుళ్లతో ఉంది. ఈ నేపథ్యంలో ముఖ్యమంత్రి వ్యవసాయ రంగానికి పునరుత్తేజాన్ని కల్పించడం కోసం రైతును రాజుగా మారుస్తామన్నారు. ఇంకా కాస్తా ముందుకుపోయి రైతే ఈ రాష్ట్రాన్ని పరిపాలిస్తున్నాడని నమ్మబలికాడు. భూ దస్త్రాల నవీకరణ పేరుతో కోట్ల రూపాయలతో పాటు సంవత్సర కాలం పాటు రెవెన్యూ సిబ్బందిని పనిచేయించి, అత్యంత సహజంగా వివాదాలు లేని భూములకు మాత్రమే పట్టదారు పాసు పుస్తకాలిచ్చినారు. పాసుపుస్తకాలివ్వడాన్ని స్వాగతించాలి గాని, వివాదాల్లో ఉన్న లక్షలాది ఎకరాల ప్రభుత్వ భూముల మీద ఏ నిర్ణయం జరగలేదు. రాజకీయ నాయకుల అండదండలతో ఆక్రమణకు జరిగిన భూములను క్రమబద్ధీకరించలేదు. ఏ వివాదాలు లేని భూములకు పట్టదారు పాసు పుస్తకాలివ్వడానికి ఇంత ఖర్చు అవసరమా? ఇన్ని పని దినాలు రెవెన్యూ సిబ్బంది పనిచేయాలా? కేవలం ఉన్న సమాచారంతో నైనా పాసు పుస్తకాలను అందించేవాళ్లు. ఏ రైతు తమకు పెట్టుబడి కావాలని ప్రభుత్వం దగ్గరకు వెళ్లలేదు. కాని ప్రభుత్వం రు. 1200 కోట్లు రైతు పెట్టుబడి పథకానికి కేటాయించింది. ఇందులో 40.92 లక్షల మంది ఒక గుంట మొదలుకొని రెండున్నరలోపు రైతులున్నారు. 11.02 లక్షల మంది రెండున్నర ఎకరాల నుండి ఐదు ఎకరాల లోపు ఉన్నారు. 4.44 లక్షల రైతులు ఐదు ఎకరాల నుండి 10 ఎకరాలలోపు ఉన్నారు. 94.551 మంది రైతులు 10 ఎకరాల నుండి 25 ఎకరాల మధ్య భూమి ఉన్న రైతులున్నారు. 6.485 మంది రైతులకు 25 ఎకరాలకు పైగా భూమి ఉన్నట్లు గుర్తించి పెట్టుబడి సాయం కింద ఎకరాకు రు. 4 వేలు వానకాలం మరో 4 వేలు యాసంగికి పంచనుంది. దీనివలన భూమిని సాగుచేసే కౌలు రైతులకు మేలు జరగలేదు. అధిక భూమిగల భూస్వాములకే ప్రయోజనం జరిగింది. సంక్షేమ పథకాల పేరుతోఉన్నత వర్గాలకే ప్రయోజనాన్ని ప్రభుత్వం అందించింది. ఈ పెట్టుబడి సాయం 10 ఎకరాల వరకే సీలింగ్ ఉంటే కొంత మేరకు ప్రయోజనం జరిగేది. స్వామినాథన్ కమిటీ చెప్పినట్లు శాస్త్రీయంగా పంటలకు ధరను నిర్ధారించాలి. ప్రభుత్వాలు రైతు ఆదాయాలను రెండింతలు పెంచాలంటే ఆ మేరకు మద్దతు ధరను ప్రకటించాలన్నాడు. మద్దతు ధర గురించి మాట్లాడలేదు. రైతుల ఆత్మహత్యలలో తెలంగాణ జాతీయ స్థాయిలో 2వ స్థానంలో ఉంది. ఆత్మహత్యలు అధిక శాతం కౌలు రైతులవే. పండిన పంటకు మద్దతు ధరతోనే రైతు సుభిక్షంగా ఉంటాడు. 20 శాతం సొంత ఆదాయం గల రాష్ట్రంలో సంక్షేమ పథకాల పంపకాలతో ప్రభుత్వ సంపద అధిక భాగం ధనవంతుల ఖాతాలో జమ అవుతుంది. ఇది అసమానతలను మరింత పెంచుతుంది. రాజ్యాంగంలోని అదేశిక సూత్రాల ప్రకారం అర్థిక అసమానతలు లేని సమాజాన్ని సృష్టించడం ప్రభుత్వ విధాన లక్ష్యం కావాలి.

**తెలంగాణ రాష్ట్ర సగటు స్థూల ఉత్పత్తి ధోరణులు**

తెలంగాణ రాష్ట్రం ఏర్పడక ముందు ఏర్పడిన తర్వాత 2011-12, 2016-17 సంవత్సరాల సగటు వార్షిక స్థూల జాతీయోత్పత్తి (సిఎజిఆర్) వృద్ధిరేటు 10.50 శాతం అనగా 101.56 బిలియన్ల డాలర్లు, రాష్ట్ర నికర జాతీయోత్పత్తి (ఎన్ఎస్‌డిపి) 10.56 శాతం అనగా 92.19 బిలియన్ల డాలర్ల వరకు పెరిగింది. 2018-19 ఆర్థిక సంవత్సరానికి కేంద్ర ప్రభుత్వం అందించిన ఉదయ్ స్కీం (ఉజ్వల్ డిస్కం అష్యూరెన్స్ యోజన) ద్వారా రు. 8,923 కోట్ల డిస్కంల కొనుగోలు కొరకు తీసుకున్నారు. ఇది ఎఫ్ఆర్‌బిఎం పరిధిలోకి రాదు. తెలంగాణ ప్రభుత్వం 4 లక్షల యాదవ కుటుంబాలకు 84 లక్షల గొర్రెలను పంపిణీ చేసింది. ఇందులో 75 శాతం వరకు సబ్సిడీ ఇచ్చినారు. గొర్రె పిల్లల కొనుగోలులో జరిగే గోల్‌మాల్ దగ్గర నుండి పంపిణీ వరకు అక్రమ పద్ధతులనే పాటించారు. నాసిరకం గొర్రె పిల్లలు ఈ వాతావరణం అనుకూలించక 50 శాతం జబ్బున పడ్డాయి. మిగిలినవి ఆశించిన ఎదుగుదల లేక లక్షలాది రూపాయల ప్రజాధనం యాదవుల ఓట్ల కోసమే ఏరవేసినారనేది మీడియా సాక్షిగా బట్టబయలయింది. మత్స్య కార్మికుల కోసం చెరువుల్లో చేప పిల్లలను వేసినారు. కొన్ని చెరువుల్లో చేప పిల్లలు వేయకుండా బిల్లులు తీసుకుంటే వేసిన చేప పిల్లలు సరైన గ్రోత్ కనిపించలేదు. ఇట్లా సంక్షేమ కార్యక్రమాల పేరుతో ప్రభుత్వం చేసిన ఖర్చులు దుర్వినియోగం జరిగినాయి.

**అప్పులు మౌలిక వసతుల కల్పనకా? సంక్షేమ పథకాలకా?**

తెలంగాణ స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో అప్పులు 18.6 శాతంగా నమోదు అయినాయి. ప్రభుత్వం అప్పులను 'అభివృద్ధిని వేగత్వరణం కోసం మౌలిక వసతుల కల్పనకు మాత్రమే' ఉపయోగిస్తున్నామంటుంది. అయితే రాష్ట్రం ఏర్పడే నాటికి 2014-15లో సుమారు రు. 70,000 కోట్లుగా ఉన్న అప్పు, 2015-16లో స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో (జిఎస్‌డిపి) 16.18 శాతం అనగా రు. 93,155 కోట్లు. 2017-18లో రు. 1,51,133 కోట్లకు పెరిగింది. 2018-19లో మరో రు. 29,105 కోట్లు అప్పు చేసింది. వీటితో పాటు నేటికి మొత్తం అప్పు రు. 1,80,238 కోట్లతో భారీగా పెరిగింది. ఇది మొత్తం స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో 21.34 శాతం. ప్రభుత్వం తీసుకొచ్చిన అప్పులు సంవత్సరానికి 11,891 కోట్లు పాత అప్పుల వడ్డీ చెల్లింపులకే ఖర్చు చేస్తుంది. దీర్ఘకాలిక అభివృద్ధి కోసమని అందులో భాగంగా సాగునీటి ప్రాజెక్టులకు 1.20 లక్షల కోట్లు, మిషన్ భగీరథకు 65 వేల కోట్లు, రోడ్ల విస్తరణకు రు. 18,094 కోట్లతో 1,23,573 కిలోమీటర్ల రహదారిని విస్తరించింది. మిషన్ భగీరథకు 7,031 కోట్లు కేటాయించారు. ఈ కేటాయింపుల్లో పెద్ద మొత్తంలో ప్రజాధనం దుర్వినియోగం అయినట్లు తాజాగా ప్రకటించిన కాగ్ నివేదిక బట్టబయలు చేసింది. మొత్తం రాష్ట్ర ప్రభుత్వ సగటు అప్పు ప్రతి పుట్టబోయే బిడ్డ పేరుమీద రు. 40,000 ఈ ప్రభుత్వం పంచుతుంది. దేశంలో అప్పుల్లో తెలంగాణ మొదటి స్థానంలో ఉంది. అయితే సెంటర్ ఫర్ మీడియా సర్వీసు సంస్థ నిర్వహించిన సర్వేలో అవినీతిలో 2వ స్థానంలో ఉన్నాం. జాతీయ స్థాయిలో అప్పు పెరుగుదల 33 శాతంగా ఉంటే తెలంగాణలో ఎకా ఎకీగా 71 శాతం ఉంది. కేవలం రాజకీయ ఉద్యోగిత సృష్టించి తెలంగాణ రాష్ట్ర సమితి విధులు నిర్వహించేందుకే ఈ అప్పులు అధికంగా ఉపయోగపడుతున్నట్లు అర్థమవుతుంది. తెలంగాణ ప్రజలకు తక్షణమే పేదరికం లేని ఆకలి రహిత ఆరోగ్యవంతమైన జీవనంతో పాటు, నాణ్యమైన విద్య, లింగ సమానత్వంతో కూడిన మానవాభివృద్ధిని పెంపొందించాలి. వీటితో పాటుగా అర్హతకు సమానమైన ఆత్మగౌరవాన్ని పెంచేవని, పరిశ్రమల ఆవిష్కరణ, మౌలిక సదుపాయాలు బాధ్యతాయుతమైన ఉత్పత్తి, వినియోగం ద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించాలి. రక్షిత మంచినీరు, పారిశుద్యం, స్వచ్ఛమైన ఇందనం కలుషిత రహిత వాతావరణం చర్యలతో పరిసరాలను అభివృద్ధి పరచాలి. శాంతి, న్యాయం లాంటి బలీయమైన వ్యవస్థల లక్ష్య సాధనకు ప్రభుత్వం భాగస్వామ్యంగా ఉంటూ సమాజంలో అసమానతల తగ్గింపునకు పాటు పడాలి.

**అంకెల్లోనే అభివృద్ధి**

సాధారణంగా ఆర్థిక ప్రగతిని అంచనా వేయడం అంటే జీవం లేని అంకెలు, సారంలేని గణాంకాలను మాత్రమే కాదు ఒక సామాజిక వాస్తవికతను అంకెల ద్వారా, గణాంకాల ద్వారా గ్రహించడం కొంత మేరకు సాధ్యమే. కాని అదే సమస్తం కాదు. తెలంగాణ నూతన రాష్ట్రంగా ఏర్పడిన తర్వాత పెట్టుబడులతో పాటు అంకెల్లో వృద్ధిరేట్లు పెరుగుతున్నాయి. ప్రభుత్వ ప్రైవేట్ రంగాలతో పాటు ఉత్పాదక రంగాల్లో పెట్టుబడులు బాగా పంజుకున్నాయి. 2017-18 రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా క్యాపిటల్ ఫార్మేషన్ తాజాగా విడుదల చేసిన కరదీపికలో 2012-13లో చాలా తక్కువగా ఉన్న పెట్టుబడులు 2013-14లో కొంత మేరకు పుంజుకున్నాయి. 2014-15, 2015-16 ఆర్థిక సంవత్సరాల్లో అన్ని రకాల పెట్టుబడులు వెల్లువెత్తాయి. పరిశ్రమలు పెరగడంతో పాటు రహదారులు విస్తరించాయి. స్థిర ధరల వద్ద 2012-13లో రు. 26,521.9 మిలియన్లుగా ఉన్న క్యాపిటల్ ఫార్మేషన్ 2015-16లో 6 రెట్లుగా రు. 1,48,524.9 మిలియన్లకు భారీగా పెరిగింది. నెట్ వాల్యూయాడెడ్ మొత్తం 2012-13లో రు. 2,81,017 మిలియన్లు ఉండగా 2015-16లో రు. 3,90,898 మిలియన్లకు చేరింది. ఉత్పాదక రంగంలో పెట్టుబడులు (ప్రొడక్టివ్ క్యాపిటల్) రాష్ట్రం ఆవిర్భవించిన తర్వాత భారీగా పెరిగింది. 2012-13 ఆర్థిక సంవత్సరంలో రు. 2,69,268 మిలియన్లు ఉండగా 2015-16లో రు. 10,29,187 మిలియన్లకు పెరగడం విశేషంగా చెప్పవచ్చు. పరిశ్రమలు 2012-13లో రు. 13,656లు ఉండగా 2015-16లో రు. 14,874కు పెరిగినాయి. దీనిని స్వాగతించాల్సిందే కాని ఈ ప్రభావంతో సగటు తెలంగాణ పౌర సమాజానికి ఎంత మేరకు ఉపయోగం జరిగిందనేది ముఖ్యం.

**అంతరాలలో సమాంతరత లోపించిన సుస్థిరత**

మౌలికాభివృద్ధి మూలాల్ని బలోపేతం చేయకుండా కేవలం మటాల్లో మాత్రమే చూపడం పరిపాటిగా మారింది. తెలంగాణ సమాజంలో సమస్య కేవలం ఆర్థిక అంతరాలదే కాదు. ఈ అంతరాలతో సమానంగా సమాంతరంగా బలంగా ఉన్న కుల, మత, లింగ, ప్రాంత, భాషా అంతరాల పొరల్లో గాఢంగా ఇమిడి ఉంది. అందువల్ల తెలంగాణ సమగ్రాభివృద్ధి కొరకు కేవలం అర్థిక అంతరాల మీద కేంద్రీకరిస్తే చాలదు. అది తప్పనిసరిగా సామాజిక న్యాయ భావన పునాదిగా సాగాలి. దీని ఫలితంగా సుస్థిర అభివృద్ధి జరుగుతుంది. అభివృద్ధి అనేది వృద్ధిరేట్లలో పెరిగితే అది గణాంకాల్లో జరిగే మార్పు మాత్రమే. ఇది సరిగ్గా సమానత్వ భావనకు గాని, సంక్షేమ భావనకు గాని సమీపంగా లేనట్లే. మానవాభివృద్ధిలో గుణాత్మక మార్పు జరిగితేనే వాస్తవాభివృద్ధి జరిగినట్లు. ఆర్థికాభివృద్ధి స్వయంగా మానవాభివృద్ధికి, సామాజిక అభివృద్ధికి దారితీయదు. ఆర్థికాభివృద్ధి ప్రభావాన్ని సామాజికాభివృద్ధితో భాగస్వామ్యం చేయాలి. పాలకులు ఆర్థిక లాబాలే కాకుండా సామాజిక పరివర్తన కోసం ప్రణాళికలు ఏర్పాటు చేయాలి. మానవాభివృద్ధిలో ఆదాయంతో పాటు విద్య, ఆరోగ్యం అత్యంత ప్రధాన కారణాలు. వీటిని ఆర్థికాభివృద్ధితో అనుసందానం చేస్తే సామాజిక అభివృద్ధి జరుగుతుంది.

సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ సైన్సెన్ విడుదల చేసిన సామాజిక అభివృద్ధి అనుసారంగా తెలంగాణ అక్షరాస్యత జాతీయ సగటు కంటే 7 నుండి 8 శాతం తక్కువగా ఉంది. నేటికి మాల్ న్యూట్రిషన్‌తో ఉన్న పిల్లల సంఖ్య 46 శాతం. ఇందులో అధికంగా గిరిజనులే. ఈ ప్రాంతంలో బాల్య వివాహాలు అధికంగా జరుగుతుంటాయి. మద్యం వ్యాపారంలో అగ్రభాగాన తెలంగాణ ఉండడం వల్ల మద్యానికి బానిసలైన యువకులు అర్థాంతరంగా తనువు చాలిస్తున్నారు. దీనితో యువ వితంతువుల్లో తెలంగాణ మొదటి శ్రేణిలోకి వెళ్లింది. అమానవీయ అభివృద్ధిలో అగ్రభాగాన ఉండడంతో సామాజిక స్థితిగతులు తెలంగాణను ఎక్కిరిస్తున్నాయి.

తెలంగాణ రాష్ట్రంలో వర్కుఫోర్స్ పార్టిసిపేషన్ కేవలం 27 శాతం. దాంట్లో 17 శాతం మాత్రమే మ్యానిఫ్యాక్చరింగ్ పరిశ్రమల్లో ఉన్నారు. మూతబడిన పరిశ్రమల్లో తెలంగాణ దేశంలో 12వ స్థానంలో ఉంది. పెట్టుబడులను ఆకర్షిస్తున్నామంటూ ప్రభుత్వ పెద్దలంటుంటే ఉద్యోగ ఉపాధిలో పెరుగుదల ఆశించిన స్థాయిలో లేదు. 90 శాతం తెలంగాణ యువతను నైపుణ్యం లేని వాల్లుగా మిగిల్చినారు. తెలంగాణ ప్రజల్లో కష్టపడే స్వభావం ఉన్నప్పటికీ నాణ్యమైన, నైపుణ్యమైన ఉద్యోగితను తెలంగాణ ప్రభుత్వం సృష్టించలేకపోవడం విచారకరం. ప్రగతికి ప్రధాన

# నాలుగేళ్ల నిర్బంధ పాలన

***ప్రజాస్వామిక తెలంగాణ కోసం ఎన్నో బలిదానాలు, త్యాగాలు చేసిన సామాన్య ప్రజలు, విద్యార్థులు, మేధావులు నేడు నియంతృత్వ పాలనను ఎదుర్కొంటున్నారని అంటున్నారు** **డా. లక్ష్మణ్ గడ్డం***

తెలంగాణ ప్రజల ఆశలు తలకిందులైనాయి. గొప్పగా ఊహించుకున్న తెలంగాణ కోసం ప్రాణాలు దారపోసి సాధించుకుని చంద్రశేఖర రావు క్రూరమైన పరిపాలనలో ప్రజలు విలవిల్లాడుతున్నారు. జీవితాలను దుర్భరంగా వెళ్లదీస్తున్నారు. ఏ ఆచరణకు నోచుకోక నిస్సహాయ స్థితికి చేరుకున్న రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. నకిలీ విత్తనాలు, నకిలీ ఎరువుల సరఫరాతో దిగుబడి రాక అప్పుల వలయంలో చిక్కుకుని దిక్కుతోచని స్థితిలో ఉరితాడుకు వేలాడుతున్నారు. తెలంగాణ వస్తే ఉద్యోగాలొస్తాయని ఆశించిన విద్యార్థులు నిరాశ నిస్పృహలతో కాలం వెల్లదీస్తున్నారు. ఉద్యోగాలు దొరక్క, పెళ్లిళ్లు చేసుకోకుండా వయసు మీరుతున్న యువత పక్కదారులకు నెట్టివేయ బడుతున్నారు. కారణాలు తెలుసుకున్న చైతన్యవంతులు ఆందోళనకు దిగుతున్నారు. అయితే ప్రభుత్వం శాంతియుత ఆందోళనలను సైతం సహించడం లేదు. ఉక్కుపాదంతో అణచివేయబూనుకుంటుంది. అందుకు గాను పటిష్టమైన ఏర్పాట్లను సమకూర్చు కున్నది. మొదటగా పోలీసు యంత్రాంగాన్ని విస్తరించుకున్నది. పోలీసులకు విదేశీ శిక్షణ ఇప్పించింది. అత్యాధునికమైన ఆయుధాలు, వాహనాలు, అపరిమితమైన అధికారాలు ఇచ్చింది.

మరోమైపు ఉద్యమమే ఊపిరిగా రాసి, ఆడి, పాడి పోరాడిన మేధావీ వర్గాన్ని సంలీనం చేసుకుంది. అయినప్పటికీ పీడితవర్గ పక్షపాతిగా మిగిలిపోయిన మేధావి వర్గాన్ని శత్రుమూకలుగా చిత్రీకరించింది. సంఘాలు కట్టిన ప్రజా సమూహాల పైన ఏకంగా యుద్ధం ప్రకటించింది. ప్రజా సంఘాల కార్యకలాపాలకు అడ్డుకట్ట వేస్తుంది. ప్రజా సమూహాల కార్యకలాపాలను అడ్డుకోవడమంటే రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడడమే. తెలంగాణ ప్రభుత్వం ప్రాథమిక హక్కులను, ప్రజాస్వామిక హక్కులను, పోరాడే హక్కులను, భావ ప్రకటనా స్వేచ్ఛను అణచివేస్తుంది. చివరికి జీవించే హక్కును శాసిస్తున్నది. ఎప్పటిలాగే ఎన్‌కౌంటర్ హత్యలు, లాకప్ హత్యలు నూతన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రంలో కూడా కొనసాగుతున్నాయి. తెలంగాణ గడ్డ రక్తపు మరకల మయం కాదని, పోలీసు ఇనుప బూట్ల చప్పుడులుండవని, ఎన్‌కౌంటర్లు లేని తెలంగాణ అనే మాటలు పచ్చి బూటకమయ్యాయి.

## నిర్బంధ రూపాలు

తెలంగాణ రాష్ట్రంలో ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులపై విరుచుకుపడడంతో మొదలైంది రాజ్యహింస. కాంట్రాక్ట్ ఉద్యోగుల క్రమబద్ధీకరణకు వ్యతిరేకంగా పోరాడిన పాపానికి తార్నాక చౌరస్తాలో విద్యార్థులపై పాశవికంగా లాఠీచార్జీ చేసి తలలు పగులగొట్టారు. ఈ విద్యార్థులు ప్రాణాలిస్తేనే గద్దెకెక్కానన్న వాస్తవాన్ని కెసిఆర్ మరిచి పోయాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంపై కక్ష ఇప్పటికీ కొనసాగుతుంది. తెలంగాణకు ప్రత్యేక హైకోర్టు కావాలని న్యాయవాదులు ధర్నాకు దిగితే టెంటు ధ్వంసం చేసి న్యాయవాదులను అరెస్టు చేశారు. మెదక్ జిల్లా చేగుంట రైతులు తమ వరిపొలాలు నీళ్లులేక ఎండిపోతున్నాయి,

---

సూచిక ప్రజలను మొదటి స్థానంలో ఉంచడమే. ఇది సుస్థిరాభివృద్ధికి ప్రమాణికమైన కొలమానం కాబట్టి స్థూల జాతీయోత్పత్తి పెరుగుదల సాధనను మించి ముందుకు సాగాలి.

## తెలంగాణ అభివృద్ధిపై లోపించిన దూరదృష్టి

దూరదృష్టిలో తెలంగాణ అభివృద్ధిపై దార్శనితను కలిగి ఉండాల్సిన అవసరముంది. ఈ ప్రభుత్వం ప్రకటనల్లో కాదు, తెలంగాణ ప్రజల సమగ్ర సంపూర్ణ అభివృద్ధికి కట్టుబడి పనిచేయాలి. సామాజిక అభివృద్ధిలో ఆర్థికవృద్ధి కీలకమని సామాజిక సంక్షేమ, సమ్మిళిత వృద్ధి కార్యక్రమాల ద్వారా కోట్లాది ప్రజానీకపు జీవితాలు స్థిరమైన మెరుగుదలను తెలంగాణ కాంక్షిస్తుంది. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో మౌలిక వసతులు మెరుగుపరిచి మొత్తంగా అందరికి సదుపాయాలు కల్పించాలి. భౌగోళికంగా ఉన్న అన్ని ప్రాంతాలకు అన్ని వర్గాలకు సమ్మిళిత అభివృద్ధి అందించడం కోసం స్థిరమైన ప్రయత్నం చేయాలి. సార్వత్రిక, సాంకేతిక విద్య, విద్యతో నైపుణ్యాలను పెంచాలి. అందరికి అందుబాటులోకి ఆరోగ్య సేవలను అందించి, ఫలప్రదమైన ఉద్యోగ ఉపాధి అవకాశాల కల్పన ద్వారానే మానవ వనరుల వికాసం జరుగుతుంది. వ్యవసాయాభివృద్ధి, సమ్మిళిత అభివృద్ధి, గ్రామీణాభివృద్ధితోనే సామాజికాభివృద్ధి జరుగుతుంది.

తెలంగాణలో నేటి వరకు జరిగిన అన్యాయానికి ఉమ్మడి రాష్ట్రాన్ని కారణంగా చూపినాం. ప్రత్యేక రాష్ట్రంతో అన్ని సమస్యలు పరిష్కారం అవుతాయని ప్రజలందరిని ఒప్పించినాం. ప్రజలందరిని నమ్మించి అధికారాన్ని హస్తాగతం చేసుకున్నారు. చెరువుల ధ్వంసం మొదలుకొని విద్యారంగ కార్పొరేటీకరణ, వైద్య రంగం కుంటుపడడం, వ్యవసాయ రంగ సంక్షోభం, చేనేత పరిశ్రమ దివాలా తీయడం, ఉపాధి, ఉద్యోగిత లభ్యం కాకపోవడం లాంటి సకల సమస్యలకు ఉమ్మడి రాష్ట్రాన్ని కారణంగా చూపినాం. అన్నింటికి పరిష్కారమే తెలంగాణ. ఇది విస్తృత ప్రజా ఉద్యమం ద్వారా ఏర్పడింది. ప్రత్యేక తెలంగాణ ఆవిర్భావం తర్వాత ప్రజల్లో గొప్ప ఆశలు, ఆకాంక్షలు పెరిగినాయి. ఆ ఆకాంక్షలు నెరవేరకపోతే గొప్ప ఉపద్రవమే జరుగుతుంది. అంబేద్కర్ రాజ్యాంగాన్ని ఈ దేశానికి అందించి అన్ని సమస్యలకు ఈ రాజ్యాంగమే పరిష్కారం చూపుతుందన్నారు. ప్రజల విశ్వాసాన్ని ప్రభుత్వాలు పొందకపోతే ఆ ప్రజలే మరల మరింత చైతన్యవంతమైన నిర్ణయాలు తీసుకుంటారన్నారు. ఇది తెలంగాణకతీతమేమీ కాదు. ఈ ప్రాంతం ఏడు దశాబ్దాలకు పూర్వమే దేశంలో కెల్లా ఉజ్వలమైన సామాజిక న్యాయ భావనను తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం ద్వారా ప్రకటించింది.

(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ) వీ

నిరంతర కరెంటు సప్లయి చేయండని రోడ్డెక్కితే తలలు పగులగొట్టారు. టివి9, ఎబిఎన్ ఆంధ్రజ్యోతి ఎలక్ట్రానిక్ చానళ్ల ప్రసారాల నిలిపివేతకు వ్యతిరేకంగా ఉద్యమించిన జర్నలిస్టులను చితకబాదారు. కార్డన్ సర్చ్ పేరుతో రాష్ట్ర వ్యాప్తంగా అర్ధరాత్రులు తనిఖీలు చేస్తూ కష్టజీవులకు నిద్ర లేకుండా, మనశ్శాంతి లేకుండా ఆందోళనకు గురిచేస్తున్నారు. విశాఖపట్నం జిల్లాలోని మారుమూల గ్రామం నుండి కొంత మంది గిరిజనులు హైదరాబాద్ చేరుకుని విప్లవ కవి వరవరరావు ఇంటి ముందు ధర్నాకు దిగారు. మావోయిస్టుల దాడుల నుండి మమ్మల్ని రక్షించాలని, వరవరరావు జోక్యం చేసుకోవాలని నినదించారు. దీనికి తెలంగాణ పోలీసులు స్పష్టంగా పతకం రచించి నడిపించారు.

**సభలు, సమావేశాలపై దాడులు**

2004 సెప్టెంబర్ 21న రెండు ప్రధాన విప్లవ పార్టీలైన సిపిఐ ఎంఎల్ (పీపుల్స్‌వార్), ఎంసిసి పార్టీలు విలీనమై సిపిఐ (మావోయిస్టు)గా అవతరించి పదేళ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా బహిరంగ సభ నిర్వహించాలని రాష్ట్రంలోని కొంతమంది మేధావులు నిర్ణయించుకున్నారు. 2014 సెప్టెంబర్ 21న సుందరయ్య విజ్ఞాన కేంద్రం వద్ద ర్యాలీ నిర్వహించాలని 'ప్రత్యామ్నాయ రాజకీయ వేదిక' మేధావులు నిర్ణయించారు. అయితే పోలీసులు ర్యాలీ, సభకు అనుమతి నిరాకరించారు. నిజానికి హాల్ మీటింగుకు ఎవరి అనుమతి అక్కర్లేదు. అనుమతి లేదనే నెపంతో తెలంగాణ, ఆంధ్ర ప్రభుత్వాలు కుమ్మక్కై ప్రజలను అక్రమంగా అరెస్టు చేశారు. రెండు రాష్ట్రాల నుండి వేలాదిగా తరలిన ప్రజలను పోలసు స్టేషన్‌లలో నిర్బంధించారు. ఆ సందర్భంలో రెండు రాష్ట్రాలలోని దాదాపు అన్ని పోలీసు స్టేషన్‌లు ప్రజల అరెస్టులతో నిండిపోయాయి. జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్, ఒడిశా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల నుంచి వచ్చిన కళాకారులను అరెస్టు చేశారు. వరవరరావు ఇంటిపై దాడిచేసి అరెస్టు చేశారు. ప్రొ. హరగోపాల్‌ను ఇతర వ్యక్తులు ప్రొ. కంచన్ కుమార్, ప్రొ. అమిత్ బట్టాచార్యలను గృహ నిర్బంధం చేశారు. పౌరహక్కుల సంఘం, ఇతర ప్రజా సంఘాల నాయకులను, కార్యకర్తలను అరెస్టు చేశారు. పాలకులు రాజ్యాంగం తమకిచ్చిన అధికారాలు వాడుకుంటున్నారు. అవి ప్రజా వ్యతిరేకంగా ఉన్నా తటపటాయించడం లేదు. కాని రాజ్యాంగం ప్రజలకిచ్చిన హక్కులను, ఆదర్శాలను అమలు చేయడం లేదు. మేధావులను గౌరవించనివారు టిఆర్ఎస్ భవన్‌లో ప్రొ. జయశంకర్ విగ్రహం పెట్టుకోవడంలో అర్థం లేదు.

రాష్ట్రంలో మొదలైన ఎన్‌కౌంటర్‌ల పర్వం నిలవరించాలనే ఉద్దేశంతో 'తెలంగాణ ప్రజాస్వామిక వేదిక' చలో అసెంబ్లీ పిలుపునిచ్చింది. భారత శిక్షాస్మృతి 176 (1) (ఎ) ప్రకారం న్యాయ విచారణ జరపాలని డిమాండ్ చేసింది. పిలుపునందుకుని హైదరాబాద్ చేరుకున్న దాదాపుగా 20,000 మంది కార్యకర్తలను అరెస్టు చేశారు. ముళ్ల కంచెలతో, గుంపుల మోహరింపులతో యుద్ధ వాతావరణాన్ని తలపించారు. అయితే చలో అసెంబ్లీ పిలుపునందుకుని విద్యార్థులు పాల్గొంటారని భావించిన పోలీసులు ముందు రోజు అర్ధరాత్రి ఉస్మానియా యూనివర్సిటీ హాస్టళ్లపై దాడి చేశారు. నిద్రలోంచి లేచిన విద్యార్థులు హాస్టళ్ల వెనక్కి పరుగులు తీసి చెట్ల పొదలలో తలదాచుకుని మరుసటి రోజు ఉదయం చలో అసెంబ్లీ కదంతొక్కారు. ఇందులో వేలాది మంది విద్యార్థులను అక్రమంగా అరెస్టు చేశారు. అనాటి సాయంత్రం కల్లా అరెస్టయిన నాయకులను, కార్యకర్తలను పోలీసులు వదిలిపెట్టారు. కాని తెలంగాణ విద్యార్థి వేదిక అధ్యక్షుడు మహేష్‌ను మాత్రం సుల్తాన్ బజార్ పోలీసులు విడుదల చేయలేదు. క్యాంపస్‌లో విద్యార్థులు ఆందోళనకు దిగితే ఆ రాత్రి ఒంటి గంటకు మహేష్‌ను విడుదల చేశారు. పోలీసుల చిత్రహింసల కారణంగానే ఎంతో మంది యువకులు ఉద్యమాల బాట పట్టిన ఉదంతాలను పోలీసులు గుర్తుంచుకోవాలి.

మావోయిస్టులకు సహకరిస్తున్నారనే నెపంతో 2016 మార్చి 10న రాత్రి 11 గంటలకు ఆదిలాబాద్ జిల్లా దహేగాం మండలం రావులపల్లి గ్రామానికి చెందిన సిడాం శ్రీనివాస్‌ను, టెంపర్‌గాం గ్రామానికి చెందిన కుద్మెత సుగుణయ్యను దహేగాం పోలీసులు అరెస్టు చేసి తీవ్ర చిత్రహింసలకు గురిచేశారు. పోలీసుల హింస తట్టుకోలేక శ్రీనివాస్ పురుగుల మందు తాగి ఆత్మహత్య ప్రయత్నం చేశాడు. మావోయిస్టుల డంపులు చూపెట్టాలని తీవ్ర చిత్రహింసలకు గురిచేస్తే తట్టుకోలేక చూపెడతానని తన పొలం దగ్గరకు పోలీసులను తీసుకొచ్చి మంచెపైకి ఎక్కి మంచెపైన దాచిన పురుగుల మందు తీసుకుని తాగాడు. మంచిర్యాల ఆసుపత్రిలో కోలుకుని మనిషైతే బతికాడు కాని పోలీసులు కొట్టిన దెబ్బలకు శాశ్వత వికలాంగుడైనాడు. వ్యవసాయ పనులకు పనికిరాకుండా అయ్యాడు. శాశ్వత బలహీనుడిగా మారిన శ్రీనివాస్ కుటుంబాన్ని ఎవరు ఆదుకోవాలి? పోలీసుల ప్రతాపమంతా పేదలపైనే గదా! సుగుణయ్యను కూడా తీవ్రంగా కొట్టారు. గతంలో కూడా తీవ్రంగా కొట్టి వదిలేశారు. సుగుణయ్య గిరివెల్లి ఎంపిటిసి కుద్మెత మొండక్క భర్త. ప్రజా ప్రతినిధుల కుటుంబాలకు కూడా రక్షణ లేకుండా పోతుంది.

ఆదిలాబాద్ జిల్లా కాగజ్‌నగర్ మండలం, సులుగుపల్లికి చెందిన సోయం చిన్నయ్యను కూడా 2016 మేలో మావోయిస్టులతో సంబంధ ముందని పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్లి చిత్రహింసలు పెట్టారు. చిన్నయ్య ఆదివాసి హక్కుల కోసం పోరాడుతున్న నాయకుడు. సాధారణ రైతులను కూడా తెలంగాణ ప్రభుత్వం ప్రశాంతంగా బతకనీయడం లేదు.

తెలంగాణ ఐక్య కార్యాచరణ కమిటి (టి-జెఎసి) 2017 ఫిబ్రవరి 22న జరిగిన నిరసన ర్యాలీపై పోలీసులు అమానుషంగా దాడికి పాల్పడ్డారు. రెండేళ్లలో లక్షా పదివేల ప్రభుత్వ శాఖల్లో ఏర్పడిన ఖాళీలను భర్తీ చేస్తానని ఇచ్చిన హామీని నిలబెట్టుకోవాలని డిమాండ్ చేస్తూ తలపెట్టిన ర్యాలీపై ప్రభుత్వం ఉక్కుపాదం మోపింది. నిరుద్యోగులను జిల్లాలో, హైదరాబాద్‌లో అరెస్టు చేశారు. అర్ధరాత్రి ప్రొ. కోదండరాం ఇంటిపై దాడిచేసి ఇంటి తలుపులు పగులగొట్టి అరెస్టు చేశారు. పోలీసులు గునపాలు, ఇనుపరాడ్లతో తలుపులు విరగ్గొట్టి ఇంట్లోకి చొరబడి గుండాల్లాగా ప్రవర్తించడం చరిత్రలో ఎక్కడా వినలేదు. విచిత్రంగా ఇదే సమయంలో ముఖ్యమంత్రి తిరుపతి మొక్కుల చెల్లుబడిలో నిమగ్నమయ్యారు. పాలకులు ఒక మతానికి చెందిన దేవుడిని పూజించడం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం.

మళ్లీ 2017 అక్టోబర్ 31న టిజెఎసి ఆధ్వర్యంలో కొలువుల కొట్లాట పేరుతో నిరుద్యోగులు హైదరాబాద్‌లో సభ తలపెట్టారు. ప్రభుత్వం మళ్లీ ఆగ్రహించింది. సభ నిరాకరించింది. భారతదేశంలో కేవలం భూస్వాములు, పెట్టుబడిదార్లు, అగ్రకుల పెత్తందార్లు రాజ్యాధికారం అవుతారు కనుక ఈ హింసాత్మక అణచివేత కొనసాగుతుంది. సభ నిరాకరణతో కోదండరాం 24 గంటల దీక్ష తన ఇంటివద్దనే నవంబర్ 1న కొనసాగించారు.

గిట్టని వాళ్లను నేలమట్టం చేయాలనే ప్రభుత్వ కక్షలో భాగంగా అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య కార్యాలయం, తెలంగాణ యునైటెడ్ ఫ్రంట్ కార్యాలయాల ఉమ్మడి కార్యాలయాలపై పోలీసులు దాడిచేశారు. 2016 డిసెంబర్‌లో కార్యాలయాన్ని ప్రభుత్వం సీజ్ చేసింది. చివరికి మూసేశారు. కళాకారులను రోడ్డున పడేశారు. రెండు గదుల ఇళ్లు ఇస్తానని చెబుతూ మరోవైపు ఇంట్లో ఉన్న వాళ్లను నిలవ నీడ లేకుండా చేస్తుంది. ఆటా, పాటా, మాటా బంద్ అన్న పరాయి పాలకులకు తెలంగాణ పాలకులకు మధ్య గీత చెరిగిపోయింది.

తెలంగాణ సాధన కోసం నిరంతర కృషి చేసిన ప్రొ. కోదండరాం ప్రభుత్వ వైఫల్యాలను చూసి గుండెమండి ఎత్తిచూపితే ఆయన మీద ప్రభుత్వంలోని పెద్దలందరూ సామూహిక మాటల దాడి చేశారు. ప్రజాస్వామిక దేశంలో విమర్శలను, భిన్నాభిప్రాయాలను, ప్రత్యామ్నాయ విశ్వాసాలను, రాజకీయాలను గౌరవించడమనే ప్రజాస్వామ్య విలువలను పాలకులు తప్పనిసరిగా అనుసరించి పాటించాలి.

సిద్దిపేట జిల్లా మిర్దొడ్డి మండలం తాళ్లపల్లి గ్రామంలో ప్రజల సమస్యల గురించి తెలుసుకుంటున్న జనశక్తి కార్యకర్తలను పోలీసులు అక్రమంగా అరెస్టు చేశారు. 2017 ఆగస్టు 2న గ్రామాన్ని సందర్శించిన మూర్తి శ్రీనివాస్‌రెడ్డి, రైతుకూలి పోరాట సమితి నాయకులు యాదగిరి, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య కోశాధికారిని అక్రమంగా అరస్టు చేసి తప్పుడు కేసులు బనాయించి జైలుపాలు చేశారు. ఛత్తీస్‌గఢ్‌లో 2016 డిసెంబర్ 16న సోమారు పొట్టం (14) మృతదేహానికి రీ పోస్టుమార్టం చేయాలని ఛత్తీస్‌గఢ్ హైకోర్టు ఆదేశించింది. బీజాపూర్ జిల్లా మెట్‌పాల్ గ్రామానికి చెందిన పొట్టంను పారా మిలటరీ బలగాలు చంపేసి ఎన్‌కౌంటర్ కథ అల్లారు. రీ పోస్టుమార్టం చేయాలని షాలినీ గేరా హైకోర్టును ఆశ్రయిస్తే ఈ మేరకు ఆర్డర్ వచ్చింది. రీ పోస్టుమార్టం వరకు సోనీసోరీ ఆధ్వర్యంలో ఇంట్లో కుటుంబీకులే శవాన్ని భద్రపరిచారు. 2016 డిసెంబర్ 25న రీ పోస్టుమార్టం జరిగింది. ఛత్తీస్‌గఢ్ చరిత్రలో ఇది మొదటి ఘటన.

ఈ ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణ చేయడానికి 'తెలంగాణ ప్రజాస్వామిక వేదిక' తరపున ఏడుగురు బృందం డిసెంబర్ 26న హైదరాబాద్ నుండి బయలుదేరింది. ఈ బృందంలో కుల నిర్మూలన పోరాట సమితి ఆంధ్రప్రదేశ్ అధ్యక్షుడు దుడ్డు ప్రభాకర్, తెలంగాణ ప్రజాస్వామ్య వేదిక నాయకుడు చిక్కుడు ప్రభాకర్, బండి దుర్గాప్రసాద్, రాజకీయ ఖైదీల విడుదల కమిటీ నాయకుడు బల్ల రవీందర్, తుడుందెబ్బ నాయకుడు రమణాల లక్ష్మయ్య, విద్యార్థి నాయుడు నజీర్, జర్నలిస్ట్ రాజేంద్ర ప్రసాద్‌లు ఉన్నారు. వీరిని అడ్డగించిన తెలంగాణ పోలీసులు తెలంగాణ లోనే పర్ణశాల దగ్గర అరెస్టు చేసి ఛత్తీస్‌గఢ్ పోలీసులకు అప్ప చెప్పారు. ఛత్తీస్‌గఢ్ పబ్లిక్ సెక్యూరిటీ చట్టం కింద సుక్మ జైలులో నిర్బంధించారు. సరిగ్గా ఆరు నెలల తర్వాత బెయిల్‌పై విడుదలయ్యారు. తెలంగాణ ప్రభుత్వం సత్యశోధనను కూడా అడ్డుకుంటుంది. పోలీసులు సరిహద్దులు దాటి పనిచేస్తున్నారు. అందుకే నంబర్ వన్ అయ్యారేమో!

రాష్ట్రంలో సభలు, సమావేశాలకు తావులేకుండా చేస్తున్నారు. తెలంగాణ విద్యార్థి వేదిక సభను నల్గొండలో నిరాకరించారు. తెలంగాణ ప్రజాస్వామిక వేదిక బహిరంగ సభను వరంగల్‌లో జరగనివ్వలేదు. తెలంగాణ విద్యార్థి సంఘం సభను పెద్దపల్లిలో అడ్డుకున్నారు. కోర్టులను ఆశ్రయిస్తే తప్ప సభలు జరుపుకునే పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

హైదరాబాద్‌లో 2017 నవంబర్ 28,29,30న ప్రపంచంలోని 150 దేశాల పారిశ్రామిక ప్రతినిధుల సమావేశం, గ్లోబల్ ఎంటర్ ప్రెన్యూర్స్ సమ్మిట్ (జిఇఎస్) జరిగింది. ఇదే సమయంలో ప్రజలకు మెట్రో రైలు సేవలు అందుబాటులోకి వచ్చాయి. ఈ సదస్సుకు అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ కూతురు ఇవాంక కూడా హాజరయింది. ఈమె రాక సందర్భంగా హైదరాబాద్ పోలీసులతో అష్ట దిగ్బంధం అయింది. ఎక్కడ చూసినా కేంద్ర, రాష్ట్ర పోలీసు అధికారులే. అమెరికా నుంచి సీక్రెట్ సర్వీస్ అధికారులే కాక, రాష్ట్రానికి చెందిన 15 వేల మంది పోలీసులు, గ్రేహౌండ్, ఆక్టోపస్ స్పెషల్ టీం పోలీసులతో హైదరాబాద్‌లో పౌర జీవనం అతలా కుతలమైంది. ఈ సందర్భంగా నగరంలోని బిక్షగాళ్లను దూర ప్రాంతాలకు తరలించారు. ఫుట్‌పాత్ వ్యాపారులను తొలగించారు.

ఇవాంక గోబ్యాక్ అంటూ ప్రజా సంఘాలు నిరసన ప్రదర్శనలు చేశాయి. తెలంగాణ ప్రజాఫ్రంట్ అధ్యక్షుడు నలమాస కృష్ణ, ఉపాధ్యక్షుడు రవిచంద్రను, తెలంగాణ విద్యార్థి వేదిక అధ్యక్షుడు మద్దిలేటి, ఇతర విద్యార్థి, ప్రజా సంఘాల నాయకులను సుందరయ్య విజ్ఞాన కేంద్రం వద్ద ఇవాంక గోబ్యాక్ అంటూ నిరసన ప్రదర్శన చేస్తే అరెస్టు చేసి గాంధీనగర్ పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించారు.

సిరిసిల్ల నుండి హైదరాబాద్‌కు రైల్వే లైను మంజూరు అయినది. దీని అలైన్‌మెంట్ మొదట భూస్వాముల భూమి మీదుగా మార్కింగు జరిగినది. తర్వాత రాజకీయ వత్తిడీలతో అదికాస్త మారి దళితుల భూముల మీదుగా మార్చబడింది. ఇదేం అన్యాయమని అడిగినందుకు సిరిసిల్లా గ్రామానికి చెందిన కత్తి దేవదాసుపై రౌడీషీట్ కేసు నమోదు చేసి మానసిక వేదనకు గురిచేశారు.

ఉస్మానియా యూనివర్సిటీ మానేరు హాస్టల్‌లో మురళి అనే విద్యార్థి 2017 డిసెంబర్ 3న ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ సందర్భంగా విద్యార్థులు ఆందోళన చేయగా విద్యార్థులను పోలీసులు చితకబాదారు. విద్యార్థి నాయకుడు స్టాలిన్‌తో మరో 12 మందిని అంబర్‌పేట పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించారు. మరో 15 మంది విద్యార్థులపై కేసులు నమోదు చేసి జైలుకు పంపారు.

శాతవాహన యూనివర్సిటీలో 2017 డిసెంబర్ 25న దళిత, వామపక్ష విద్యార్థులు మనుస్మృతిని తగులబెట్టారు. అయితే భారతమాత బొమ్మను తగులబెట్టారని ఆరోపిస్తూ ఎబివిపి విద్యార్థులు వారిపై దాడి చేశారు. యూనివర్సిటీని కొంత కాలం మూసేశారు. అయితే దళిత, వామపక్ష విద్యార్థులను ప్రొ. సూరెపల్లి సుజాత పురిగొల్పిందని ఎబివిపి విద్యార్థులు పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. సోషల్ మీడియాలో పోస్టింగులు పెట్టి మానసికంగా వేధించారు. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో ప్రొ. లక్ష్మినారాయణ పాఠాలు సరిగ్గా చెప్పడం లేదని, విద్యార్థులకు రాజకీయాలు నేర్పుతున్నాడని ఆరోపిస్తూ సోషల్ మీడియాలో పోస్టింగులు పెట్టారు. బిజెపి అధికారంలోకి వచ్చాక మేధావులపై దాడులు పెరిగిపోయాయి.

తెలంగాణ ప్రభుత్వం మాదిగల మీద కూడా కక్షగట్టింది. గత 24 ఏండ్లుగా ఎస్‌సి రిజర్వేషన్ల వర్గీకరణ కోసం మాదిగలు పోరాడుతున్నారు. తెలంగాణ ప్రభుత్వం అఖిల పక్షాన్ని ఢిల్లీకి తీసుకెళ్లాలని డిమాండ్ చేస్తూ ఎంఆర్‌పిఎస్ కలెక్టరేట్ల ముట్టడికి పిలుపునిచ్చింది. 2017 నవంబర్ 6న హైదరాబాద్ కలెక్టర్ ఆఫీసు ముందు జరిగిన ధర్నాలో పోలీసుల దాడి వలన మహిళా నాయకురాలు భారతి అక్కడికక్కడే చనిపోయింది. 2017 డిసెంబర్17న సికింద్రాబాద్ కంటోన్మెంట్ హాకీ గ్రౌండ్‌లో భారతి సంస్మరణ సభ జరిగింది. అయితే సభ ముగిశాక రాత్రి 11 గంటలకు సభా ప్రాంగణం నుండి ట్యాంక్‌బండ్ వరకు మిలియన్ మార్చ్ నిర్వహించారు. ఈ సందర్భంగా మందకృష్ణ మాదిగను పోలీసులు ఈడ్చుకుంటూ లాక్కెళ్లి పోలీసు వాహనంలో తీసుకెళ్లారు. అనేక రకాల కేసులు ఐపిసి 188, 144, 145, 147, 148, 341, 353 సెక్షన్ల కింద నమోదు చేసి జైలుకి పంపారు. డిసెంబర్ 27న బెయిల్ మీద విడుదలయ్యాడు. పార్లమెంట్ సమావేశాలు జరుగుతున్నందున ఉపవాస దీక్ష చేయాలని డిసెంబర్ 28 నుంచి 2018 జనవరి 1 వరకు ఉపవాస దీక్ష కోసం స్థలం కేటాయించాలని కోరితే ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. దీంతో ఎంఆర్‌పిఎస్ ఆఫీసులోనే జనవరి 2న దీక్ష బూనితే పోలీసులు ఆఫీసులోకి చొరబడి లాఠీచార్జీ చేసి మందకృష్ణను అరెస్టు చేసి ఐపిసి 143, 188, 341, 506, 505 సెక్షన్లు నమోదు చేసి జైలుకు పంపారు. రాష్ట్రంలో గాంధేయ మార్గ నిరసనకు కూడా అవకాశం లేకుండా పోయింది.

*(రచయిత అధ్యక్షుడు, పౌరహక్కుల సంఘం)* వీ

# తెలంగాణలో మెరుగుపడని వైద్యం - ఆరోగ్యం

*ప్రభుత్వ వైద్యరంగాన్ని నిర్లక్ష్యం చేస్తూ, ప్రైవేట్ వైద్యాన్ని ప్రోత్సహిస్తూ సామాన్య ప్రజలకు మెరుగైన వైద్య సేవలు అందుబాటులో లేకుండా చేస్తున్న తెలంగాణ ప్రభుత్వ తీరుతెన్నులను వివరిస్తున్నారు* **ఎ. నర్సింహా రెడ్డి**

మనిషికి అత్యంత విలువైనది ప్రాణం. మనిషి ప్రాణంతో ఉండాలంటే ఆరోగ్యం బాగుండాలి. ఆరోగ్యం క్షీణిస్తే ప్రాణం ప్రమాదంలో పడుతుంది. ఆరోగ్యం ఉత్పాదక శక్తిని పెంచుతుంది. అధిక ఉత్పత్తి, సమర్థమైన ఉత్పత్తి చేయగలిగిన శ్రామికులను అందిస్తుంది. ఆరోగ్యంపై చేసే వ్యయం ఖర్చుగా చూడకూడదు. అది పెట్టుబడే గాని వ్యయం కాదు. 'ఆరోగ్యం మహాభాగ్యం' అన్నారు పెద్దలు. ఇంతటి విలువైన ప్రాణాన్ని కాపాడడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యం వహిస్తున్నాయి. ఐక్యరాజ్య సమితి 1948 డిసెంబర్ 10న ప్రకటించిన మానవ హక్కుల్లో ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా గుర్తించింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుఎచ్ఒ) ఆరోగ్యం అంటే వ్యాధి రాకుండా ఉండే పరిస్థితి మాత్రమే సరిపోదని మనిషి శారీరకంగా, మానసికంగా, సామాజిక అంశాలు, సాంకేతిక సమాచార వ్యవస్థ, శారీరక శ్రమ, పౌష్టిక ఆహారం, ఆహార అలవాట్లు, పర్యావరణం, మత్తు పదార్థాలు, మద్యపానం, పౌష్టికాహార లోపం, సరిపడ నిద్ర, శారీరక శ్రమ, కలుషితం లేని గాలి, నీరు, వాతావరణం, ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు మనిషి ఆరోగ్యాన్ని నిర్ణయిస్తాయని నిర్వచించింది.

డబ్ల్యుఎచ్ఒ ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా గుర్తించినప్పటికి ప్రజలందరికి సమాన వైద్యం ఒక కలగానే మిగిలింది. ఏ సమాజంలోనైతే ప్రభుత్వాలు ప్రజారోగ్యానికి, విద్యకు అధిక ప్రాధాన్యత ఇస్తాయో ఆ సమాజం అన్ని రకాలుగా అభివృద్ధి చెందుతుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ చెప్పినట్లు మొత్తం ఆరోగ్య వ్యయంలో ప్రభుత్వ (కేంద్ర, రాష్ట్రాల) వాటా జి.డి.పిలో ఇప్పుడున్న ఒక శాతం కాకుండా 5 శాతానికి పెరగాలంటే కేంద్రం, రాష్ట్రం విడివిడిగా వారి, వారి బడ్జెట్లను ఇప్పుడు చేస్తున్న కేటాయింపులకు 5 రెట్లు పెంచాలి. ప్రజలకు అత్యవసరమైన, జీవన్మరణ సమస్యలను వదిలేసి ప్రజలకు అంతగా అవసరం లేని లేదా ప్రజా వ్యతిరేక కార్యక్రమాలకు ప్రాధాన్యతనిస్తూ అదే అభివృద్ధని తెలంగాణ ప్రభుత్వం భ్రమింపజేస్తుంది. ప్రజారోగ్య వ్యవస్థ సమర్థవంతంగా పని చేసినపుడే రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కుకు అర్థం ఉంటుంది. ఆరోగ్య రక్షణ పౌరుల ప్రాథమిక హక్కుగా గుర్తింపబడాలి. పేద, ధనిక-పట్టణ గ్రామీణ తేడా లేకుండా అందరికి సమానంగా సమర్థవంతమైన, నాణ్యమైన వైద్య సౌకర్యాలు అందుబాటులో ఉండాలి. అయితే తెలంగాణ ప్రభుత్వం ఆ దిశలో చర్యలు తీసుకోవడం లేదు.

ప్రపంచంలో చాలా దేశాలు ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా గుర్తిస్తూ తమ రాజ్యాంగంలో చేర్చాయి. మనదేశం ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా ఇంకా గుర్తించలేదు. కానీ మన సుప్రీం కోర్టు జీవించే హక్కులో భాగంగా ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా చూడాలని స్పష్టం చేసింది. కొన్ని దశాబ్దాలు కొట్లాడి సాధించుకున్న తెలంగాణను ప్రజాస్వామిక తెలంగాణగా నిర్మించుకోవాలంటే విద్యా వైద్య రంగాలకు అధిక నిధులు కేటాయించి అందరికీ సమాన విద్య, వైద్యం అందించాల్సిన బాధ్యత తెలంగాణ ప్రభుత్వం పైన ఉన్నది. కానీ, తెలంగాణ ప్రభుత్వం ఆలోచనలు అందుకు భిన్నంగా ఉన్నాయని నాలుగు సంవత్సరాల ఆచరణ తెలుపుతుంది. టి.ఆర్.ఎస్. పార్టీ ఎన్నికల మేనిఫెస్టోలో మాటలు బాగానే చెప్పింది. కానీ, ఆచరణలోకి వచ్చేసరికి ఒక్క అడుగు ముందుకు సాగడంలేదు.

**తెలంగాణ ప్రజా ఆరోగ్య సూచికలు**

తెలంగాణ రాష్ట్రంలో ప్రజల ఆరోగ్య పరిస్థితులు ప్రభుత్వ అధికారిక లెక్కల ప్రకారం, జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే -4 ప్రకారం 2015-16 సంవత్సరానికి తెలంగాణ రాష్ట్ర గణాంకాలను పరిశీలిస్తే రాష్ట్రంలో శిశు మరణాలు ప్రతి 1000 మందిలో సంవత్సరంలోపు పిల్లలు 28 మంది చనిపోతున్నా రు. మాతృ మరణాలు లక్ష మందికి 92 ఉన్నాయి. రక్తహీనతతో బాధపడుతున్న పిల్లలు 60.7 శాతం. దక్షిణాది రాష్ట్రాలైన కేరళలో శిశు మరణాలు 12, మాతృ మరణాలు 81, తమిళనాడులో శిశు మరణాలు 21, మాతృ మరణాలు 90, కర్ణాటకలో శిశు మరణాలు 28, మాతృ మరణాలు 84 ఉన్నాయి. తెలంగాణలో 5 సంవత్సరాల లోపు పిల్లలు పౌష్టికాహారం లేక పెరుగుదల సరిగా లేని వారు 28 శాతం, వయస్సుకు తగ్గ బరువు లేనివారు 28.5 శాతం, వయస్సుకు తగ్గ బరువు లేక కండరాలు క్షీణించిన వారు 18 శాతం, 50 సంవత్సరాల లోపు వయస్సు గల మహిళలు రక్తహీనతతో భాదపడుతున్నవారు 56.9 శాతం, గర్భిణీ స్త్రీలు రక్తహీనతతో బాధపడుతున్నవారు 50 శాతం.

పోషకాహార విషయంలో తెలంగాణ వెనుకబడే ఉంది. పిల్లల్లో పోషకాహార లోపం ఎక్కువగా ఉంది. పిల్లల్లో అత్యధిక మరణాలు తక్షణమే నివారించగల, తక్కువ ఖర్చుతో, నాణ్యమైన పంపిణీ జోక్యంతో, నిరూపిత వైద్య విధానాలతో చికిత్స చేసి నివారించదగ్గ వ్యాధుల వల్లనే

**పౌష్టికాహార లోపం, ఐదేళ్లలోపు పిల్లలపై ప్రభావం**

| జిల్లా | గిడసదనం | కృంగిన శరీరం | బరువు తక్కువ |
|---|---|---|---|
| ఆదిలాబాద్ | 38.3 | 22.1 | 5.8 |
| హైదరాబాద్ | 5.7 | 14.1 | 16.8 |
| కరీంనగర్ | 24.3 | 19.5 | 25.6 |
| వరంగల్ | 26.6 | 16.6 | 29.1 |
| ఖమ్మం | 26.7 | 13.6 | 22.5 |
| మహబూబ్‌నగర్ | 37.6 | 18.9 | 6.8 |
| మెదక్ | 33.4 | 20.7 | 37.8 |
| నల్గొండ | 28.9 | 23.5 | 34.1 |
| నిజామాబాద్ | 36.6 | 22.0 | 36.9 |
| రంగారెడ్డి | 26.2 | 14.8 | 25.8 |

జరుగుతున్నవి. పిల్లల్లో పోషకాహార లోపం అధికంగా ఉండడం వల్ల వారి విద్యపై నేరుగా ప్రభావం చూపి, అధిక డ్రాపవుట్లకు, విద్యలో రాణించలేకపోవడానికి దారితీస్తుంది. పిల్లలు తరచూ అనారోగ్యానికి గురవడం వల్ల తల్లిదండ్రులు తమ విధులకు హాజరుకాలే రు. ఇది తల్లిదండ్రులపై ఆర్థిక ప్రభావం కూడా చూపుతుంది. పిల్లల ఆరోగ్యంపై వ్యయం కారణంగా తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితులపై కూడా ప్రతికూల ప్రభావం పడుతుంది.

**టిఆర్ఎస్ ఎన్నికల మేనిఫెస్టోలో వైద్యం-ఆరోగ్యం**

ప్రజారోగ్యాన్ని పరిరక్షించడం ప్రతి ప్రభుత్వం కనీస బాధ్యత. ఈ బాధ్యతను పూర్తిగా ప్రైవేటురంగం చేతుల్లో పెట్టి ప్రభుత్వం చేతులు దులిపేసుకుంది. తెలంగాణలో ఒకనాటి గొప్ప ఆసుపత్రులైన ఉస్మానియా, గాంధీ నిమ్స్ తదితర దవాఖానాలు నిర్లక్ష్యంపాలై నిర్వీర్యమవుతున్నాయి. వైద్య సహాయం కోసం దూర ప్రాంతాల నుంచి ప్రజలు హైదరాబాద్ వరకు ప్రయాణించాల్సి వస్తున్నది. వైద్య సహాయం అందకుండానే మార్గమధ్యంలోనే చాలామంది మరణిస్తున్నా రు. తెలంగాణలో ఆసుపత్రులు ప్రజలకు అందుబాటులోకి తేవడం ద్వారా ప్రజారోగ్యాన్ని పరిరక్షిస్తామని, ప్రభుత్వ వైద్యశాలలను మెరుగుపరుస్తామని, టి.ఆర్.ఎస్. ప్రకటించింది. అన్ని ప్రస్తుతమున్న వైద్య విధానం అంత సంతృప్తిగా లేనప్పటికీ కొత్త పద్ధతులు అమలులోకి వచ్చేదాకా అవి అమలు చేయబడుతాయి. సరికొత్త విధానాన్ని తీసుకురావడానికి టి.ఆర్.ఎస్. ప్రణాళికలు తయారు చేసిందన్నా రు.

తెలంగాణ ఏర్పడే నాటికి పది జిల్లాలున్నాయి. తరువాత 21 జిల్లాలు కొత్తగా ఏర్పాటు చేశారు. అన్ని జిల్లా కేంద్రాల్లో 'నిమ్స్' స్థాయిలో సూపర్ స్పెషాలిటి దవాఖానాలు ఏర్పాటు చేస్తామన్నారు. వీటివల్ల సగటున ప్రతీ 60 కిలోమీటర్లకు ఒక సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ అందుబాటులోకి వస్తుంది. అన్ని మండల కేంద్రాల్లో నలుగురు ఎంబిబిఎస్ డాక్టర్లతో 30 పడకల ఆసుపత్రులు 24 గంటలపాటు సేవలందించేలా ఏర్పాటు చేస్తామన్నారు. పాముకాటు, కుక్కకాటు, తేలు కాటుకు మందులు అందుబాటులో ఉంచడంతో పాటు ప్రసూతి తదితర ఆపరేషన్లు నిర్వహించడానికి వీలుగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు తీర్చిదిద్దుతామన్నా రు. ప్రతి అసెంబ్లీ నియోజకవర్గంలో ఒక వంద పడకల ఏరియా ఆసుపత్రి ఏర్పాటు చేస్తామన్నారు.

వైద్య విద్యలో నూతన వైద్య కళాశాలలు ప్రారంభించే చొరవను టి.ఆర్.ఎస్. ప్రభుత్వం తీసుకుంటుందన్నా రు. తెలంగాణ ప్రభుత్వం కేంద్రంపై ఒత్తిడి తెచ్చి ఎయిమ్స్ తరహా వైద్య కళాశాలను తెలంగాణలో ఏర్పాటు చేయడానికి కృషి చేస్తుందన్నా రు. ఎంబిబిఎస్‌కు సమాంతరంగా ప్యారా మెడికల్ కోర్సును ప్రవేశపెడుతుందన్నా రు. కోర్సును పూర్తి చేసిన వారి సేవలు గ్రామీణ ప్రాంతాల్లో వినియోగించుకుంటుందన్నా రు. ఆర్.ఎం.పి, పి.ఎం.పి డాక్టర్లు ఈ కోర్సును చదివి సర్టిఫికెట్ పొందడానికి అవకాశం కల్పిస్తుందన్నా రు. 108, 104 తదితర పథకాలను మరింత పటిష్టంగా అమలు చేయడం ద్వారా వైద్య సేవలను మెరుగుపర్చడానికి చర్యలు తీసుకోబడుతాయన్నా రు.

మెడికల్ ఆఫీసర్ల ఖాళీలను ఎప్పటికప్పుడు భర్తీ చేస్తూ అన్ని జిల్లా ఆసుపత్రులలో ఫోరెన్సిక్ మెడిసిన్ స్పెషలిస్టులను నియమించడం జరుగుతుందన్నా రు. ఆయుర్వేద, యునాని లాంటి సంప్రదాయ వైద్య పథకాలు ప్రోత్సహించే పథకాలు అమలు చేస్తామన్నా రు. వ్యాధిని నయం చేసే వైద్య పద్ధతులే కాకుండా వ్యాధి కారకమైన ఇతర పరిస్థితులపై తగిన అవగాహన కల్పించి వ్యాధులు రాకుండా ప్రజల్లో అవగాహన పెంచుతుందన్నా రు. డాక్టర్స్ జెఏసి సహకారంతో గ్రామీణ ప్రాంతాల్లో వైద్యులు విధులు నిర్వర్తించేటట్లు ప్రేరణ కల్పిస్తుంది. తెలంగాణ పునర్ నిర్మాణంలో డాక్టర్లను భాగస్వాములను చేస్తామన్నారు.

**ఆచరణలో అటకెక్కిన వైద్యం-ఆరోగ్యం**

టి.ఆర్.ఎస్. మేనిఫెస్టోలో ఆరోగ్యం-వైద్యం గురించి చాలా బాగా చెప్పింది. ఉద్యమకాలంలో ప్రభుత్వ వైద్యాన్ని గత ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేసి నిర్వీర్యం చేశాయని తాను అధికారంలోకి వస్తే ప్రాథమిక స్థాయి నుండి జిల్లా స్థాయి వరకు అన్ని వైద్య సౌకర్యాలు కల్పించి ప్రజలకు సూపర్ స్పెషాలిటీ వైద్యాన్ని జిల్లా స్థాయిలోనే అందిస్తామని బీరాలు పలికారు. ఆచరణలో గత ప్రభుత్వాలు అమలు చేసిన విధానాలనే కొనసాగిస్తూ ఉన్నా రు. ప్రాథమిక స్థాయిలో 30 పడకల ఆసుపత్రులను నిర్మించి ప్రసూతి, తదితర ఆపరేషన్లు నిర్వహిస్తామని అన్ని రకాల చికిత్సలు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో జరిగే విధంగా ఏర్పాట్లు చేస్తామన్నారు. ప్రస్తుతం 30 వేల జనాభాకు ఒక పిహెచ్‌సి ఉంది, పిహెచ్‌సిలలో ఒకరు లేక ఇద్దరు డాక్టర్లు ఉండాలి కాని పిహెచ్‌సిలలో డాక్టర్లే లేరు.

తెలంగాణ ఏర్పటైనప్పటి నుంచి వైద్యుల పోస్టులను భర్తీ చేయకపోవడంతో అన్ని ఆస్పత్రుల్లోనూ ఖాళీలు పెరుగుతున్నాయి. బోధన ఆస్పత్రుల్లో పరిస్థితి మరీ దయనీయంగా మారుతోంది. రాష్ట్రంలోని ఏడు ప్రభుత్వ బోధన ఆస్పత్రుల్లో 2.500 మంది వైద్యులు ఉండాలి. వరుస రిటైర్మెంట్లు, కొత్త వైద్యుల భర్తీ లేకపోవడంతో ప్రస్తుతం 1,800 మంది మాత్రమే ఉన్నా రు. మరోవైపు జిల్లా, ఏరియా, ప్రాథమిక ఆరోగ్య కేంద్ర ఆస్పత్రుల్లో 43 శాతం సిబ్బంది కొరత ఉంది. తెలంగాణలో గత 4 సంవత్సరాలుగా దాదాపు 300 మంది వైద్యులు రిటైర్ అయ్యా రు. ఆ పోస్టులను కూడా భర్తీ చేయలేదు. ప్రస్తుతం జనరల్ ఆస్పత్రుల్లో 2,458 మంది వైద్యులున్నారు, స్పెషలిస్ట్ వైద్యులు 1,263 మంది ఉన్నా రు. బోధన ఆస్పత్రుల్లో 1,800 మంది వైద్యులున్నారు.

జిల్లా స్థాయి ఆసుపత్రులలో జనాభా ప్రాతిపదికన డాక్టర్లు, సిస్టర్లు, సిబ్బందిని నియమించి ఆధునాతన ల్యాబ్ సౌకర్యాలు ఇప్పటికీ ఏర్పాటు చేయలేదు. నాణ్యత ప్రమాణాలను, వసతులను పెంచాల్సి ఉంది. జిల్లా స్థాయి ఆసుపత్రి 500ల పడకల సామర్థ్యం కలిగి వుండి అనుబంధంగా నియోజకవర్గ స్థాయిలో ఏర్పాటు చేయబోయే 100 పడకల ఆసుపత్రిని ఏర్పాటు చేయాల్సి ఉంది. కొత్త ఆసుపత్రుల నిర్మాణం జరిగి పాత పద్ధతులలోనే డాక్టర్లు ఇతర సిబ్బంది నియామకాలు ఉంటే వీటిని నిర్మించిన ఫలితం ఉండదు. అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం లేదా తక్షణ కర్తవ్యంగా బోర్ కమిటీ నివేదికనైనా అమలు పరిచే ఆలోచన చేస్తేనే ప్రజలకు మేలు జరుగుతుంది.

**రాష్ట్రంలో ఆస్పత్రులు, పడకలు**

| | **ఆస్పత్రులు** | **పడకలు** |
|---|---|---|
| బోధన ఆస్పత్రులు | 20 | 8,465 |
| జిల్లా ఆస్పత్రులు | 7 | 1,500 |
| ఏరియా ఆస్పత్రులు | 32 | 3,200 |
| కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు | 119 | 3,950 |
| మాతా-శిశు ఆస్పత్రులు | 5 | 250 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 683 | 4,098 |
| సబ్ సెంటర్లు | 4,797 | --- |
| **మొత్తం ప్రభుత్వ ఆస్పత్రులు** | **5,662** | **21,463** |

**తెలంగాణ ప్రభుత్వ విధానాలు గత ప్రభుత్వ విధానాలే**

ఉమ్మడి రాష్ట్రంలో గత ప్రభుత్వాలు ప్రైవేటు, కార్పొరేట్ ఆసుపత్రులను ప్రోత్సహించడంలో భాగంగా పెద్దఎత్తున రాయితీలు, బ్యాంకు రుణాలు కల్పించాయి. కేంద్ర, రాష్ట్ర ఉద్యోగులకు వైద్య ఖర్చుల రియింబర్స్‌మెంట్, ఆరోగ్య భీమా, ముఖ్యమంత్రి సహాయనిధి పేరుతో ప్రైవేటు-కార్పొరేట్ ఆసుపత్రులకు లాభాలు చేకూర్చే బాధ్యతను తీసుకున్నాయి. దాని ఫలితంగానే ప్రభుత్వ వైద్య వ్యవస్థ నిర్వీర్యం అయింది. ప్రైవేటు రంగం వేళ్లూనుకొనే ఆలోచనలో భాగంగా అప్పటి ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి ఎంచుకున్న మరో మార్గం ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యం పేరుతో ప్రవేశపెట్టిన సామాజిక భీమా పథకాన్ని (ఆరోగ్య శ్రీ) తెలంగాణ ప్రభుత్వం కూడా గత పాలకుల పద్ధతినే కొనసాగిస్తూ ప్రయివేటు వైద్య రంగం మరింత బలపడేలా వ్యవహరిస్తుంది.

వ్యాధులు రాకుండా ఎలాంటి నివారణ చర్యలు ఈ నాలుగేళ్ల కాలంలో తీసుకోకపోవడం వల్ల మలేరియా, అతిసారా, డెంగ్యు ఇతర వైరస్‌కు సంబంధించిన జ్వరాలతో ప్రజలు ప్రైవేటు, కార్పొరేట్ ఆసుపత్రులను ఆశ్రయించి లక్షలాది రూపాయలు ఖర్చు చేసి అప్పుల పాలయ్యా రు. కార్పొరేట్ వైద్యానికి వెళ్లలేని ఆదివాసీ గిరిజనులు మలేరియా వ్యాధితో చనిపోయిన సంఘటనలు ఉన్నాయి. సూపర్ స్పెషాలిటి వైద్యం కొద్ది మందికే పరిమితంగా అందుబాటులో ఉండడం, అత్యధిక ప్రజలకు సూపర్ స్పెషాలిటి వైద్యం అందుబాటులో లేకపోవడం వల్ల ప్రజలు గుండె, మెదడు, మూత్ర పిండాలు, కాలేయం జబ్బులకు క్యాన్సర్, మొదలగు వ్యాధులకు ప్రైవేటు రంగంలో లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టుకోవాల్సిన దుస్థితి ఉంది. టి.ఆర్.ఎస్. పాలన గత పాలకుల వైద్యవిధానమే కొనసాగుతుంది. తన ఎన్నికల ప్రణాళికలో ఇచ్చిన హామీకి భిన్నంగా ప్రైవేటు రంగ వైద్య విధానాన్ని ప్రోత్సహిస్తుంది. తెలంగాణలో ప్రభుత్వ రంగంలో వైద్య పురోగతి శూన్యం అనే చెప్పాలి.

ప్రతి జిల్లాకు నిమ్స్ తరహా ఆసుపత్రిని నిర్మిస్తామని, ప్రజలందరికి కార్పొరేట్ వైద్యాన్ని అందిస్తామని అదే విధంగా గిరిజన ప్రాంతాలలో విష జ్వరాలతో జరుగుతున్న మరణాలు ఆపడానికి అన్ని రకాల వైద్య సేవలతో పాటు అత్యవసర సమయాల్లో హెలికాప్టర్ సదుపాయాన్ని సమకూర్చుతామని చెప్పిన మాటలు ఆచరణలో గాలిలోనే తేలియాడుతున్నాయి. ఇప్పటికి ఆపరేషన్లు జరిగిన పేషెంట్లు సరియైన పడకలు లేక నేలమీదనే పడుకుంటున్న దుస్థితిని మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. ప్రజారాజ్యాన్ని పరిరక్షించడం ప్రతి ప్రభుత్వం బాధ్యత. ఈ బాధ్యతను పూర్తిగా ప్రైవేటు రంగం చేతుల్లో పెట్టి చేతులు దులుపుకోవడం ఒక విషాదం. పిడికెడు మంది కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల కొరకు కోట్ల మంది ప్రజలను బలి చేయడం అప్రజాస్వామికం.

**ఆరోగ్యానికి ఖర్చు చేయని బడ్జెట్ కేటాయింపులు**

వైద్య ఆరోగ్య శాఖను బలోపేతం చేస్తున్నామని, పెద్దఎత్తున నిధులు కేటాయిస్తున్నామని ప్రభుత్వం చెబుతున్నా.. అందుకు తగ్గట్టుగా నిధులు విడుదల కాలేదు. ఖర్చు జరగడం లేదు. 2016-17 ఆర్థిక సంవత్సరానికి సర్కారు కేటాయించిన బడ్జెట్, రుణాలు కలిపి మొత్తం రు. 8,084 కోట్లు కాగా ఖర్చు చేసింది. రు. 4,872 కోట్లేనని కాగ్ వెల్లడించింది. మరికొన్నింటికి భారీగా నిధులు కేటాయించిన ఒక్క పైసా విడుదల చేయని పరిస్థితి కూడా ఉందని కాగ్ నివేదికలో వివరించింది. ఉదాహరణకు బీబీనగర్‌లో నిర్మించతలపెట్టిన నిమ్స్‌కు రు. 40 కోట్లు కేటాయించినా.. ఒక్క పైసా విడుదల చేయలేదు. తెలంగాణ వైద్య విధాన పరిషత్‌కు రు. 37 కోట్లు కేటాయించినా నిధులేమీ విడుదల చేయలేదు. హైదరాబాద్‌లోని ఎంఎన్‌జె కేన్సర్ ఆస్పత్రికి రు. 23.04 కోట్లు కేటాయించి రు.75 లక్షలు విడుదల చేశారని కాగ్ నివేదికలో వెల్లడైంది.

**ఆరోగ్య రంగానికి బడ్జెట్ కేటాయింపులు (రు. కోట్లలో)**

| సంవత్సరం | ప్రగతిపద్దు | నిర్వహణపద్దు | మొత్తం |
|---|---|---|---|
| 2014-15 | 2,282 | 1,780 | 4,062 |
| 2015-16 | 2,459 | 2,473 | 4,932 |
| 2016-17 | 2,463 | 3,504 | 5,967 |
| 2017-18 | 2,666 | 3,310 | 5,976 |
| 2018-19 | 3,522 | 3,852 | 7,375 |

జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ (ఎన్ఆర్‌హెచ్‌ఎం) కింద రాష్ట్రంలో అమలు అవుతున్న సంతాన సాఫల్యత, శిశు సంరక్షణ కార్యక్రమం సంతృప్తికరంగా లేదు. రాష్ట్రంలో ఆరోగ్య సేవలు.. భారత ప్రజారోగ్య ప్రమాణాలను (ఐపిహెచ్ఎస్) అందుకోలేకపోతుంది. కేంద్ర నిధులను ఖర్చు చేయడంలోను రాష్ట్రం విఫలమౌతుంది. ఆరోగ్య కేంద్రాలలో మౌలిక వసతులు లేవు. సిబ్బంది నియామకాలపై దృష్టి పెట్టలేదు. తల్లి బిడ్డల సంరక్షణ అంశాలను అమలు చేయడం లేదు. బాలింతలు, శిశువులు ప్రాణపాయ పరిస్థితులు ఎదుర్కొంటున్నారు. కేంద్ర నిధులను ఖర్చు చేసిన తీరును క్రింది పట్టికలో చూడండి.

**ఎన్ఆర్‌హెచ్‌ఎం నిధుల ఖర్చు తీరు (రు. కోట్లలో)**

| సంవత్సరం | కేంద్ర నిధులు | మిగిలిన నిధులు | శాతం |
|---|---|---|---|
| 2013-14 | 1.623.44 | 1.006.55 | 62 |
| 2014-15 | 776.17 | 460.37 | 59 |
| 2015-16 | 673.13 | 308.16 | 54 |
| 2016-17 | 1.221.86 | 748.85 | 61 |

పేదలకు అత్యవసర మందులను ఉచితంగా పంపిణీ చేయాల్సిన వైద్యశాఖ నిర్లక్ష్యంగా వ్యవహరించింది. ఉచిత అత్యవసర మందుల కోసం 2014-17 మధ్య రు. 83.99 కోట్లు కేటాయిస్తే రు. 10.11 కోట్లే ఖర్చు చేసింది. ఏ ఏడాది నిధులను పూర్తిస్థాయిలో ఖర్చు చేయలేదు. నిధుల వినియోగం 2012-14 వరకు కేవలం 38 నుంచి 44 శాతం కాగా, 2014-17 వరకు 39 నుంచి 46 శాతం ఉంది. ప్రసూతి వైద్యం నిధుల వినియోగంలో 2014-17 మధ్య 50 శాతం మించి ఖర్చు చేయలేదు. శిశువుల ఆరోగ్య పరిరక్షణకు 26 శాతం మించి ఖర్చు చేయలేదు. వైద్యసేవల నాణ్యత మెరుగుదలకు కేటాయించిన మొత్తాలను ఖర్చు చేయలేదు.

**అత్యవసర మందులపై చేసిన వ్యయం (రు. కోట్లలో)**

| సం. | కేటాయింపులు | మిగిలినవి | మొత్తం శాతం |
|---|---|---|---|
| 2014-15 | 40.00 | 40.00 | 100 |
| 2015-16 | 23.89 | 1.07 | 96 |
| 2016-17 | 20.00 | 9.04 | 55 |

ప్రభుత్వ ఆసుపత్రుల్లో ప్రసవాలు తగ్గాయి. 2013-14లో 69 శాతం ఉంటే 2016-17లో 42 శాతానికి తగ్గిపోయాయి. ఇదే సమయంలో ప్రైవేటు ఆస్పత్రుల్లో కాన్పులు 31 శాతం నుంచి 58 శాతానికి పెరిగాయి. తెలంగాణలోనే శస్త్ర చికిత్స ద్వారా కాన్పులు చాలా ఎక్కువగా జరుగుతున్నాయి. మొత్తం ప్రసవాల్లో 45 శాతం శస్త్ర చికిత్స ద్వారానే జరుగుతున్నాయి. ప్రైవేటు ఆస్పత్రుల్లో ఇది 67 శాతం వరకు ఉంది. ప్రసూతి మరణాల రేట్లు, ఫెర్టిలిటీ రేటు తగిన స్థాయిలోనే ఉన్నాయి. అయితే ఆదిలాబాద్ జిల్లాలో (ప్రతి లక్ష మందికి 152), ఖమ్మం (99), మహబూబ్‌నగర్ (98) జిల్లాల్లో ప్రసూతి మరణాల నిష్పత్తి ఎక్కువగా ఉంది. ఇక రాష్ట్ర సగటు 92గా ఉంది.

2015-17లో శిశు మరణాల రేటు (వెయ్యి జననాలకు) 28 ఉంది. ఎన్ఆర్ఎచ్ఎం నిర్దేశించిన నిష్పత్తి (25) కంటే ఇది ఎక్కువ కావడం ఆందోళన కలిగిస్తోంది.

**ప్రభుత్వ, ప్రైవేట్ ఆసుపత్రుల్లో ప్రసవాలు**

| సం | మొత్తం ప్రసవాలు | ప్రభుత్వ ఆస్పత్రుల్లో | ప్రైవేట్ ఆస్పత్రుల్లో |
|---|---|---|---|
| 2013-14 | 3.85,435 | 2,65,119 | 1,20,322 |
| 2014-15 | 3.84,287 | 2,40,548 | 1,43,739 |
| 2015-16 | 3.75,957 | 1,93,412 | 1,82,545 |
| 2016-17 | 5,07,896 | 2,11,384 | 2,96,512 |

**మాతా శిశు సంక్షేమం-కెసిఆర్ కిట్**

ప్రభుత్వ ఆసుపత్రులలో పరీక్షలు చేయించుకునే గర్భిణీ స్త్రీలకు కాన్పుకు ముందు రు. 4,000, కాన్పు తరువాత రు. 4,000 పుట్టిన బిడ్డకు వ్యాధి నిరోధక టీకాలు ఇవ్వడం పూర్తి అయ్యే సమయానికి రు. 4,000, మొత్తం రు. 12,000లతో పాటు కెసిఆర్ కిట్ పేరుతో మూడు నెలలకు సరిపడ 15 రకాల వస్తువులను రాష్ట్ర ప్రభుత్వం అందజేస్తున్నది. ఆడపిల్ల పుడితే అదనంగా మరో రు. 1000 ఇస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఈ పథకం 2017 జూన్ 2 నుంచి అమలులోకి వచ్చింది. ఈ పథకం అమలు తరువాత ప్రభుత్వ ఆసుపత్రుల్లో ప్రసవాల సంఖ్య పెరిగింది. ఫిబ్రవరి 28 నాటికి 1,78,048 కిట్ల పంపిణీ జరిగింది. ఈ పథకం ద్వారా ప్రభుత్వ ఆసుపత్రులలో కాన్పుల సంఖ్య 100 శాతానికి పెంచాలనే ఆలోచనలో భాగంగా ఈ విధానాన్ని తీసుకువచ్చినట్లు ప్రభుత్వం చెబుతుంది.

ప్రభుత్వ ఆసుపత్రుల్లో సరైన వసతులు కల్పించి అవసరమైనంత మంది డాక్టర్లను నియమించి కావాల్సిన మందులు అందిస్తే ప్రజలకు పారితోషకాలు ఇచ్చి ప్రభుత్వ ఆసుపత్రులకు రప్పించవలసిన అవసరం లేదు. అన్ని రకాల మెరుగైన సౌకర్యాలు కల్పిస్తే వద్దన్నా కూడా ఆసక్తితో ప్రభుత్వ ఆసుపత్రులలోనే చికిత్స చేయించుకోవడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. ప్రజలు తమ ఆరోగ్యాన్ని, ప్రాణాన్ని ప్రథమ ప్రాధాన్యతగా, పారితోషకాన్ని రెండవ ప్రాధాన్యతగా చూస్తారనడంలో సందేహం లేదు. ప్రభుత్వ ఆసుపత్రులలో మెరుగైన సౌకర్యాలు కల్పించకుండా సరిపడ డాక్టర్లు, సిబ్బంది నియామకాలు చేపట్టకుండా ఎన్ని డబ్బులు, కిట్స్ ఇచ్చిన ప్రజలు ప్రభుత్వ ఆసుపత్రులను విశ్వసించరు.

తల్లిబిడ్డల సంరక్షణతోపాటు స్త్రీలు, పిల్లలకు సంబంధించిన అన్ని రకాల వ్యాధులకు చికిత్స, ఆపరేషన్లు జరిగే విధంగా ఏర్పాటు చేయాలి. స్త్రీ వైద్య నిపుణులు, మత్తు డాక్టర్లు, పిల్లల డాక్టర్లు, సిస్టర్లు, ఇతర సిబ్బందిని అవసరమైన మేరకు జనాభాకు సరిపడ నిష్పత్తిలో నియమించాలి. నియామకాల్లో కాంట్రాక్టు అవుట్ సోర్సింగ్ విధానాలు ఉండకుండా ఉంటేనే సిబ్బంది బాధ్యతగా పనిచేసి వృత్తికి న్యాయం చేయగలరు. అపుడే పారితోషికం, కిట్స్‌తో సంబంధం లేకుండా 100 శాతం కాన్పులు ప్రభుత్వ ఆసుపత్రులలోనే జరుగుతాయి. తల్లితో పాటు పుట్టిన పిల్లలు ఆరోగ్యంగా ఉంటారు. ప్రజలు వైద్యం కొరకు ప్రైవేటు ఆసుపత్రులకు పోవలసిన అవసరం లేకుండా తల్లీ బిడ్డల ఆరోగ్యాన్ని సంరక్షించవచ్చు. ఎన్నికల దృష్టితో ఇటువంటి ఆకర్షణీయ పథకాలను అమలు చేయాలని భావిస్తే ఈ పథకం విఫలంకాక తప్పదు. ప్రజలకు శాశ్వత ప్రతిపాదికన మెరుగైన వైద్యాన్ని అందించే విధానాలు రూపొందించడం సముచితంగా ఉంటుంది. అలాకాకుంటే కెసిఆర్ కిట్ ఎన్నికల కిట్‌గానే మిగిలిపోతుంది.

రాష్ట్రంలో జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం కింద చేపట్టిన కార్యక్రమాలు సరిగా అమలు కావడంలేదు. ఉచిత మందుల పంపిణీకి 2014-17 నడుమ కేటాయించిన రు. 83.99 కోట్లలో కేవలం రు. 10 కోట్లే ఖర్చు చేశారు. సర్కారు దవాఖానల్లో కాన్పులు 2013-14లో 69 నుంచి 2016-17 నాటికి 42 శాతానికి తగ్గిపోయాయి. సిజేరియన్ కాన్పులు ప్రైవేటులో 31 నుంచి 58 శాతానికి పెరిగాయి. మొత్తం కాన్పుల్లో 45 శాతం సిజేరియన్ అయితే అందులో 67 శాతం ప్రైవేట్ ఆస్పత్రుల్లోనే జరిగాయి.

2012-2017 మధ్య నిర్మించిన 21 పిహెచ్‌సిల్లో సిబ్బంది లేక 19 వాడుకలోకి రాలేదు. మొత్తం పిహెచ్‌సిల్లో 43 శాతం సిబ్బంది కొరత ఉంది. నాణ్యమైన వైద్యం లేక ప్రజలు ప్రైవేటు ఆస్పత్రులను ఆశ్రయిస్తున్నారు.

టి.ఆర్.ఎస్. మేనిఫెస్టోలో పేర్కొన్నట్లు అయితే కె.సి.ఆర్ ప్రభుత్వం తన ఎన్నికల వాగ్దానాన్ని నిలబెట్టుకునే సూచనలు కనిపించడం లేదు. ప్రభుత్వ వ్యవస్థలోనే నాణ్యమైన వైద్యాన్ని ప్రజలకు అందించి ప్రజారోగ్యాన్ని పరిరక్షించే వైద్య విధానాలను రూపొందించి అమలు చేయడంలో పూర్తిగా విఫలమైంది. 'సార్వత్రిక ఆరోగ్య రక్షణ'ని అమలు చేసి ప్రజలందరికీ ఉన్నత స్థాయి ఆరోగ్యాన్ని అందించడానికి ఆరోగ్యశ్రీ భీమాను అమలు చేస్తున్నానని ప్రజలకు వాగ్దానం చేసిన కె.సి.ఆర్ ప్రభుత్వం బడ్జెట్‌లో దానికి సరిపడ నిధులు కేటాయించకపోగా, కేటాయించిన నిధులను విడుదల చేయకపోవడం, డాక్టర్లు ఇతర సిబ్బంది కొరతతో ప్రభుత్వ ఆసుపత్రులు ప్రసవ వేదనను అనుభవిస్తున్నాయి. ప్రజలు అనివార్యంగా ప్రైవేటు ఆసుపత్రులను ఆశ్రయిస్తున్నారు. అప్పులపాలై పేదరికం వైపు నెట్టి వేయబడుతున్నారు.

వైద్య కళాశాలల్లోని కమ్యూనిటి వైద్య విభాగాలను వ్యాధుల నివారణ పరిశోధనా కేంద్రాలుగా అభివృద్ధి చేయాలి. వీరు ఇచ్చే మార్గదర్శకాలతో రాష్ట్ర, జిల్లాల స్థాయిలో వ్యాధుల నివారణ కోసం ప్రత్యేకమైన పాలనా కార్యాలయాలుండాలి. వీటికి అధిపతులుగా ఎంబిబిఎస్, ఎండి (కమ్యూనిటీ మెడిసిన్) చేసిన వైద్యులకు పాలనాపరమైన శిక్షణ ఇప్పించి ఈ స్థానాల్లో నియమించాలి. తగిన నిధులు, మౌలిక సదుపాయాలు, సిబ్బంది, వ్యాధి నివారణ, వ్యాధి నిరోధక సామాగ్రి, మందులు ఉండాలి. ప్రభుత్వం పట్టించుకునే స్థితిలో లేదు. ప్రభుత్వానికి ప్రాథమిక ఆరోగ్య వసతుల కల్పనకు సంబంధించి ఒక దృక్పథం, సంకల్పంలేదని, అందువల్ల హేతుబద్ధమైన ఆచరణ మార్గం తెలియడం లేదని అనుకోవలసి వస్తుంది.

తెలంగాణ రాష్ట్రంలో 60 శాతం గ్రామీణ జనాభా, 40 శాతం పట్టణ జనాభా ఉంది. గ్రామీణ ప్రజలు చాలా వరకు పేదలు, నిరాక్షరాస్యులు వారికి ప్రభుత్వ ఆసుపత్రుల్లో వైద్యం కావాలంటే 50-100 కి.మీ ప్రయాణించి జిల్లా కేంద్రంలోని పెద్దసుపత్రికి రావాలి. లేదా సొంత ఖర్చులతో దగ్గర్లోని ప్రైవేట్ వైద్యుల్ని ఆశ్రయించాలి.

ఆ ప్రైవేట్ వైద్యం సైతం పేద, మారుమూల ప్రాంతాలు ప్రత్యేకించి గిరిజన ప్రాంతాల్లో మచ్చుకు కూడా కనిపించక వైద్య సేవల అందుబాటు సమస్య మరింత తీవ్రంగా ఉంది. ఈ పరిస్థితులలో గ్రామీణ ప్రాంతాల్లో ప్రాణనష్టం కూడా విపరీతంగా జరుగుతున్నది.

పట్టణ ప్రాంతం కంటే మరణాల రేటు గ్రామీణ ప్రాంతాల్లో ఎక్కువగా ఉంటున్నది. కాబట్టి గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో అవసరాల ప్రాతిపదికగా వైద్యులను, ఆసుపత్రులను తక్షణం ఏర్పాటు చేయాల్సి ఉంది.

*(రచయిత రాజనీతిశాస్త్ర విద్యార్థి, ఉపాధ్యాయ నాయకులు)* వీ

# తెలంగాణలో పాఠశాల విద్య

***ఉద్యమంలో, ప్రభుత్వ ఏర్పాటు సందర్భంలో కెజి నుంచి పిజి వరకు ఉచిత విద్య అని వాగ్దానం చేసిన కెసిఆర్ అధికారం చేపట్టాక ఆ వాగ్దానాన్ని విస్మరించడమే కాకుండా ప్రాథమిక విద్యను పూర్తిగా ప్రైవేటీకరించే దిశలో సాగుతున్నాడని అంటున్నారు* బి. రామకృష్ణ**

తెలంగాణ ప్రజలు ఉద్యమ సందర్భంలో వ్యక్తం చేసిన ఆకాంక్షలకు అక్షరరూపమే తమ ఎన్నికల ప్రణాళిక అని, ఇది ప్రజలను భ్రమల్లో పెట్టేందుకు చేసే శుష్క వాగ్దానం కాదని కెసిఆర్ ప్రకటించాడు. తెలంగాణ రాష్ట్ర సమితి కెజి నుండి పిజి వరకు ఉచిత నిర్బంధ విద్యను వాగ్దానం చేసింది. ప్రతి ఒక్కరికీ చదువుకునే అవకాశం కల్పించడం ప్రభుత్వాల ప్రధాన బాధ్యత అని జయశంకర్ గారి అభిప్రాయమని, ఆ విధంగా తెలంగాణలో విద్యా రంగాన్ని నిర్మించుకోవాల్సిన బాధ్యత అందిరి మీద ఉందని తెలిపారు. సమైక్య రాష్ట్రంలో తెలంగాణలో తగినన్ని పాఠశాలలు, కళాశాలలు స్థాపించబడలేదని, తెలంగాణలో విద్యా వికాసానికి విఘాతం ఏర్పడిందని చెప్పారు. అయితే అదే టిఆర్ఎస్ ప్రభుత్వం పిల్లలు తక్కువగా ఉన్నారనే కారణంతో దాదాపు 10 వేల పాఠశాలలను 2016లో విలీనం పేరుతో మూసివేసే ప్రయత్నం చేసింది.

కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యమాత్రమే కాదు, ఉచిత నిర్బంధ విద్య అని అది కెసిఆర్ కల అని చెప్పారు. ఒక మంచిపని టిఆర్ఎస్ అధికారంలోకి వచ్చిన నాలుగేళ్లుగా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా మిగిలిపోవడం విషాదమే కాదు వంచన కూడా.

విద్యార్థుల ఉద్యమాల ఫలితంగా తెలంగాణ రాష్ట్రం ఏర్పడిందని, తెలంగాణలో ప్రస్తుతం ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్యంతో నడుస్తున్నదని, ప్రభుత్వ పాఠశాలల్లో నిరుపేద పిల్లలు మాత్రమే చదువుతున్నారని, ప్రస్తుతం ఉన్న పాఠశాలలు పరిమిత వనరులతో కునారిల్లుతున్నాయని తెలిపారు. వనరులను పెంచాలన్నప్పుడు విద్యకు ఎక్కువ బడ్జెట్ కేటాయించాల్సి ఉంటుంది. కాని గత నాలుగేళ్లుగా బడ్జెట్ కేటాయింపులు గతంలో కంటే తక్కువగా ఉంటున్నాయి.

సమగ్ర వికాసాన్ని అందించేందుకు గురుకుల విద్యాలయాలను ఏర్పాటు చేస్తుందని, ఈ పాఠశాలల్లో కుల, మత భేదాలకు అతీతంగా అందరు ఒకేచోట జీవించే విధంగా రూపకల్పన జరుగుతుందని ప్రకటించారు. అయితే దీనికి విరుద్ధంగా 104 ఎస్.సి., 53 ఎస్.టి., 142 బి.సి., 192 మైనారిటీ గురుకుల పాఠశాలలను ఏర్పాటు చేశారు.

15 ఎకరాల విశాల ప్రాంగణంలో గురుకుల పాఠశాలలు ఏర్పడతాయని, వీటి ద్వారా 40 లక్షల మంది విద్యార్థులకు ఉచిత నిర్బంధ విద్య అందించాలని టిఆర్ఎస్ సంకల్పించిందని తెలిపారు. కొత్తగా ఏర్పాటైన రెసిడెన్సియల్ పాఠశాలలు చాలా వరకు అద్దె గదుల్లో అరకొర వసతులతో నడుస్తున్నాయి. వాటిలో ఇద్దరు ముగ్గురు బోధనా సిబ్బందిని నియమించారు. మిగతా వారిని కాంట్రాక్టు పద్ధతిలో పనిచేయిస్తున్నారు. కొత్తగా ఏర్పాటైన వాటితో పాటుగా అంతకు ముందు నుండే ఉన్న అన్ని రకాల రెసిడెన్సియల్ పాఠశాలల్లోని మొత్తం విద్యార్థుల సంఖ్య 3.25 లక్షలకు మించదు. తెలంగాణలో 2016-17 విద్యా సంవత్సరంలో నమోదైన మొత్తం విద్యార్థుల్లో (58,66,786) వీరు 5.54 శాతం మాత్రమే. వారు చెప్పిన 40 లక్షల మందిలో 3.25 లక్షలు ఏపాటిది. కనీసం ఇవైనా గుణాత్మకంగా నడుపబడితే సంతోషించ వల్సిందే. ఏమీలేని దగ్గర ఈ మాత్రమైనా మెరుగే కదా అని అనుకునే దైన్య పరిస్థితిలో ఉన్నందుకు విచారించాలో, సిగ్గుపడాలో ఎవరికి వారు తేల్చుకోవచ్చు.

ప్రతి మండలంలో విద్యార్థుల జనాభా ఆధారంగా 5 నుండి 6 గ్రామాలకు ఒకటి చొప్పున గురుకుల పాఠశాల ఉంటుంది. వీటిలో 600 నుండి 1000 వరకు విద్యార్థులుంటారని, ప్రతి గదిలో నలుగురు విద్యార్థులు మాత్రామే ఉంటారని, అటాచ్డ్ బాత్రూంతో పాటు అన్ని సౌకర్యాలు గదిలో ఉంటాయని, చక్కటి లైబ్రరీతో పాటు ఈ - లైబ్రరీ, ఇంటర్నెట్ సౌకర్యం ఉంటుందని, వ్యాయామం కొరకు ప్లే గ్రౌండ్, రన్నింగ్ ట్రాక్స్, ఈత కొలనులు ఏర్పాటు చేయడం జరుగుతుందని మరెన్నో విషయాలతో పాఠశాల విద్య గురించి ఎంతో గంభీరంగా టిఆర్ఎస్ ఎన్నికల ప్రణాళికలో చెప్పారు.

వాళ్లు చెప్పినటువంటి 40 లక్షల మంది విద్యార్థులకు రెసిడెన్సియల్ విద్యను అందించాలంటే కనీసం 4 వేల రెసిడెన్సియల్ పాఠశాలలు ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. అయితే ఇప్పటివరకు ఏర్పాటు చేసినవి 492 మాత్రమే. వారు సౌకర్యాలతో పాఠశాలలు ఏర్పాటు కావాలంటే తగిన నిధులు కేటాయించాల్సి ఉంటుంది కదా. అయితే వీటికోసం ప్రత్యేక బడ్జెట్ కేటాయింపులు లేవు. 2014-15 ఆర్థిక సంవత్సరంలో 10.88 శాతం, 2015-16లో 9.69 శాతం, 2016-17లో 8.29 శాతం, 2017-18లో 8.49 శాతం, 2018-19లో 7.61 శాతం బడ్జెట్‌ను విద్యకు సంబంధించి కేటాయించారు. ఈ తక్కువ బడ్జెట్‌తో టిఆర్ఎస్ చెప్పిన గురుకుల పాఠశాలలు గాని కెజి నుండి పిజి వరకు ఉచిత నిర్బంధ విద్య గాని సాధ్యమయ్యే పనికాదని సులభంగానే అర్థం చేసుకోవచ్చు.

తెలంగాణలో వివిధ యాజమాన్యాల కింద పాఠశాలలు పని చేస్తున్నాయి. అవి 1) ప్రభుత్వ, స్థానిక సంస్థల పాఠశాలలు. 2) అంధులు, మూగ, చెవిటి, క్రీడా, జువైనల్ పాఠశాలలు. 3) మోడల్ స్కూళ్లు. 4) కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయ పాఠశాలలు. 5) తెలంగాణ రెసిడెన్సియల్ ఎడ్యుకేషన్ ఇన్‌స్టిట్యూషనల్ సొసైటీ పాఠశాలలు. 6) తెలంగాణ సోషల్ వెల్ఫేర్ రెసిడెన్సియల్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషనల్ సొసైటీ పాఠశాలలు. 7) తెలంగాణ ట్రైబల్ వెల్ఫేర్ రెసిడెన్సియల్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్ సొసైటీ. 8) మహాత్మ, జ్యోతిబాపూలే తెలంగాణ బిజి వెల్ఫేర్ రెసిడెన్సియల్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్ సొసైటీ పాఠశాలలు. 9) కేంద్ర ప్రభుత్వ పాఠశాలలు. 10) ఎయిడెడ్ పాఠశాలలు.

11) ప్రైవేట్ పాఠశాలలు. 12) మదర్సాలు, జాతీయ బాల కార్మిక ప్రాజెక్టు తదితర పాఠశాలలు. వీటన్నింటిలో మొత్తంగా 2016-17 విద్యా సంవత్సరంలో 58,66,786 మంది విద్యార్థులు చేరారు. ప్రైవేటు పాఠశాలల్లో 30,07,395 (51.26 శాతం), అన్ని రకాల ప్రభుత్వ పాఠశాలల్లో 28,59,391 (48.74 శాతం) మంది విద్యార్థులు నమోదయ్యారు. గత కొన్నేళ్లుగా ప్రభుత్వ పాఠశాలల్లో కంటే ప్రైవేట్ పాఠశాలల్లో విద్యార్థుల నమోదు పెరుగుతూ వస్తున్నది.

ప్రైవేట్ విద్యా సంస్థల్లో నమోదు పెరగడం అనేది విద్యా కొనుగోలు వస్తువుగా మారడాన్ని, ప్రభుత్వం తన విద్యా బాధ్యత నుండి తప్పుకోవడాన్ని సూచిస్తుంది. రాజ్యాంగంలో ఉచిత సార్వత్రిక నిర్బంధ విద్య అని చెప్పినప్పటికీ అది ఉచితం కాలేకపోతున్నది, సార్వత్రికం కాలేకపోతున్నది, నాణ్యమైదిగా, గుణాత్మకమైనదిగా కాలేకపోతున్నది. పెట్టుబడులు పెట్టి లాభాలు ఆర్జించే ఆదాయ వనరుగా విద్యా రంగం తయారయ్యింది. ఉచితంగా అందాల్సిన విద్య అంగట్లో సరుకై సంక్షోభంలో కూరుకు పోతున్నది. ఈ పరిస్థితి సామాజిక సంక్షోభాన్ని సూచిస్తుంది.

ప్రభుత్వ నియమాలను అనుసరించి నడిచే ప్రైవేట్ పాఠశాలలు చాలా తక్కువ. గదులు, భవనాలు, ఆట స్థలాలు, లైబ్రరీ, లాబోరేటరీలు తదితర అనేక విషయాలను అవి సంతృప్తిపరిచే పరిస్థితిలో లేవు. ఓ వైపు అధిక ఫీజులతో తల్లిదండ్రులను మరోవైపు అందులో పనిచేసే ఉపాధ్యాయులకు తక్కువ వేతనాలిస్తూ వారిని అన్యాయాలకు గురిచేస్తున్న ప్రైవేట్ పాఠశాలలను కొనసాగించడం సరైందేలా అవుతుంది. నాసిరకం చదువులు, వసతులు, అధిక ఫీజులతో విద్యా వ్యాపారం చేస్తున్న వాటిని స్వాధీనం చేసుకుని ఆయా ప్రాంతాలలోని ప్రభుత్వ పాఠశాలలను ఉన్నత ప్రమాణాలతో అన్ని రకాల వసతులతో నడిపించడం ద్వారా ప్రభుత్వం తన విద్యా బాధ్యతను నెరవేర్చగలుగుతుంది.

ప్రైవేటు, కార్పొరేట్ విద్యా సంస్థల్లో ఫీజుల క్రమబద్దీకరణ కోసం విద్యా ప్రమాణాల పెంపుదల, పర్యవేక్షణ కోసం ప్రత్యేక కమిషన్ ఏర్పాటు చేస్తారని, విద్యా వంతులు, మేధావులు, వైస్ ఛాన్సలర్‌లు, ప్రొఫెసర్లు, లెక్చరర్లు, టీచర్లతో సెమినార్లు, చర్చలు నిర్వహించి విద్యా విధానం రూపొందించడం జరుగుతుంది. విద్యా వేత్తలు, విద్యారంగ నిపుణులు విధానాలను రూపొందిస్తారు. ప్రభుత్వం కేవలం అమలు బాధ్యత స్వీకరిస్తుందని, ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ సంఘాల పాత్రలను విద్యారంగ పునర్నిర్మాణంలో పెంచుతుందని టిఆర్‌ఎస్ ఎన్నికల ప్రణాళికలో చెప్పారు.

ప్రైవేటు పాఠశాలల్లో ఫీజుల క్రమబద్ధీకరణపై తిరుపతిరావు కమిటీ వేశారు. ఆ కమిటి రిపోర్టు బయటికైతే రాలేదు. కాని అది ప్రైవేట్ విద్యా సంస్థల్లో ఫీజుల పెంపునకు సహకరించేలా ఉందని నిరసనలకు గురైంది. గతంలో కంటే కూడా నేడు మరింతగా ఫీజుల దోపిడీ పెరిగింది. విద్యా వేత్తలతో చర్యలు గాని, సెమినార్లు గాని నిర్వహించింది లేదు. ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ సంఘాల పాత్రను పెంచుతామన్నవారు నాలుగేళ్లలో ఒక్కసారి కూడా ముఖ్యమంత్రి వారితో మాట్లాడింది లేదు. కనీసం వారి అభిప్రాయాలను ఆహ్వానించిందీ లేదు. తమ ఎన్నికల ప్రణాళికలో ప్రస్తావించినట్లు విద్యా విధానాన్ని రూపొందించిందీ లేదు.

ప్రైవేట్ పాఠశాలల బస్సులు గ్రామాల్లోకి వస్తే టైర్లలో గాలి తీసేయండని విద్యా శాఖా మంత్రి కడియం శ్రీహరి ఇటీవల ప్రకటించాడు. ఆ మరుసటి రోజే తాను ప్రైవేట్ పాఠశాలలకు వ్యతిరేకం కాదని వివరణ ఇచ్చుకున్నాడు. నిజమే టిఆర్‌ఎస్ ప్రభుత్వం ప్రైవేట్ విద్యా వ్యాపారానికి వ్యతిరేకం కాదు. ఒకవేళ ప్రభుత్వమే అంటే సాక్షాత్తూ విద్యా శాఖా మంత్రే చెప్పాడు కదా అని నిజంగానే ఎవరైనా ఆ పని చేస్తే రేపు కేసుల పాలయ్యి పోలీస్ స్టేషన్ల చుట్టూ, జైళ్ల చుట్టూ తిప్పరని గ్యారంటీ ఏమీలేదు. అయినా ప్రైవేట్ వాటికి అనుమతులు ఇచ్చి అవి విస్తరించడానికి దోహదపడుతున్నది ప్రభుత్వ విధానాలే కదా. అక్కడ కట్టడి చేయనివారు ఇలా ప్రకటనలివ్వడం దగాకోరు కాక మరేమవుతుంది.

ఒక సినిమా చర్చలో పాల్గొంటూ మంత్రి కెటిఆర్ విద్యా వ్యాపారాన్ని వ్యతిరేకిస్తూ చూపడం పట్ల సానుకూలంగా స్పందించాడు. ఆ సినిమాలో ప్రైవేట్ పాఠశాలలకు వ్యతిరేకంగా ప్రభుత్వ పాఠశాలలను మెరుగుపరిచే విధానాన్ని ముఖ్యమంత్రి చేపడతాడు. ప్రైవేట్ విద్యా సంస్థలను నడుపుతున్న తన స్వంత పార్టీ ఎంఎల్‌ఏలు, మంత్రులు ముఖ్యమంత్రి నిర్ణయాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తారు. ముఖ్యమంత్రిని నయాన, భయాన బెదిరించే ప్రయత్నమూ చేస్తారు. పెట్టుబడులు పెట్టాం మీ విధానం వల్ల నష్టపోవాల్సి వస్తుందని చెప్పే వారి మాటలను తీవ్రంగా అడ్డుకుంటూ అసలు విద్యను వ్యాపారంగా లాభ నష్టాల బేరీజులతో చూడడమే తప్పని అంటాడు ముఖ్యమంత్రి. తెలంగాణ ముఖ్యమంత్రి సినిమాలోని ముఖ్యమంత్రిలా విద్యా వ్యాపారాన్ని వ్యతిరేకించే నిర్ణయాలేమీ అమలు చేయాలని అనుకోవడం లేదు కాబట్టి నిజ జీవితంలో కెసిఆర్‌కు తన స్వంత పార్టీవారే తనను వ్యతిరేకించే, బెదిరించే పరిస్థితి వచ్చి ఉండదని అనుకోవచ్చు.

తాము అధికారంలోకి వచ్చాక చైతన్య, నారాయణ వంటి ప్రైవేటు, కార్పొరేటు విద్యా సంస్థల దోపిడీని అడ్డుకుంటామని వాటిని నియంత్రించడమో, రద్దు చేయడమో, స్వాధీనం చేసుకోవడమో చేస్తామని ఎన్నోసార్లు ఎన్నో వేదికలపై పెద్ద పెద్ద గొంతులతో చెప్పి ఉన్నారు. కానీ ఏమయ్యింది. ఏమీ కాలేదు. ప్రభుత్వంలో బాధ్యతాయుతమైన మంత్రి పదవిలో ఉంటూ సినిమా చర్చలనేమో విద్యా ప్రైవేటీకరణను వ్యతిరేకిస్తూ వాస్తవంలో దానికి వ్యతిరేకమైన నిర్ణయాలు తీసుకోవడంలో భాగస్వామికావడం అనేది మోసం చేయడం కాకుండా పోతుందా. ఇక నుండైనా ప్రైవేట్ పాఠశాలలను కొత్తగా అనుమతులు ఇవ్వమనో, వాటిని నియంత్రిస్తామనో చెప్పడం లేదు. ఎప్పటి నుండో అమల్లో ఉన్న జిఒ ఎంఎస్ నెం. 1ను సక్రమంగా, ఖచ్చితంగా అమలు చేసినా కూడా ప్రైవేట్ పాఠశాలలు చాలా వరకు నియంత్రించబడేవి. ఇంతగా అవి విస్తరించేవి కావు. కనీసం ఈ ఉత్తర్వులైనా సరిగ్గా అమలు చేస్తామని చెప్పరు కాని, ప్రభుత్వ ఉపాధ్యాయులను మాత్రం ప్రైవేట్ వాటితో పోటీ పడమని అరిగిపోయిన రికార్డెడ్ మాటలను వల్లె వేస్తుంటారు. ప్రభుత్వ పాఠశాలలను మెరుగు పరచడం దారా ప్రైవేట్ వాటిని కట్టడిచేయగలమని అప్పుడప్పుడు అంటుంటారు.

ప్రభుత్వ లెక్కల ప్రకారమే 67 శాతం ప్రాథమిక పాఠశాలల్లో కేవలం ఇద్దరు టీచర్లు పనిచేస్తున్నారు. ఇద్దరు టీచర్లు 5 తరగతులకు కనీసం 20 సబ్జెక్టులు బోధించడం ఎంత కష్టతరమో ఊహించడం కష్టమేమీ కాదు. ఇంకో 13 శాతం పాఠశాలల్లో ముగ్గురు టీచర్లే పనిచేస్తున్నారు. ఈ అరకొర టీచర్లతో పాఠ్యాంశాలు, సహ పాఠ్యాంశాల నిర్వహణ ఎంత దుర్భరమో అర్థం కాని విషయం కాదు. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వ ప్రాథమిక

పాఠశాలల్లో తరగతి గదులు, ఆట స్థలాలు, తదితర వసతుల సంగతి సరేసరి. ఈ దుర్భరమైన పరిస్థితులతో ప్రభుత్వ పాఠశాలలు, ఉపాధ్యాయులు ప్రైవేట్ వాటితో ఎలా పోటీ పడేది? ఇటువంటి విధానాలను అనుసరిస్తున్న వారు ఉచిత నిర్బంధ విద్య గురించి మాట్లాడడం వంచించడం కాక మరేమవుతుంది.

తక్కువ మంది విద్యార్థులు ఉన్నారనే కారణంగా రేషనలైజేషన్, కన్సాలిడేషన్, విలీనం పేరేదైతేనేమి గాని దాదాపుగా 10 వేల పాఠశాలలను కనుమరుగు చేసే ప్రయత్నాన్ని 2016లో టిఆర్ఎస్ ప్రభుత్వం చేసింది. అయితే ఉపాధ్యాయ ఉద్యమ ఒత్తిడి కారణంగా ప్రభుత్వం వెనక్కయితే తగ్గింది కాని, ఆ పాఠశాలలను బలోపేతం చేసి నిలబెట్టే కార్యక్రమాలేవి ప్రభుత్వం వద్ద లేవు. రానురాను వాటిలో మరింతగా విద్యార్థులు తగ్గిపోయి మరణం పాలవుతాయి. ఇవి సహజ మరణాలే అని అనిపిస్తుంది. కాని కొంచెం లోతుల్లోకెళ్లి ఆలోచిస్తే రాజకీయార్థిక విధానాలనే ఉరితాళ్లు, విష గుళికల కారణంగా బలవన్మరణం పాలవుతున్నాయనేది తెలిసుకోవచ్చు. పాఠశాలల విలీనం, మూసివేత అనేది మెడపై వేళాడుతున్న కత్తిగానే ఉన్నది. అది ఏ క్షణాన్నైనా వేటు వేయచ్చనే సంకేతాలే మెండుగా ఉన్నాయి.

పిల్లలు లేనప్పుడు బడులెందుకు, అందులో టీచర్లెందుకు అనేది సరిగ్గానే కనపడుతుంది. అసలు గుట్టు ఎక్కడున్నదంటే దశాబ్దాలకు దశాబ్దాలుగా ప్రభుత్వ పాఠశాలలను కొడిగొట్టుకు పోయేలా చేస్తూ, ప్రభుత్వ నియమాలను ఉల్లంఘిస్తూ, ప్రభుత్వ పాఠశాలలకు చేరువలోనే ప్రైవేటు పాఠశాలలకు అనుమతులిచ్చి వాటిల్లోకి అధిక సంఖ్యలో విద్యార్థులు చేరేలా ఒక అనివార్యతను సృష్టిస్తున్న రాజకీయార్థిక విధానాల్లో ఉంది.

2016 మార్చ్ 30న తెలంగాణ అసెంబ్లీలో విద్యా శాఖా మంత్రి కడియం శ్రీహరి ప్రవేశపెట్టిన పత్రంలో ప్రభుత్వ బడుల్లో కంటే ప్రైవేట్ పాఠశాలల్లో విద్యార్థుల నమోదు పెరగడానికి కారణాలుగా 1) ప్రైవేట్ పాఠశాలల్లో తరగతికి ఒక ఉపాధ్యాయుడు ఉండడం. 2) హెడ్ మాస్టర్ సక్రమ పర్యవేక్షణ. 3) ఆంగ్ల మాధ్యమం. 4) పూర్వ ప్రాథమిక విద్య సెక్షన్లు ఉండడం. 5) రవాణా సౌకర్యం ఉండడం. 6) ప్రచారం చేసుకోవడం. అని తెలిపారు. ఇంతకు మించిన రాజకీయార్థిక, ప్రపంచ బ్యాంకు నిర్దేశిత దుర్మార్గమైన కారణాలేన్నో ఉన్నాయి. వాటిని ఈ ప్రభుత్వాలు చెబుతాయని అనుకోలేదు. సరేగాని కనీసం ఈ కారణాలకైనా పరిష్కారాలు చూపెట్టారా అంటే అదీ లేదు. ఏమైనా విధాన రూపకల్పన చేసిందా అంటే అదీ లేదు. ఏవో కొన్ని పేలవమైన సూచనలు చేసింది. అవి 1) విద్యార్థుల సంఖ్య తక్కువగా ఉన్న పాఠశాలలను విలీనం చేయడం ద్వారా ఎక్కువ విద్యార్థులుండేలా చేయాలి. ప్రాథమిక పాఠశాలల్లో కనీసం 100 మంది, ప్రాథమికోన్నత పాఠశాలల్లో 220 మందికి పైగా, ఉన్నత పాఠశాలల్లో 200 మందికి పైగా విద్యార్థులు ఉండేలా చేయడం ద్వారా పాఠశాల వసతి, సౌకర్యాలను సరిగ్గా వినియోగించబడతాయని, ఉపాధ్యాయులు బోధనలో లీనమవుతారు. 2) ఉపాధ్యాయుల ప్రతిభా ప్రదర్శన ఆధారంగా పదోన్నతులు, బదిలీలల్లో ప్రాధాన్యత, ప్రోత్సాహకాలు ఇవ్వాలి. విద్యార్థుల, ఉపాధ్యాయులు హాజరు మెరుగు పరుచుటకు బయోమెట్రిక్ విధానాన్ని అమలు చేయాలి. 3) ఉపాధ్యాయ నియామక విధానాలల్లో సంస్కరణలు చేపట్టాలి. 4) ప్రధానోపాధ్యాయుల, మండల విద్యా శాఖాధికారుల పోస్టుల ప్రత్యక్ష నియామకం. 5) ప్రధానోపాధ్యాయుల పదోన్నతికి పాఠశాల నాయకత్వంలో సర్టిఫికెట్ కోర్సు. 6) ఉపాధ్యాయ సంఘాల సంఖ్యను పరిమితం చేయడం. 7) నూతన నియామకం పొందిన ఉపాధ్యాయులకు ఇండక్షన్ ట్రైనింగ్. 8) పాఠశాల నిర్వహణలో స్థానిక సమాజ సహకారం.

ఎంతసేపటికీ పాఠశాలలను కుదించడం, విలీనం చేయడం పైననే దృష్టి పెడుతున్నారు తప్పిస్తే వాటిని బలోపేతం చేయడమెట్లా అనేది ఆలోచించడం లేదు. ఉపాధ్యాయుల సామర్థ్యాలను, ప్రొఫెషనలిజంను అనుమానంగా చూస్తూ వారివల్లే ప్రభుత్వ పాఠశాలలు విశ్వాసాన్ని కోల్పోతున్నాయనే వైఖరిని ప్రతిబింబిస్తూ విద్యా శాఖా మంత్రిగారి పత్రంలో ప్రతిపాదనలున్నాయి. పోనీ అదే సరైందని అనుకున్నా కూడా ఉపాధ్యాయులను తయారు చేసే శిక్షణా సంస్థలను ఉన్నత ప్రమాణాలతో శాస్త్రీయంగా తీర్చిదిద్దడానికి ఏమి చేయాలో ప్రభుత్వ ఆలోచనల్లో లేదు. ఉపాధ్యాయ శిక్షణా సంస్థల్లో గత 20 ఏళ్లకు పైగా నియామకాలు లేవు. 90 శాతం పైగా ఖాళీలే ఉన్నాయి. పాఠశాలల పర్యవేక్షణా యంత్రాంగం చాలినంతగా లేదని మంత్రిగారి పత్రం చెబుతూనే ఉన్నది. ఆ చాలీచాలని పర్యవేక్షణాధికారుల్లో కూడా 90 శాతం ఖాళీలే ఉన్నాయి. కనీసం వీటినైనా భర్తీ చేసే విధానపర చొరవ లేకుండా పోయింది.

రాష్ట్రంలో పాఠశాల విద్యకు సంబంధించి అత్యున్నత పరిశోధనా శిక్షణ సంస్థ అయిన ఎస్‌సిఆర్‌టిలో 90 శాతం పైగా ఖాళీలున్నాయి. ఇక ఈ సంస్థ పాఠ్య పుస్తకాల రూపకల్పనను, పరిశోధనలను, అధ్యయనాలను, శిక్షణలను ఏ విధంగా నిర్వహిస్తుంది. పాఠశాల విద్యలో, ఉపాధ్యాయుల్లో గుణాత్మకతను, ప్రమాణాలను పెంచడానికి ఏ మేరకు దోహదపడుతుంది. కనీస వసతులుండీ, సరిపోను ఉపాధ్యాయ సిబ్బంది ఉన్నప్పుడు దానికితోడు కనీసం ప్రస్తుతం అమల్లో ఉన్న ప్రభుత్వ నియమాలను అనుసరించైనా ప్రభుత్వ పాఠశాలల సమీపంలో ప్రైవేట్‌వి రాకుండా తగు చర్యలు తీసుకున్నప్పుడు ప్రజలు తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలలకు ఎందుకు పంపించరు. ప్రభుత్వ ఆధీనంలో నడుస్తున్న నవోదయ, కేంద్రీయ విద్యాలయాల్లో ప్రజలు ఎంతో ఆసక్తి చూపుతున్న విషయం తెలియందేమీ కాదు. దేశ వ్యాప్తంగా ఉన్న కేంద్రీయ విశ్వ విద్యాలయాలు, ఐఐటీలు, ఎన్ఐటీలు, ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్ (ఐఐఎస్ఇఆర్) నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్ (ఎన్ఐఎస్ఇఆర్), ఆల్ ఇండియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ (ఎఐఐఎంఎస్) దేశంలోనే నెంబర్ వన్ స్థానంలో నిలిచిన ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్ బెంగుళూరు వంటి మరెన్నో ప్రభుత్వ సంస్థల్లో ప్రవేశాల కోసం ఆరాటం అంతా ఇంతా కాదని తెలిసిందే కదా. ఆ స్థాయిలో ప్రభుత్వ పాఠశాలలను తీర్చి దిద్దడం అనేది ప్రభుత్వాలు తలుచుకుంటే సాధ్యం కానిది కాదు. కావల్సింది చిత్తశుద్ధి, అంకితభావం, రాజకీయ, సామాజిక, ఆర్థిక దార్శనికత. ప్రైవేట్ విద్యా వ్యవస్థను నియంత్రించకుండా అదే సమయంలో అన్ని స్థాయిల్లో ప్రభుత్వ వ్యవస్థను ఉన్నత ప్రమాణాలతో నిర్మించకుండా కెజి నుండి పిజి వరకు ఉచిత విద్య సాధ్యపడదు. ప్రైవేట్ విద్యా సంస్థలను కట్టడి చేయడమనేది ఉపాధ్యాయుల చేతుల్లో లేని విషయం. అదొక రాజకీయార్థిక సమస్య. రాజకీయార్థిక విధానాలు మాత్రమే సమాజంలోని అన్ని వర్గాలకు ఉచిత నాణ్యమైన విద్యను అందించగలవు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# తెరాస పాలనలో ఉన్నత విద్యపై నిర్లక్ష్యం

*పాలకులు ప్రభుత్వ యూనివర్సిటీలను నిర్లక్ష్యం చేస్తూ, ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు అనుమతులు ఇస్తూ, విశ్వవిద్యాలయాలకు ఉండే స్వయం ప్రతిపత్తిని, అకడమిక్, పరిశోధనా వాతావరణాన్ని ధ్వంసం చేస్తున్నారని అంటున్నారు* **ప్రొ. కె. లక్ష్మినారాయణ**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తీవ్ర నిర్లక్ష్యానికి, వివక్షకు, విద్రోహానికి గురైన తెలంగాణ ప్రజలు సుదీర్ఘ కాలం పోరాటం చేసి జూన్ 2 2014లో ప్రత్యేక రాష్ట్రాన్ని సాధించుకున్నారు. ఈ పోరాటంలో విద్యార్థులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, అధ్యాపకులు, కార్మికులు, రైతులు మొత్తం యావత్ తెలంగాణ సమాజం పాల్గొన్నది. ప్రధానంగా నీళ్లు, నిధులు, నియామకాల కోసమని జరిగిన ఈ పోరాటంలో ఎంతో మంది విద్యార్థులు, యువకులు రాజీలేకుండా పోరాడి అమరులయ్యారు. ఈ ఉద్యమంలో ముందుండి పోరాడిన విద్యార్థులు, ఉపాధ్యాయులు, అధ్యాపకులు కెజి నుంచి పిజి వరకు ఉచిత విద్యను అందించాలని, కామన్ స్కూల్ విధానం కావాలనే అట్టడుగు ప్రజల ఆకాంక్షను ముందుకు తెచ్చారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన వెంటనే జరిగిన ఎన్నికల్లో పాల్గొన్న టిఆర్ఎస్ ఈ డిమాండ్లను తన ఎన్నికల మేనిఫెస్టోలో చేర్చి, ప్రచారం చేసుకుని గెలిచింది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం జరిగిన పోరాటంలో పాల్గొన్న ప్రజలు ఉద్యమపార్టీ అని చెప్పుకుంటున్న టిఆర్ఎస్‌కు ఓటు వేస్తే తమ పిల్లలకు కెజి నుంచి పిజి వరకు ఉచిత నాణ్యమైన విద్య దొరుకుతుందని, తమ బిడ్డలకు ఉద్యోగాలు దొరుకుతాయని నమ్మారు. అయితే ఎన్నికల్లో గెలిచి అధికార పగ్గాలు చేపట్టిన టిఆర్ఎస్ పార్టీ ప్రజల నమ్మకాన్ని, ఆశయాలను వమ్ము చేసింది. ఈ విషయం ఉన్నతవిద్యపై చూపిన నిర్లక్ష్యాన్ని చూస్తే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

**ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నత విద్య**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో భాగంగా తెలంగాణలో ఉన్నత విద్య తీవ్రమైన వివక్షకు, విధ్వంసానికి గురైంది. దేశంలో 1986లో తీసుకువచ్చిన జాతీయ విద్యావిధానం, 1991లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానాలతో ప్రారంభమైన ఈ విధ్వంసం 1995లో చంద్రబాబు తీసుకువచ్చిన విజన్-2020తో వేగం పుంజుకుంది. 2004లో ఈ విధానాలను మారుస్తానని గద్దెనెక్కిన రాజశేఖరరెడ్డి ఉన్నత విద్యలో అవే ప్రైవేటీకరణ విధానాలను అంతకన్నా వేగంగా కొనసాగించారు. కాలేజీ, యూనివర్సిటీలలో వనరులు, వసతులు, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కల్పించక పోవడం, వేలాది పోస్టులను నింపకపోవడం వల్ల గత రెండు దశాబ్దాలుగా ఉన్నత విద్యకు జరిగిన విఘాతం బహుశా ఏ రాష్ట్రంలో కూడా జరగలేదు. కాంట్రాక్ట్ పద్ధతి, తాత్కాలిక పద్ధతిలో అధ్యాపకుల నియామకాలు చేపట్టడం వలన, వసతులు, వనరుల కొరత వలన విద్యా ప్రమాణాలు పడిపోయి రాష్ట్రం స్వతంత్రంగా, సాహసంగా ఆలోచించగలిగే మేధావు లను కోల్పోయింది. ఉన్నత విద్యలో ఈ కాలాన్ని చీకటియుగంగా భావించవచ్చు.

అందరికీ విద్య కావాలని, నియామకాలు కావాలనే డిమాండ్లు ప్రత్యేక రాష్ట్రం కోసం జరిగిన ఉద్యమంలో కూడా ప్రతిబింబించాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత 2014లో గద్దెనెక్కిన చంద్రశేఖరరావు ఉన్నత విద్యను బలోపేతం చేయడం అటుంచి దానిని నిర్లక్ష్యం చేయడంలో, విధ్వంసం చేయడంలో చంద్రబాబును, రాజశేఖరరెడ్డిని మించిపోయాడు.

**ఉమ్మడి రాష్ట్రంలో కళాశాల విద్యా వ్యాపారీకరణ, కార్పొరేటీకరణ**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 1990లలో నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ప్రైవేట్ ఇంజనీరింగ్, మెడికల్ అండ్ డెంటల్ కాలేజీలకు అనుమతి ఇస్తే రాష్ట్రంలోని విద్యార్థి, యువజన సంఘాలు, ప్రతిపక్ష పార్టీలు ఉద్యమాన్ని నిర్మించి ఆ అనుమతులను రద్దు చేయించడమే కాకుండా జనార్దన్ రెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుంచి దించేశాయి. ఆ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్న తెలుగుదేశం పార్టీ నాయకులు చంద్రబాబు 1995లో అధికారాన్ని కైవసం చేసుకుని ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీలకు విచ్చలవిడిగా అనుమతులు ఇచ్చారు. టిడిపికి సామాజిక పునాదిగా ఉన్న బలమైన సామాజిక వర్గం అప్పటికే విద్యా, వైద్య రంగాలలో వ్యాపారం చేయవచ్చని ఉవ్విళ్లూరుతున్నది. 150 సంవత్సరాల క్రితమే గోదావరి, కృష్ణ నదుల మీద నిర్మించిన ఆనకట్టల వలన వ్యవసాయం బాగా అభివృద్ధి చెందింది. వరి పంటలు, కొబ్బరి తోటలు, చేపల చెరువుల ద్వారా అలాగే హరిత విప్లవం ద్వారా ప్రభుత్వం ఇచ్చిన కోట్లాది రూపాయల సబ్సిడీల వలన ఈ ధనిక వర్గం కోట్లకు పడగలెత్తింది. అప్పటికే రైస్ మిల్లులు, రియల్ ఎస్టేట్, సినిమా రంగంలో పెట్టుబడులు పెట్టి అత్యధిక లాభాలను ఆర్జిస్తున్నారు. ప్రపంచీకరణ తర్వాత విద్యా, వైద్య రంగాలలో ప్రవేశించి రాజకీయ నాయకులు, కాంట్రాక్టర్లతో జతకలిసి సొమ్ము చేసుకుంది. ఫలితంగా 1995లో ఇంజనీరింగ్ కళాశాలలు 30 ఉంటే 2005 సంవత్సరానికి అవి 261కి పెరిగాయి. ఆ తర్వాత రాజశేఖరరెడ్డి, కిరణ్ కుమార్‌రెడ్డిల పాలనలో ఇంజనీరింగ్ కాలేజీల సంఖ్య 2013లో 718కి పెరిగింది. ఇందులో 624 ప్రైవేట్ రంగంలోనే వచ్చాయి. ఎస్‌సి, ఎస్‌టి, బిసి విద్యార్థుల కోసమని ఫీజు రీయంబర్స్‌మెంట్ విధానాన్ని ప్రవేశపెట్టి రాజశేఖరరెడ్డి తన సామాజిక వర్గానికి, విద్యా వ్యాపారులకు పెద్దపీట వేశారు. ఇంచుమించు అదే సమయంలో కేర్, అపోలో, గ్లోబల్ అసుపత్రి, మెడిసిటి లాంటి అసుపత్రుల రాకతో మెడికల్ విద్య కూడా వ్యాపారీకరణ చెంది రాష్ట్రంలో 26 మెడికల్ కాలేజీలు ఉంటే 21 ప్రైవేట్ రంగంలోనే వచ్చాయి. ఏఐసిటిఇ, ఎంసిఐలు విచారణ పేరుతో వచ్చినప్పుడు అద్దె లైబ్రరీలు, అద్దె డాక్టర్లు, అద్దె రోగులు కనిపించారని వార్తల్లో వచ్చిన విషయం తెలిసిందే. ఈ ఇంజనీరింగ్, మెడికల్ విద్యలో ప్రవేశాల కోసం ఎంసెట్ పరీక్షలకు తయారు చేస్తామని సొమ్ము చేసుకోవడం కోసం వచ్చిన చైతన్య, నారాయణలు ఇప్పుడు విద్యా రంగంలో గుత్త పెట్టుబడిదారులుగా ఎదిగి వేలాది మంది అమాయక విద్యార్థుల ప్రాణాలను బలితీసుకుంటున్నారు.

**ప్రభుత్వ కళాశాలల నిర్లక్ష్యం, ప్రైవేట్, కార్పొరేట్ కళాశాలలకు ప్రోత్సాహం**

ఇంజనీరింగ్, మెడికల్ విద్యలో విద్య వ్యాపారీకరణ, కార్పొరేటీకరణలా కాలేజీలు, బిఇడి కాలేజీలు, డిగ్రీ కాలేజీలను కూడా వదలలేదు. ఉమ్మడి రాష్ట్రంలోనే విపరీతంగా పెరిగిన ఈ విద్యా వ్యాపారీకరణ, కార్పొరేటీకరణ తెరాసా పాలనలో నిరాటంకంగా కొనసాగుతోంది.

2015లో తెలంగాణ రాష్ట్రంలో 266 ఇంజనీరింగ్ కళాశాలలుంటే 249 ప్రైవేట్ రంగంలో ఉన్నాయి.

ఎంసిఎ కాలేజీలు 49 ఉంటే 33 ప్రైవేట్, ఎంబిఎ కాలేజీలు 343 ఉంటే 322 ప్రైవేట్, బిఇడి కాలేజీలు 225 ఉంటే 219 ప్రైవేట్, లా కాలేజీలు 17 ఉంటే 14 ప్రైవేట్, డిగ్రీ కాలేజీలు 1278 ఉంటే 1152 ప్రైవేట్ రంగంలోనే ఉన్నాయంటే తెలంగాణలో విద్యా వ్యాపారీకరణ ఏ స్థాయిలో పెరుగుతుందో అర్థం చేసుకోవచ్చు. ఇంకా ప్రభుత్వ రంగంలో ఉన్న కాలేజీల్లో కూడా సెల్ఫ్ ఫైనాన్సింగ్ కోర్సులు పెట్టి వేలాది రూపాయల ఫీజులు వసూలు చేస్తూ ప్రభుత్వ కాలేజీల ప్రైవేటీకరణను తెరాసా ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. ఎఐసిటిఇ నిబంధనల ప్రకారం ఇంజనీరింగ్ కళాశాలల్లో ప్రతి 15 మంది విద్యార్థులకు ఒక అధ్యాపకుడన్న నిష్పత్తిని పూర్తి చేయలేకపోతున్న కారణంగా నాసికరం విద్యను అందిస్తున్నామని చెప్పి ప్రభుత్వమే ఒప్పుకుంది.

**రాష్ట్రీయ ఉచ్చతర్ శిక్ష అభియాన్ (రూసా)**

డిగ్రీ కాలేజీలను అభివృద్ధి చేస్తామని తీసుకువచ్చిన రూసా నియమ నిబంధనలు చాలా లోపభూయిష్టంగా ఉన్నాయి. ఇది కేంద్రీకృతమైన కేంద్ర ప్రభుత్వ విధానం. రాష్ట్ర ప్రభుత్వాలను కూడా పక్కనపెట్టి ఇతర సంస్థల నుంచి నిధులు రాకుండా మొత్తం నిధులను తన చెప్పు చేతల్లోకి తీసుకుంది. ఒకవైపు అన్ని చోట్లా సిబిసిఎస్, సెమిస్టర్ విధానాన్ని రుద్దుతూ మరొకవైపు అన్ని రకాల వసతులు ఉన్నప్పుడే నిధులు మంజూరు చేస్తున్నాయి.

రాష్ట్ర ప్రభుత్వ డిగ్రీ కళాశాలలు 126 ఉంటే అందులో 52 కాలేజీలకు సొంత భవనాలు లేవు. 22 మహిళా కళాశాలలు ఉంటే 10 కళాశాలలకు సొంత భవనాలు లేవు. 105 కాలేజీలకు హాస్టల్ వసతి సౌకర్యం లేదు. డిగ్రీ కాలేజీలలో అనుబంధ హాస్టల్ వసతులు లేకపోవడం వలన 85 శాతంగా ఉన్న పీడిత కులాల విద్యార్థులు, పేద విద్యార్థులు కాలేజీలు ఉన్న పట్టణాల్లో రూములకు అద్దె కట్టలేక, భోజన ఖర్చులు భరించలేక, హోటళ్లు, దురాణాల్లో, మాల్స్‌లో పనిచేసి చదువుకుంటున్నారు. మహిళా విద్యార్థులైతే సీట్లు వచ్చినా హాస్టల్ వసతులు లేకపోవడం వల్ల కోర్సుల్లో చేరడం మానేస్తున్నారు. ఈ మౌలిక వసతులు కూడా లేకపోవడం కారణంగా ఈ కళాశాలలు సంబంధింత విశ్వవిద్యాలయాలలో శాశ్వత అనుబంధ అనుమతి, యుజిసి 12 (బి) అర్హతను పొందలేక నాక్ ప్రతిపత్తికి అర్హత కోల్పోతున్నాయి. దీనిని చూపించి ఈ రూసా నిధులను మంజూరు చేయడం లేదు. ఫలితంగా దూర ప్రాంతాలలో, చిన్న పట్టణాలలో ఉన్న కాలేజీలన్నీ రోజు రోజుకూ బలహీనపడుతున్నాయి.

ప్రభుత్వ డిగ్రీ కాలేజీల్లో అనుమతి పొందిన 3007 అధ్యాపక పోస్టులకు 1247 పోస్టులు ఖాళీగా ఉండగా 966 కాంట్రాక్టు పద్ధతిలో పనిచేస్తున్నారు. అంటే 2212 పోస్టులు నింపలేదు. డిగ్రీ కాలేజీల్లో 56 శాతం కాలేజీలకు ప్రిన్సిపాల్సే లేరు. ఇంకా కాలేజీల్లో అదనంగా 1034 పోస్టులు కావాలని ప్రభుత్వం విడుదల చేసిన వివరణ నివేదిక తెలిపింది. ఇటు ఒకవైపు మౌలిక వసుతులు లేక ఇంకొకవైపు అధ్యాపకులు లేక ప్రభుత్వ డిగ్రీ కాలేజీల్లో విద్యా ప్రమాణాలు అడుగంటి పోతున్నాయి. ఫలితంగా విద్యార్థుల సంఖ్య తగ్గి వందలాది కాలేజీలు మూసివేతకు గురవుతున్నాయి. ప్రభుత్వ డిగ్రీ కాలేజీల్లో ఖాళీగా ఉన్న 3247 అధ్యాపక పోస్టులను రెగ్యులర్ ప్రాతిపదికన నింపి, మౌలిక వసతులను యుద్ధ ప్రాతిపదికన కల్పించాల్సిన ప్రభుత్వం దోస్త్... అనే విధానం తీసుకువచ్చి ఫీజు రీయింబర్స్‌మెంట్ విధానం ద్వారా మిగిలిన కాలేజీలను మూసివేయడానికి ప్రయత్నిస్తున్నది.

**దోస్త్ - గ్రామీణ, ఏజెన్సీ ప్రాంతాల విద్యార్థులకు శత్రువు**

డిగ్రీ ఆన్‌లైన్ సర్వీసెస్, తెలంగాణ పేరు మీద 2016లో తెలంగాణ కాలేజియేట్ ఎడ్యుకేషన్ కమిషనర్, ఉన్నత విద్యామండలి కలిసి ఒక కార్యక్రమాన్ని తయారు చేశారు. దీని ప్రకారం ఇంటర్మీడియట్ పాసైన విద్యార్థులు రాష్ట్రంలో తాము కోరుకున్న ఏ కాలేజీలకైనా ఆన్‌లైన్‌లో అప్లయ్ చేసుకోవచ్చు. కంప్యూటరీకరణ, ఇంటర్నెట్ వచ్చిన ఈ కాలంలో ఇది బాగానే కనిపించవచ్చు. కానీ దీని వలన గ్రామీణ ప్రాంత విద్యార్థులు, ఏజెన్సీ ప్రాంత విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొని ఏ కాలేజీలో కూడా అప్లయ్ చేసుకోలేని స్థాయికి నెట్టబడ్డారు. ఈ స్థితి రావడానికి ముఖ్య కారణాలు

1. విద్యార్థులు మీ సేవా ద్వారా కాలేజీలకు అప్లయ్ చేసుకోవాలి. ఏజెన్సీ ప్రాంతాల్లో, గ్రామీణ ప్రాంతాల్లో మీ సేవా సెంటర్లు చాలా తక్కువగా ఉన్నాయి. ఉనికిలో ఉన్న కొద్ది కేంద్రాలు కూడా కనీసం 40 కిలోమీటర్ల దూరంలో ఉన్నాయి.

2. ఈ సంవత్సరం అకస్మాత్తుగా ఆదాయం సర్టిఫికెట్ కూడా అప్లికేషన్‌తోపాటే అన్‌లైన్‌లో పంపాలని ఆ సర్టిఫికెట్ ఉంటేనే స్కాలర్‌షిప్‌, హాస్టల్ వసతులు ఉంటాయని ఆర్డర్లు జారీ చేశారు. ఇది కూడా మీ సేవా ద్వారా జరగాలి. ఇప్పుడు మీ సేవా సెంటర్లు రైతు బంధు పథకం కోసం, పట్టాదారు పాస్‌పుస్తకాల కోసం కిక్కిరిసి పోతున్నాయి. దీనివలన విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు.

3. కాలేజీ కోర్సుల ఎంపిక కోసం ఆన్‌లైన్‌లో ఫోన్ నెంబర్‌లో ఆధార్ నెంబర్ ఎంట్రీ చేయాలి. ఇది చాలా మంది విద్యార్థులకు తెలియదు. ఫలితంగా వేలాది మంది విద్యార్థులు తమ ఫోన్ నెంబర్‌తో సహా ఆధార్ లింక్ చేయకపోవడం వలన ఆ రిజిస్ట్రేషన్‌లను సిస్టమ్ యాక్సెప్ట్ చేయడం లేదు. ఆధార్, ఫోన్ నెంబర్ల లింక్ సమస్యలు, సర్వర్ డౌన్ లాంటి సమస్యలు హైదరాబాద్ నడిబొడ్డున కూడా ఉన్నాయంటే ఏజెన్సీ ప్రాంతాల్లో, చిన్ని పట్టణాల్లో పరిస్థితిని అంచనా వేయవచ్చు.

కంప్యూటర్ లిటరసీ లేని ఏజెన్సీ ప్రాంతాలు, చిన్నచిన్న పట్టణాలు ఈ రాష్ట్రంలో కోకొల్లలుగా ఉన్నాయనే అవగాహన లేని ఉన్నత విద్యాశాఖాధికారులు అనాలోచిత నిర్ణయాలు తీసుకుని అమలు చేస్తున్నారు. ఇదే అదనుగా తీసుకుని అతి కష్టం మీద మీ-సేవకు చేరుకున్న విద్యార్థులను తప్పుదోవ పట్టించి ఫీజు రీయింబర్స్‌మెంట్ విధానం ఉందని, ప్రైవేట్, కార్పొరేట్ కాలేజీలకు అప్లయ్ చేయిస్తున్నారు. ఈ దోస్ట్ అనే విధానం ఏజెన్సీ ప్రాంతాల్లోని ఆదివాసీ విద్యార్థులకు, గ్రామీణ ప్రాంత విద్యార్థులకు చదువును దూరం చేసే సాధనంగా మారింది. ఈ విద్యార్థులను విద్యార్థి సంఘాలు సంఘటితం చేయవలసిన ఆవశ్యకత ఉన్నది. ఈ ప్రాంతాల్లోని డిగ్రీ కాలేజీల మూసివేతకు దారితీస్తున్నది. ఇంకొకవైపు పెద్ద పట్టణాల్లో, నగరాల్లో ఉండే ప్రైవేట్, కార్పొరేట్ కాలేజీలకు ఈ కార్యక్రమం దోస్త్‌గా మారింది.

విద్యారంగాన్ని ముఖ్యంగా ఉన్నత విద్యను తీసుకుంటే అన్ని రాష్ట్రాల ప్రభుత్వాల కంటే తక్కువ ప్రాధాన్యత ఇచ్చింది తెలంగాణ ప్రభుత్వం. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో సీమాంధ్ర ప్రభుత్వాల కంటే బడ్జెట్‌లో తక్కువ శాతం కేటాయించడం చూస్తే అందులో గత నాలుగు సంవత్సరాల్లో ప్రతి సంవత్సరం ఆ శాతాన్ని మరింత తగ్గించడం చూస్తే టిఆర్‌ఎస్ ప్రభుత్వం ఉన్నత విద్యను ఎంత ఘోరంగా నిర్లక్ష్యం చేస్తుందో తెలుస్తుంది.

**తెలంగాణ రాష్ట్రంలో విశ్వవిద్యాలయాల పరిస్థితి**

ప్రస్తుతం తెలంగాణ రాష్ట్రంలో 22 యూనివర్సిటీలు ఉన్నాయి. వీటిలో 6 స్టేట్ యూనివర్సిటీలు, 11 ప్రత్యేక యూనివర్సిటీలు, 3 సెంట్రల్ యూనివర్సిటీలు, 2 డీమ్డ్ (ప్రైవేట్) యూనివర్సిటీలు ఉన్నాయి.

ఉస్మానియా, కాకతీయ, తెలంగాణ, మహాత్మాగాంధీ, పాలమూరు, శాతవాహన యూనివర్సిటీలు, స్టేట్ యూనివర్సిటీలుగా ఉన్నాయి. అలాగే జెఎన్‌టియు, డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, నల్సార్ యూనివర్సిటీ, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ, జెఎన్‌టియు ఆర్కిటెక్చర్ అండ్ ఫైన్ ఆర్ట్స్ యూనివర్సిటీ, జయశంకర్ అగ్రికల్చర్ యూనివర్సిటీ, కాళోజీ హెల్త్ యూనివర్సిటీ, పి.వి. నరసింహారావు వెటర్నరీ యూనివర్సిటీ, రాజీవ్‌గాంధీ యూనివర్సిటీ ఆఫ్ నాలెడ్జ్ అండ్ టెక్నాలజీ, నిమ్స్, నిట్‌లు, స్పెషలైజ్డ్ యూనివర్సిటీల కిందికి వస్తాయి. అలాగే ఇఫ్లూ, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ, మౌలానా ఆజాద్ నేషనల్ ఉర్దూ యూనివర్సిటీలు, సెంట్రల్ యూనివర్సిటీల కందికి వస్తాయి. డీమ్డ్ యూనివర్సిటీల పేరుతో నడుస్తున్న ఇక్ఫాయ్ యూనివర్సిటీ, ఐఐఐటిలు ప్రైవేట్ యూనివర్సిటీలే. ప్రధానంగా మనం స్టేట్ యూనివర్సిటీల గురించి చర్చించుకుందాం. రాష్ట్రంలోని పది స్టేట్ యూనివర్సిటీల గురించి కొన్ని గణాంకాలు అందుబాటులో ఉన్నాయి. ఈ గణాంకాల ప్రకారం 2015లో ఈ పది యూనివర్సిటీలలో 1448 ప్రొఫెసర్ల పోస్టులు ఖాళీగా ఉన్నాయి.

తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల పాలన కాలంలో నిర్లక్ష్యానికి గురైన యూనివర్సిటీలను తెలంగాణ ప్రభుత్వం అభివృద్ధి చేస్తుందనే అధ్యాపకుల, విద్యార్థుల ఆకాంక్షలను టిఆర్ఎస్ ప్రభుత్వం వమ్ము చేసింది. చంద్రశేఖర రావు ప్రభుత్వం కూడా యూనివర్సిటీలలో ఖాళీగా ఉన్న వందలాది ప్రొఫెసర్ల పోస్టులను నింపలేదు. 2015లో ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఉస్మానియా యూనివర్సిటీలో 732 ప్రొఫెసర్ పోస్టులు, కాకతీయ యూనివర్సిటీలో 391 పోస్టులు, తెలంగాణ యూనివర్సిటీలో 56, మహాత్మాగాంధీలో 34, శాతవాహనలో 51, పాలమూరులో 87, జెఎన్‌టియు ఎచ్‌లో 191, పొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్సిటీలో 34, అంబెద్కర్ ఓపెన్ యూనివర్సిటీలో 27, జెఎన్ఎఫ్ఎయులో 29 అధ్యాపక పోస్టులు ఖాళీగా ఉన్నాయంటే యూనివర్సిటీల దుస్థితిని అర్థం చేసుకోవచ్చు. పాలమూరు యూనివర్సిటీ ఎనిమిది మంది అధ్యాపకులతో, శాతవాహన యూనివర్సిటీ 12 మంది అధ్యాపకులతో నడుస్తున్నాయంటే విద్యకు జరిగిన విధ్వంసం ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. అంతేకాకుండా ప్రభుత్వం తగినన్ని గ్రాంట్లు ఇవ్వకపోవడం వల్ల లైబ్రరీలు అంతర్జాతీయ జర్నల్స్ కొనలేక, ఖరీదైన పుస్తకాలు కొనలేక, లాబొరేటరీలు ఆధునిక పరికరాలు, రసాయనాలు కొనలేక, విద్యా ప్రమాణాలు పరిశోధనా వాతావరణం అంతరించిపోతున్నాయి. ఈ విద్యార్థులు నివసించే వసతి గృహాల్లో ఒక్క రూములో ఆరుగురు విద్యార్థుల వరకు ఉంటున్నారు. కనీస వసతులైన బాత్‌రూంలు, మరుగుదొడ్లు అవసరమైన సంఖ్యలో ఉండవు. నీటి వసతి సరిగ్గా ఉండదు. భోజనంలో నాణ్యత అంతంత మాత్రమే.

**ప్రభుత్వ యూనివర్సిటీలను మూసివేయడానికే ప్రైవేట్ యూనివర్సిటీల చట్టం**

ఈ విధంగా ప్రత్యేక రాష్ట్రంలో రాజీలేకుండా తుదకంటూ పోరాడిన యూనివర్సిటీలలో అకాడమిక్ వాతావరణాన్ని, పరిశోధనా వాతావరణాన్ని అభివృద్ధి చేసే బదులు తెలంగాణ ప్రభుత్వం కావాలనే పనిగట్టుకుని నిర్లక్ష్యం చేసింది, చేస్తున్నది. యూనివర్సిటీలలో ఖాళీలను నింపుతామంటున్న ప్రభుత్వ ప్రకటనలు కాగితాలకే పరిమితమైపోయాయి. అంతేకాకుండా అన్ని రంగాలతో పాటు యూనివర్సిటీల మీద కూడా పెత్తనం చెలాయించాలనే సంస్కృతి చెన్నారెడ్డి కాలంలో మొదలై చంద్రబాబు, రాజశేఖరరెడ్డి కాలంలో అంచెలంచెలుగా ఎదిగి చంద్రశేఖరరావు కాలానికి పరాకాష్టకు చేరుకుంది. యూనివర్సిటీలలో జరిగే నియామకాలను సర్వీస్ కమిషన్‌కు ఇవ్వాలనే ఆలోచన దగ్గర మొదలై ఉద్యోగం వచ్చిన తర్వాత జ్ఞానార్జనను ఎప్పుడో వదిలిపెట్టిన ఐఎఎస్, ఐపిఎస్ వాళ్లను ఇన్‌చార్జి విసిలుగా, విసిలుగా నియమించాలనే దాక ఈ ఆలోచన వెళ్లింది. విద్యావేత్తల నుంచి మేధావుల నుంచి తీవ్ర నిరసన రావడం వలన ఈ ఆలోచనను విరమించుకున్నారు. ఇప్పటికీ కొన్ని యూనివర్సిటీలు ఇటువంటి ఇన్‌చార్జి విసిల ద్వారానే నడుస్తున్నాయి. కొన్ని యూనివర్సిటీలలో రెగ్యులర్‌గా విసిలను నియమించినా అత్యంత బలహీనమైన, తమకు లోబడి పనిచేసే, తాము మెచ్చిన వ్యక్తులకు పదవులు కట్టబెట్టి ముఖ్యమంత్రి, ప్రభుత్వ ప్రధాన ముఖ్య కార్యదర్శులు తమ జేబు సంస్థలుగా మార్చుకుంటున్నారు. ఈ విధంగా స్వయం ప్రతిపత్తిని, అకాడమిక్ వాతావరణాన్ని, పరిశోధనా వాతావరణాన్ని సంపూర్ణంగా ధ్వంసం చేసి ప్రైవేట్ యూనివర్సిటీల ద్వారా నాణ్యమైన, పరిశోధనాత్మకమైన ప్రపంచ స్థాయి విద్యను అందిస్తామని చట్టం తీసుకువస్తున్నారు.

2017లోనే ప్రైవేట్ యూనివర్సిటీ బిల్లు తీసుకురావడానికి రిలయన్స్ కార్పొరేట్ కంపెనీకి యూనివర్సిటీ పెట్టుకోవడానికి వెయ్యి ఎకరాల భూమిని కేటాయిస్తామని ప్రయత్నించారు. విద్యార్థులు, మేధావులు, విద్యావేత్తల నుండి తీవ్ర నిరసన వ్యక్తమైంది. కెజి నుంచి పిజి వరకు ఉచిత విద్య, నాణ్యమైన విద్య ప్రభుత్వ విద్యాసంస్థల ద్వారానే అందించాలని, ప్రైవేట్ విశ్వవిద్యాలయాల బిల్లు ఆలోచనను విరమించుకోవాలని, రిలయన్స్ సంస్థకు అనుమతి ఇవ్వకూడదని తెలంగాణ విద్యాపరిరక్షణ కమిటీ 2017, ఫిబ్రవరి 6 నుంచి 20వ తేదీ వరకు రాష్ట్రవ్యాప్తంగా విద్యాపోరాట యాత్రను నిర్వహించింది. ఈ రాష్ట్రవ్యాప్త నిరసనను గమనించిన టిఆర్ఎస్ ప్రభుత్వం 2018 మార్చ్ 28న రహస్యంగా తొందర తొందరగా ఆఘమేఘాల మీద ఉభయ సభల్లో ప్రైవేట్ యూనివర్సిటీ బిల్లును ఆమోదింపజేసుకుంది. అంబానీ, టెక్ మహీంద్ర, చైతన్య, నారాయణ, కె.ఎల్. యూనివర్సిటీ లాంటి విద్యా వ్యాపారులకు అలాగే తెలంగాణలో ఎదుగుతున్న పల్లా రాజేశ్వరరెడ్డి లాంటి విద్యావ్యాపారుల కోసమే ఈ ప్రైవేట్ యూనివర్సిటీల బిల్లు. అంతేకాకుండా రేపు డబ్ల్యుటిఓ – గ్యాట్స్‌లో ఉన్నత విద్యను చేర్చడానికి ఇచ్చిన ఆఫర్‌ను కమిట్‌మెంట్‌గా మార్చడానికి ఈ బిల్లు బాగా ఉపయోగపడుతుంది.

అయితే ఈ బిల్లుకు యూనివర్సిటీల నుంచి కాలెజీల నుంచి పెద్ద ఎత్తున వ్యతిరేకత రాకపోవడం ఆందోళన కల్గిస్తున్నది. దీనికి భిన్న కారణాలు ఉన్నాయి. యూనివర్సిటీలలో చదువుకునే విద్యార్థులకు ప్రైవేట్ యూనివర్సిటీల బిల్లు వలన తమకు, కింది వర్గాలకు జరిగే దుష్పరిణామాలు ఇంకా అవగాహనలోకి రాలేదు. రాష్ట్రంలో పనిచేసే విద్యార్థి సంఘాలు వాళ్లలో ఈ చైతన్యం కలగించి కదిలించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఇక యూనివర్సిటీలలోని రెగ్యులర్ ప్రాతిపదికలపై నియమించబడ్డ అధ్యాపకులకు 6వ పే కమిషన్ స్కేల్ రావడం వలన చైతన్యం లేని అధ్యాపకలోకం జీవనశైలి మారిపోయి వ్యక్తిగతంగా చీకు చింతా లేని జీవితం గడుపుతున్నారు. సమాజం గురించి, విద్యావ్యవస్థ గురించి ప్రభుత్వ యూనివర్సిటీ భవిష్యత్తు గురించి ఆలోచించడం అనవసరమైన బాధ్యతరాహిత్య దృక్పథాన్ని వీరు వంటబట్టించుకున్నారు. ఇక మిగిలిన మెజారిటీ అధ్యాపకులు తాత్కాలిక అధ్యాపకులుగా, గెస్ట్ లెక్చరర్స్‌గా, కాంట్రాక్ట్ లెక్చరర్స్‌గా అత్యంత తక్కువ జీతాలతో పనిచేస్తూ, ఉద్యోగ భద్రతలేక భయం భయంగా బతుకుతూ విద్యావ్యాపారీకరణను ప్రశ్నించలేకపోతున్నారు. విద్యార్థులతోపాటు ఈ అధ్యాపకవర్గాన్ని పెద్దఎత్తున తట్టిలేపి విద్యావేత్తల, మేధావుల, ప్రజాసంఘాల, సామాజిక సంఘాల భాగస్వామ్యంతో ప్రైవేట్, కార్పొరేట్, స్కూళ్ల, కాలేజీల, యూనివర్సిటీలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాల్సిన బాధ్యత విద్యాపరిరక్షణ ఉద్యమంపై ఉన్నది.

*(రచయిత కార్యనిర్వాహక కార్యదర్శి, తెలంగాణ విద్యా పరిరక్షణ కమిటీ)* వీ

# నిరుద్యోగుల్ని నిరాశపర్చిన టీఆర్ఎస్ ప్రభుత్వం

***ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే ఉపాధి లభిస్తుందనే ఆకాంక్షతో పోరాడిన తెలంగాణ విద్యార్థి, యువజనుల ఆకాంక్షలను రాష్ట్రం ఏర్పడ్డాక తెరాస ప్రభుత్వం నీరుగార్చిందని అంటున్నారు బైరెడ్డి సతీష్***

గత ఏప్రిల్ 27న టిఆర్ఎస్ ప్రతి సంవత్సరం లాగానే తన ఆవిర్భావ దినం రోజున ప్లీనరీని ఏర్పాటు చేసుకున్న సందర్భంలో హైదరాబాద్ నగరంలో వేలాది ఫ్లెక్సీలు, హోర్డింగులను ఏర్పాటు చేసి ఆ ప్రభుత్వం సాధించిన 'అభివృద్ధి'ని, చేపట్టిన అనేక కార్యక్రమాలను తెలియపరిచే ప్రయత్నం చేసింది. మిషన్ కాకతీయ, భగీరథ, డబుల్‌బెడ్‌రూం ఇండ్లు, వివిధ ప్రాజెక్టులు, కళ్యాణలక్ష్మి, పెన్షన్లు లాంటివి మొదలు అనేక చిన్నాచితక పనులను కూడా గొప్పగా చెప్పుకునే ప్రచారం బాగా చేసింది. ఆ మొత్తం ప్రచార పర్వంలో ఒక్కటి మాత్రం ఎక్కడా కనిపించలేదు. నీళ్లు, నిధులు, నియామకాలు ప్రధాన నినాదాలుగా జరిగిన ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో ప్రత్యేకించి యువతరమంతా ఏ ఆకాంక్షను సాఫల్యం చేసుకునేందుకై తమ ప్రాణాలను తృణప్రాయంగా వదిలివేశారో ఆ ఒక్కటే నియామకాలు.

ఒక్క చోట కూడా టిఆర్ఎస్ ప్రభుత్వం గత నాలుగు సంవత్సరాల కాలంలో తన ఉద్యమ కాలంనాటి, ఎన్నికల మ్యానిఫెస్టోలో ఇచ్చిన ఉద్యోగ నియామకాల హామీ గురించి ఏ మాత్రం చెప్పుకునే ప్రయత్నం చేయలేదు! తెలంగాణ సమాజంలో స్వరాష్ట్రం సాధించడం ద్వారా తమ ఆకాంక్షలు సాకారమవుతాయని బలంగా నమ్మింది యువతరమంతా. 'ఉద్యమ పార్టీ' అధికారంలోకి వస్తే అది సాధ్యమవుతుందని ఆ పార్టీనే ఆదరించారు. మరి గడిచిన నాలుగు సంవత్సరాల కాలంలో నిజంగా ఆ దిశగా అడుగులు ఏ మేరకు పడ్డాయి, బడుగు, బలహీన వర్గాల నుండి ఇపుడిపుడే చదువుకొని ఎదిగిన యువతరానికి భద్రమైన ఉద్యోగాలను అందివ్వడంలో టిఆర్ఎస్ ప్రభుత్వం ఏ మేరకు సఫలమయింది అనే అంశాన్ని వాద ప్రతివాదాలతో, తర్కాలతో సంబంధం లేకుండానే వాస్తవ గణాంకాలతోనే తేల్చవచ్చు.

2014లో ప్రభుత్వం తెలియపర్చిన వివరాల ప్రకారం ఆనాడు 5,23,675 మొత్తం ఉద్యోగాలు. అప్పటికి పనిచేస్తున్న ఉద్యోగుల సంఖ్య 4,15,931. ఖాళీలుగా చూపెట్టబడినవి 1,07,144. నిజానికి ఈ సంఖ్య మరింత ఎక్కువగా ఉండే అవకాశమూ ఉన్నది. వీటిలో ఆయా ప్రభుత్వ రంగ సంస్థల, కార్పోరేషన్ ఖాళీలను చేర్చలేదు. ఉద్యమం జరుగుతున్న కాలంలో తెలంగాణ అన్ని రూపాల్లో రెండున్నర లక్షల ఉద్యోగాలను కోల్పోయిందని చెప్పడం జరిగింది. ఉన్న ఖాళీలు భర్తీ కావడమే కాకుండా కొత్తగా ప్రభుత్వ ఉద్యోగాలు సృష్టించబడతాయని కూడా విద్యార్థి లోకం బలంగా నమ్ముతూ వచ్చింది.

రాష్ట్రం ఏర్పడిన తొలినాళ్ల నుండే లక్షలాదిగా నగర, పట్టణ ప్రాంతాలకు చాలీ చాలనీ వనరులతో, తాము అప్పటికే చేస్తున్న ప్రైవేటు ఉద్యోగాలను సైతం వదులుకొని కోచింగ్ కోసం వచ్చి కోచింగ్ సెంటర్లకు వేలాది రూపాయలను సమర్పించి పోటీ పరీక్షల చదువులో నిమగ్నమైంది యువత. మరో వైపు ప్రభుత్వమేమో 'మిషన్'ల మీద పడి వాటిని యుద్ధ ప్రాతిపదికన చేపట్టింది. ఉద్యోగ మిషన్ మాత్రం నత్తకే నడక నేర్పేలా సాగుతూ వస్తున్నది. ప్రభుత్వం తనకవసరమైన పోలీసు నియామకాన్ని బాగానే చేపట్టింది. ఇంజనీరింగ్ విద్యార్హత కలిగిన వాటితో మరికొన్ని నియామకాలు చేపట్టింది. ఈ రెండు నియామకాలు తన ప్రయోజనాల కనుగుణంగా ఉంటాయి కాబట్టి తక్షణమే చేపట్టింది. కానీ కామన్ డిగ్రీ అర్హత కలిగిన ఉద్యోగాల భర్తీ, రాష్ట్ర, జోనల్ స్థాయి ఉద్యోగ నియామకాల గురించి అసలు పట్టించుకోనేలేదు. ప్రత్యేకించి గ్రూప్స్ విషయంలో కమలనాథన్ కమిటీ రెండు రాష్ట్రాల మధ్య ఉద్యోగాల పంపకం ప్రక్రియ పూర్తి చేయలేదన్న సాకుతో రాష్ట్ర, జోనల్ ఉద్యోగాల జోలికే పోలేదు.

విద్యార్థి యువతరం నుండి ఒత్తిడి పెరిగిన తరుణంలో గ్రూప్-2 ఉద్యోగాల నియామకం అని ఊరించి ఊరించి ఉసూరుమనిపించేలా కేవలం 439 ఖాళీలతో కూడిన నోటిఫికేషన్ వెలువరించింది. ఈ ప్రకటనతో ఆగ్రహించిన విద్యార్థి లోకం ఆందోళనకు దిగడంతో మరో 593 ఖాళీలను అదనంగా చేర్చింది. ఈ మొత్తం 1,032 ఉద్యోగాల కోసం టిఎస్‌పిఎస్‌సిలో రిజిస్టర్ అయినవాళ్ల సంఖ్య ఎనిమిది లక్షలు, పరీక్షలు రాసినవాళ్లు ఏడు లక్షలు అంటేనే నిరుద్యోగం ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. ఇవి పోను అడపా దడపా ఆయా శాఖల్లో పదులు, వందల సంఖ్యలో ఉద్యోగాల నియామకం కోసం ప్రకటనలు వచ్చినప్పటికీ అవన్నీ ప్రత్యేక విద్యార్హతలు అవసరమైన ఉద్యోగాలు మాత్రమే. పోనీ ప్రకటనలు వెలువడి చకాచకా అంతా సవ్యంగా జరిగి నియామక పత్రాలు చేతికొస్తాయా అంటే ఎవరూ గ్యారంటీ ఇవ్వలేని పరిస్థితి. తాజాగా సమర్పించిన బడ్జెట్ సందర్భంగా 27,874 ఉద్యోగ నియామకాలు మాత్రమే చేపట్టడం జరిగిందని స్వయంగా ఆర్థిక శాఖా మంత్రిగారే అధికారికంగా ప్రకటించారు. మరికొన్ని ఉద్యోగ నియామక నోటిఫికేషన్లు కూడా రాబోతున్నట్లు కూడా ప్రకటించారు.

27 వేల ఉద్యోగాలకే నాలుగేళ్లు పడితే మిగిలిన 80వేల ఉద్యోగాలకు ఎన్ని ఏళ్లు పడుతాయో మరి? ఈ నాలుగు సంవత్సరాల కాలంలో పదవీ విరమణ చేసిన వారి సంఖ్య 40 వేలకు పైగానే ఉన్నది. ఈ లోగా ప్రభుత్వం మాట మార్చి కొత్త లెక్కలు ముందుకు తెస్తున్నది. మొత్తం ఉద్యోగాలు 4,41,995 పనిచేస్తున్న ఉద్యోగుల సంఖ్య 3,33,781 ఖాళీలు 1,08,214. 2017 వరకు మంజూరైన ఉద్యోగాలను తగ్గించి, పదవీ విరమణతో ఖాళీయైన వాటి లెక్కలు కూడా చూపించకుండా 83 వేల ఉద్యోగాలను రద్దుపరిచారు. ఉపాధ్యాయ నియామకాల గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది.

గడిచిన నాలుగేళ్ల కాలంలో 40కి పైగా విరుద్ధమైన ప్రకటనలు చేసి ఉద్యోగార్థులను గందరగోళంలోకి నెట్టివేసింది. 2014లో 20 వేలకు పైగా ఉపాధ్యాయ ఖాళీలున్నాయని చెప్పిన ప్రభుత్వమే కేవలం 8,792 పోస్టులతో కూడిన ఉపాధ్యాయ నియామక ప్రకటనను ఇచ్చి తీవ్ర నిరాశ పరిచింది. మొత్తంగా 4 వేల పాఠశాలలను హేతుబద్ధీకరణ పేరుతో

మూసివేసి అసలు భర్తీ ప్రక్రియయే అవసరం లేదనిపించేలా వాతావరణాన్ని సృష్టించే ప్రయత్నమూ చేసింది ప్రభుత్వం.

కొత్త జిల్లాల వారిగా ఉపాధ్యాయుల నియామకం అంటూ ప్రకటన చేసి అడ్డగోలుగా విభజించిన జిల్లాల్లో కొన్నింటిలో అసలు పోస్టులే లేకపోవడంతో అభ్యర్థులు కోర్టుకెళ్లి పాత జిల్లాల ప్రకారమే నియామక ప్రక్రియ జరగాలని తీర్పును తెచ్చుకోవాల్సివచ్చింది. రెసిడెన్షియల్ విద్యాలయాల నియామకం కొంత మేరకు చేపట్టినప్పటికీ వాటిని పూర్తిస్థాయి ప్రభుత్వ ఉద్యోగాలుగా జమకట్టలేము. ఏ ఉద్యోగ ప్రకటన కూడా న్యాయ సంబంధ చిక్కుముడులు లేకుండా సవ్యంగా సాగింది లేదు. ఎవరు కోర్టుకెళ్లినా రాజకీయ కోణంలో ప్రతిపక్షాలపై దాడి చేయడం ప్రభుత్వానికి అలవాటైంది.

జూనియర్ కళాశాలల వ్యవస్థ మరీ దిన దిన గండంగా మారిపోతున్నది. చివరిసారిగా జూనియర్ లెక్చరర్స్ నియామకం జరిగింది 2008లో మాత్రమే. నాలుగు వందలకు పైగా జూనియర్ కళాశాలలు వుంటే 5 వేలకు పైగా లెక్చరర్స్ ఉండాల్సిన చోట ఇవ్వాళ ఎనిమిది వందల లోపే శాశ్వత ఉద్యోగులున్నారు. 130కి పైగా డిగ్రీ కాలేజీలుంటే 2,576 పోస్టులు ఖాళీగా ఉన్నాయి. యూనివర్శిటీల అధ్యాపకుల కొరత అయితే అంతకంటే తీవ్రంగా ఉన్నది. 4,161 అధ్యాపక పోస్టులు ఉండాల్సిన వివిధ విశ్వవిద్యాలయాల్లో కేవలం 2,117 మాత్రమే పనిచేస్తున్నారు. ఇదిగో అదిగో అంటున్నారే కానీ ఒక్క పోస్టును కూడా ఏ యూనివర్శిటీలో ఇప్పటికీ భర్తీ చేయలేదు. వివిధ ప్రభుత్వ రంగం సంస్థలు, కార్పొరేషన్‌లలో 50వేలకు పైగా ఖాళీలున్నాయి.

తెలంగాణ రాష్ట్రంలో కాంట్రాక్టు ఉద్యోగి అనే పదమే వినపడొద్దన్న ముఖ్యమంత్రి ఒక్క కాంట్రాక్టు ఉద్యోగిని కూడా న్యాయ సంబంధ సమస్యలు తలెత్తకుండా రెగ్యులరైజ్ చేయలేకపోయారు. న్యాయ సంబంధ చిక్కుల్ని ఎదుర్కోవాల్సిన బాధ్యత తనది కాదన్నట్టుగా వ్యవహరిస్తున్నది ప్రభుత్వం. మూతబడిన కంపెనీలను తిరిగి తెరిపించి బజారున పడ్డ కార్మికులను ఆదుకుంటామని చెప్పిన ప్రభుత్వం చేసింది శూన్యం. ఇంటికో ఉద్యోగం ఏమో కాని వాడకో ఉద్యోగం కూడా రాని పరిస్థితి. అనేక ప్రైవేటు పాఠశాలలు, కాలేజీలు, విద్యాలయాలు ప్రత్యేకించి ఇంజనీరింగ్ కాలేజీలు మూతపడడంతో వేలాది మంది రోడ్డున పడ్డారు.

ఉద్యోగాల నియామకం పెద్దఎత్తున జరగాలని, ఉద్యోగ భర్తీ క్యాలెండర్ ప్రకటించాలని తెలంగాణ జెఏసి ఆధ్వర్యంలో ఆందోళనకు దిగిన యువతరంపై ఉక్కుపాదం మోపింది ప్రభుత్వం. సభలకు అనుమతులివ్వకుండా నానా నిర్బంధాన్ని ప్రయోగించింది. ఉద్యోగం వస్తుందో రాదో కానీ కనీసం మాకు ఉపాధి మార్గం చూపెట్టండి ప్రభో అని ప్రజాస్వామికంగా మొరపెట్టుకునే, నిరసించే హక్కును నులిమేసింది 'ఉద్యమ పార్టీ' ప్రభుత్వం. ఈలోగా కొత్త జిల్లాల నాటకానికి తెరలేపి కొత్తగా ఏర్పాటయ్యే జిల్లాల్లో ఉపాధి, ఉద్యోగ అవకాశాలు మెండుగా ఉంటాయని ఊదరగొట్టింది ప్రభుత్వం. కొత్తవేమో గాని ఉన్న ఉద్యోగులపై పని భారం రెట్టింపయింది. కలెక్టర్లు, ఎస్పీలు, పై స్థాయి అధికారులు పెరిగారు తప్ప కొత్త జిల్లాల ఏర్పాటుతో ఉద్యోగ అవకాశాలు ఏమాత్రం పెరగలేదు.

ప్రతి విషయంలో గత ప్రభుత్వాలను నిందించే ఈ ప్రభుత్వం ఉద్యోగాల విషయంలో ఏం చెపుతోంది? 60 సంవత్సరాల్లో చేయలేనిది నాలుగేండ్లలో ఎలా చేస్తామని ప్రశ్నించే వారు మీరు భర్తీ చేస్తామన్న ఉద్యోగాలన్నా భర్తీ చేయడానికి ఏమి అడ్డంకులున్నాయో చెప్పాలి? రాజకీయ నిరుద్యోగులకు, పదవీ విరమణ చేసిన ఉన్నతోద్యోగులకు సలహాదారుల ఉద్యోగులుగా, కార్పొరేషన్ అధ్యక్షులుగా నియమిస్తారు. పార్టీలో పదవుల కోసం పెరుగుతున్న పోటీని, కొత్త వారిని పార్టీలోకి అకట్టుకునేందుకు ఎంఎల్ఏ, ఎంఎల్‌సి సీట్ల పెంపుకోసం తెగ ఆరాట పడిపోతున్నారు. జీవితాన్ని నిలబెట్టే చిన్న ఉద్యోగం ఇచ్చేందుకు మాత్రం ఆసక్తి చూపడం లేదు ప్రభుత్వం. ప్రజా ప్రయోజనాలు ఏమాత్రంలేని కార్పొరేషన్స్‌కి రాజకీయ నిరుద్యోగులను నియమిస్తూ, రిటైర్ అయిన ఉన్నతోద్యోగులను సలహాదారులగా పెట్టుకుంటూ కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని దుర్వినియోగ పరుస్తున్నదే గాని జీవన ప్రమాణాలు పెంచడానికి, భద్రంగా బ్రతడానికి కావాల్సిన ప్రజల ఉపాధిని విస్మరిస్తున్నది ప్రభుత్వం. జాతీయ ఉపాధి హామీ పథకం పనిదినాలను తగ్గించడం, వ్యవసాయ రంగం సంక్షోభం, గ్యారంటీ లేని సేవా రంగంవల్ల జన జీవితం ప్రధానంగా విద్యార్థి లోకం భయానక అనుభవాలకు గురవుతున్నది. వయస్సు మీరుతున్నా ఉద్యోగం దొరకక వయోవృద్ధులైన తల్లిదండ్రుల పోషణ చూడలేక బలవన్మరణాల బాట పడుతున్నది నిరుద్యోగ సమూహం.

ఈ రాష్ట్ర ప్రభుత్వానికి ఒక యువజన విధానం అంటూ ఏమీ లేదు. ఆయా సందర్భాల్లో ఆడంబరపు ప్రకటనలు తప్ప ఆచరణలో చేసింది శూన్యం. రాష్ట్రంలో 60 లక్షలకు పైగా యువతీయువకులున్నారు. వీరిలో నైపుణ్యం ఉన్నవారు, కొద్దిమేర నైపుణ్యం ఉన్నవారు, నైపుణ్యం లేనివారిగా విభజింపబడి ఉన్నారు. వారి నైపుణ్యాలు పెంచే ప్రయత్నం కానీ, వారి వారి నైపుణ్యాలకు తగ్గట్టు ఉపాధి కల్పించే కృషి ఏదీ ప్రభుత్వం వైపు నుండి జరగడం లేదు. స్టార్టప్‌లు, ఇంక్యుబేషన్ సెంటర్‌లు, ఇండస్ట్రియల్ క్యారిడార్, సులభతరం చేయబడిన పారిశ్రామిక విధానాలతో గడిచిన నాలుగు సంవత్సరాల్లో ఎన్ని కొత్త కంపెనీలు ఏర్పాటయ్యాయి, ఎంత మందికి ప్రత్యేకించి తెలంగాణ యువతకు ఉపాధి కల్పించారనే లెక్కలేవి ప్రభుత్వం చెప్పడం లేదు. మాట్లాడితే ఆపిల్, గూగుల్, ఫేస్‌బుక్ లాంటి పెద్ద సంస్థలు వచ్చేస్తున్నాయి, ఉద్యోగాలు ఇచ్చేస్తున్నాయి అని పలికిన ప్రభుత్వ పెద్దలు నికరంగా వచ్చిన ఉద్యోగాలెన్నో చెప్పాలి. సాఫ్ట్‌వేర్ కంపెనీలు, కంప్యూటర్ ఆధారిత సేవారంగాల్లో విదేశీ కంపెనీలు తెలంగాణ యువతకు మాత్రమే ఉద్యోగాలిస్తాయనే గ్యారంటీ ఏమీ లేదు కదా! మరి ఆయా సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాలన్నీ ఆరంభ శూరత్వమేనా, ఆచరణలో ఏమైనా ప్రగతి ఉందా అంటే ప్రభుత్వం దగ్గర ఏమి సమాధానం ఉందో మరి.

ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్‌లో మనమే టాప్ అని చంకలు గుద్దుకునే పాలకులు ఉపాధి ఉద్యోగాలివ్వండలో మనమే నెంబర్ వన్ అని చెప్పుకోగలరా? ప్రతి సంవత్సరం 60 వేల ఇంజనీరింగ్ విద్యార్థులు కాలేజీల నుండి బయటికి వస్తున్నారు. వారిలో కనీసం ఆరు వేల మందికైనా ఉద్యోగం దొరికే అవకాశాలే లేవు. గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన వారిలో 20 లక్షల మంది నిరుద్యోగంతో సతమతమవుతున్నారు. ఈ రాష్ట్రంలో ఒక్క ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్స్‌లోనే 40 శాతానికిపైగా నిరుద్యోగం ఉన్నది. గ్రాడ్యుయేట్స్‌లో అత్యధిక నిరుద్యోగం ఉన్న రాష్ట్రాల్లో తెలంగాణాయే నెంబర్‌వన్. అత్యున్నత విద్యార్హతలు ఉన్నవారు సైతం విఆర్‌వో, పోలీస్ కానిస్టేబుల్ లాంటి ఉద్యోగాలకు తీవ్రంగా పోటీపడుతున్నారంటే నిరుద్యోగ తీవ్రత ఏమిటో అర్థం చేసుకోవచ్చు. ఉపాధి, ఉద్యోగాలు కల్పించలేని ప్రభుత్వం రాష్ట్రాన్ని బంగారు తెలంగాణగా ఏలా మారుస్తదో మరీ?

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ కాలంలోనైనా కనీసం ఉద్యమాన్ని నీరుగార్చేందుకన్నా ఆనాటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియామకాలు చేసేందుకు కొంత ప్రయత్నం చేసింది. అవిభజిత రాష్ట్రంలో ఉద్యోగ

# వరాల జల్లులో 'తడుస్తున్న' ఉద్యోగులు

***టిఆర్ఎస్ ప్రభుత్వం ప్రభుత్వ ఉద్యోగులను బెదిరించి తన దారికి తెచ్చుకునే ప్రయత్నాన్ని ఉద్యోగులు ప్రశ్నించకపోవడం, మౌనం వహించడం అంటే అది ప్రజాసంక్షేమాన్ని పట్టించుకోకపోవడమేనని అంటున్నారు కె. ప్రభాకర్***

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం చాలాకాలం తర్వాత ఉద్యోగ ఉపాధ్యాయ సమస్యల పట్ల సుదీర్ఘంగా చర్చించి, అనేక అంశాల మీద ఉద్యోగ ఉపాధ్యాయులకు హామీ ఇచ్చిన ముఖ్యమంత్రిగారి పత్రికా విలేఖరుల సమావేశం చూశాక, ఇంకా ఉద్యోగులకు ఏం తక్కువైంది? ఎందుకు వీళ్లు అనవసరంగా ఆందోళనకు పూనుకుంటారనిపిస్తుంది సామాన్య ప్రజానీకానికి.

'కడుపునిండా పిఆర్‌సి, చేతినిండా పని' ఉద్యోగుల ఫ్రెండ్లీ ప్రభుత్వంగా పేరు తేచ్చుకున్న రాష్ట్ర ప్రభుత్వం వివిధ ఉద్యోగ ఉపాధ్యాయ, అధికార ఎంఎల్‌సి వర్గాలు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసేంత సులభంగా సమస్యలు పరిష్కారమైనట్లు స్వీట్లు పంచుకోవడాలు, పుష్పగుచ్ఛాలు అందించుకోవడాలతో అందరికీ 'ఇంకేం' కావాలి ఉద్యోగ ఉపాధ్యాయులకు గతంలో 43 శాతం ఫిట్‌మెంట్ ఇచ్చింది. ఇప్పుడు జూన్ 2కే పిఆర్‌సి (తెలంగాణ ఆవిర్భావానికే) కమిటీ, ఐఆర్ ప్రకటించే హామీలు వచ్చాక నిజంగానే ఉద్యోగ ఉపాధ్యాయ వర్గం పత్రికలు రాస్తున్నట్లు వరాల జల్లులో తడిసిపోతున్నది.

తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావానంతరం స్వయంగా ముఖ్యమంత్రిగారే మొదట్లో ఇచ్చిన హామీలు ఒక్క పిఆర్‌సి తప్ప, ఉద్యోగ ఉపాధ్యాయ కార్మిక వర్గాల సమస్యలేవీ పరిష్కరించకపోగా అవి తీవ్రరూపం దాల్చి, కింది స్థాయి ఉద్యోగుల నుండి వస్తున్న ఒత్తిడి వల్ల ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు సమరభేరీలు, జన జాతరలు నిర్వహించి ప్రభుత్వం మీద ఒత్తిడి చేయక తప్పని స్థితి ప్రభుత్వం, అధికార వర్గం కల్పించింది.

అందులో అతి ప్రాముఖ్యతను, తీవ్రతను సంతరించుకున్న సమస్య కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గత కొంత కాలంగా అనుసరిస్తున్న ప్రపంచీకరణ, సరళీకరణ విధానాల అంతిమ ఫలం సిపిఎస్ విధానం.

'కంట్రిభ్యూటరీ పెన్షన్ విధానం' అనే కొత్త విధానం గత పాలకులు అంగీకరించి ప్రస్తుత పాలకులు కొనసాగిస్తున్న ప్రపంచ బ్యాంకు షరతుల్లో భాగమైన ఉద్యోగ వర్గాల కుదింపు కాంట్రాక్ట్ ఔట్ సోర్సింగ్ విధానాలతో పాటు, ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాల భద్రతకు తీవ్ర విఘాతం కలిగించే 'పాత పెన్షన్ విధానం' రద్దు చేయడం, దానికి కొనసాగింపుగా 2004 నుండి నియామకమైన ఉద్యోగ ఉపాధ్యాయుల రిటైర్‌మెంట్‌కు 'ఉరి'గా సిపిఎస్ విధానం అమలౌతుంది. అనేక సుదీర్ఘ సమరశీల పోరాటాలతో పాటు వేలాది మంది విద్యార్థి అమరుల త్యాగాలతో ఏర్పడిన తెలంగాణలో నిరుద్యోగ, ఉద్యోగ ఆకాంక్షలతో పాటు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలకు 'మన రాష్ట్ర పాలన'లో చరమగీతం పాడొచ్చనుకున్నాం. ఆయా సందర్భాల్లో ఒక రచయితగా, తెలంగాణ ఉద్యమ కార్యకర్తగా అనేక వేదికల మీద తెలంగాణ ఏర్పడితే వచ్చే ప్రభుత్వంలో ఇలాంటి ఉద్యోగ ఉపాధ్యాయ, కార్మిక వ్యతిరేక విధానాలు అమలు కావని మాట్లాడిన సందర్భాలు అనేకం.

కాని ఇవ్వాళ మన ప్రభుత్వ (ఫ్రెండ్లీ) కనీసం ఉద్యోగ, నిరుద్యోగ ఉపాధ్యాయుల డిమాండ్ల మీద ఆందోళన చేయడానికి కనీసం ఇందిరా పార్క్ ధర్నాచౌక్‌ను రద్దు చేయడమే కాకుండా, గతంలో ఎన్నడూ లేని విధంగా సిపిఎస్ రద్దుకోసం ఉద్యమిస్తున్న లక్షా ముప్పైవేల మందిని,

---

నియామకాల్లో తెలంగాణకు అన్యాయం జరిగిందనేది చారిత్రిక సత్యమే అయినప్పటికీ ప్రత్యేక రాష్ట్రంలో అయితే అంతకంటే అన్యాయానికి విద్యార్థి యువతరం గురైందనేది వర్తమాన సత్యం. రాష్ట్రంలో అనేక ప్రాంతాలతో పాటు ప్రత్యేక రాష్ట్ర విద్యార్థి ఉద్యమానికి కేంద్రమైన ఉస్మానియా యూనివర్శిటీలో కూడా విద్యార్థులు ఉపాధి, ఉద్యోగాలు రాక భవిష్యత్తుపై భరోసా లేక మళ్లీ బలిదానాలు చేసుకుంటున్నారు.

కార్పొరేట్ సంస్థలకు, బడా కంపెనీలకు ప్రజల సమిష్టి సంపద అయిన సహజ వనరులను ప్రత్యేకించి భూమి, నీటి వనరులను మౌళిక సదుపాయాల కల్పన పేరుతో ధారాదత్తం చేస్తున్న ప్రభుత్వం వేల ఎకరాల్లో భూమిని అప్పగించి వందల సంఖ్యలో కూడా ఉద్యోగాలను కల్పించలేక పోతున్నది. ఇవాల వంద కోట్ల రాయితీలను పొంది వెయ్యి కోట్ల ఉపాధిని అందివ్వగలిగితే ఆలోచించవచ్చుగాని వెయ్యి కోట్ల ప్రయోజనాలు పొంది వంద కోట్ల ఉపాధిని కూడా ప్రైవేటు పారిశ్రామిక సంస్థలు కల్పించలేక పోతున్నవి. ఆ దేశం ఈ దేశం తిరిగి అక్కడో ఒప్పందం ఇక్కడో ఒప్పందం కుదుర్చుకున్నామని ప్రచార ఆర్భాటాలు తప్ప నికరంగా లభించిన ఉద్యోగాలెన్నో ప్రభుత్వ పెద్దలే సెలవివ్వాలి.

రాష్ట్రంలో దేశమంతటా జరుగుతున్నట్టే ఉపాధిరహిత వృద్ధి నమోదవుతున్నది. పేదరికం తగ్గుదల ఏమోకానీ అసమానతలు, అంతరాలు మరింతగా పెరుగుతున్నాయి. ప్రతియేటా బిలియనీర్లు పెరుగుతున్నారని చెప్పడమే తప్ప ఎన్ని కోట్ల మందికి భద్రమైన ఉపాధి, ఉద్యోగం దొరుకుతుందో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చెప్పలేక చేతులెత్తేస్తున్నాయి. ప్రపంచ బ్యాంక్ గతంలోనే నిర్దేశించినట్టు వ్యవస్థీకృత సర్దుబాట్ల పేరుతో ఉన్న ఉద్యోగాలను కుదించి వేయడం, నియామకాలను నిలిపివేయడమనేది తెలంగాణలో కూడా జరుగుతున్నది. అంతకు ముందున్న అభివృద్ధి నమూనాయే అమలవుతున్నప్పుడు ఉపాధి, ఉద్యోగాల సంఖ్య పెరిగే అవకాశమెలా ఉంటుంది?

అభివృద్ధి జరగడం, అభివృద్ధిలో అందరికీ వాటా పొందడమనేది ప్రజాస్వామిక సామాజిక తెలంగాణలో మాత్రమే సాధ్యమవుతుంది. అయితే ప్రజా తెలంగాణ కోసం సమస్యలున్నవారు సంఘాలు పెట్టి, ఉద్యోగాలు లేనివారు ఉద్యమాలు చేయడం మినహా మరో మార్గం లేదు.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

వాళ్లకు మద్దతిచ్చిన మాలాంటి వాళ్లను కూడా గొంతు విప్పకుండా 'హౌజ్ అరెస్ట్'లు చేయడం ఊహించని పరిణామం. మరొకవైపు టిజెఏసి లాంటి నిరుద్యోగ గర్జనల మీద నిర్బంధాన్ని కొనసాగిస్తూ నాలుగేళ్ల కాలం వెళ్లదీసింది.

ప్రస్తుతం మళ్లీ 'ఎన్నికల వేళ' ఉద్యోగ వర్గాలు కూడా తాడోపేడో తేల్చుకోవాలన్న తెగింపు వల్ల గత కొంత కాలంగా నలుగుతున్న సమస్యలు పలు దఫాలుగా మంత్రుల కమిటీ, ముఖ్యమంత్రి సమక్షంలో మే 16న ఐదారు గంటల చర్చల అనంతరం కొన్ని సమస్యలకు పరిష్కారాలు ప్రకటిస్తూ ఉద్యోగ ఉపాధ్యాయ సంఘాలు, ఎంఎల్‌సిలు, మంత్రుల సమక్షంలో ముఖ్యమంత్రిగారు ఉద్యోగుల పట్ల ఆయన వ్యక్తం చేసిన సానుకూలతను అభినందించవలసిందే. అనుకున్న సమయానికి పిఆర్‌సి ప్రకటించడానికి, ఐఆర్ ఇవ్వడానికి అంగీకరించినందుకు ముఖ్యమంత్రి గారిని అభినందించాల్సిందే కాని, అది మౌలికమైన అంశాల పట్ల సిపిఎస్, ఆర్‌టిసి ఉద్యోగుల డిమాండ్స్ పట్ల ప్రభుత్వ వైఖరి ఆందోళన కలిగించేదిగా, నర్మగర్భితంగా గత పాలకులు కొనసాగించిన విధానాలనే మేమూ కొనసాగిస్తాం. సమ్మె చేసుకుంటారా? చేసుకోమనండి. బెదిరిస్తారా? అంటూనే ఉద్యోగ వర్గాలకు 'బెదిరింపు'ను జారీ చేసింది.

ఇవ్వాళ ఆర్‌టిసి ఉద్యోగులను బెదిరించడం, బెదిరించే సందర్భంలో ఈ రాష్ట్ర ఆవిర్భావానికి క్రియాశీలక పాత్ర నిర్వహించిన ఉద్యోగ ఉపాధ్యాయుల, మంత్రుల కమిటీ ముందే పత్రికా విలేఖరుల సమావేశంలో ఇంకేం కావాలి? దేశంలోనే ఎన్నడూ ఎవ్వరూ ఇవ్వని పిఆర్‌సి ఫిట్‌మెంట్‌ను ఆర్‌టిసి ఉద్యోగులకు అందించాం. ఆర్‌టిసికి సుమారు నాలుగు వేల కోట్ల రూపాయలు మెరుగు కోసం సహకరించినా ఆర్‌టిసిని నష్టాల్లో కూర్చారని స్వయాన ముఖ్యమంత్రే 'అసహనం' వ్యక్తం చేయడం, సమ్మె చేస్తామని బెదిరిస్తారా? చేసుకోండి అనడం వెనుక ప్రభుత్వ ఉద్దేశం ఆర్‌టిసి నష్టాలకు కార్మిక వర్గమే కారణమన్నట్లు, యాజమాన్యం, ప్రభుత్వ విధానాలు అసలు కారణమే కాదన్నట్లు కోపాన్ని ప్రదర్శించడం ఇవ్వాల్టికి ఇవ్వాళ ఆర్‌టిసిని నిందిస్తున్నట్లుంది. కాని భవిష్యత్‌లో ఇంత మెరుగైన సౌలభ్యాలు 'పొట్టనిండా తిండి - చేతినిండా పని కల్పించినా' పనిచేయలేని పాఠశాలల్ని, ప్రభుత్వ కార్యాలయాల ఉద్యోగులను బెదిరిస్తున్నట్లు కనిపిస్తున్నది. కాని ఫ్రెండ్లీ ప్రభుత్వపు వరాల జల్లులో తడిసిన ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాలకు ప్రభుత్వ వైఖరి కనీసం చురకలాగా అనిపించకపోవడం ఆశ్చర్యాన్ని, ఆవేదనని, భయాన్ని కలిపిస్తున్నది.

సిపిఎస్ విధానం చాలా రాష్ట్రాల్లో అమలౌతున్నా, అది అనవసరమని ఉద్యోగ వర్గాలకు అది ఉరిలాగా మారకుండా ఉండాలనుకుంటే సిపిఎస్ నుండి ఓపిఎస్ 'పాత పెన్షన్ విధానం'లోకి వెళ్లే అవకాశం రాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్నప్పటికీ, అది కేంద్రం అనుసరిస్తున్న విధానం అంటూ దాటవేయడం నిజానికి ఫ్రెండ్లీ ప్రభుత్వం అనుసరించవలసిన విధానం కాదు. ఇంత తీవ్రమైన ఆందోళనకు గురిచేస్తున్న వందలాది మంది ఉద్యోగులు 'సిపిఎస్' ప్రాణాలు కోల్పోయినా ఈ విధానం పట్ల ప్రభుత్వ వైఖరి మారకపోవడం, ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాలు మౌనం అర్థాంగీకారం అన్నట్లు ఆ విధానాలను అనుసరించడం తప్ప మరో మార్గం లేదని నిమ్మకుండిపోయాయి. కొందరు మాట్లాడాలని ప్రయత్నించినా ఫలితం లేకుండా పోయింది. ఉద్యోగ ఉపాధ్యాయ కార్మిక వర్గాలు ఎదుర్కొంటున్న తీవ్రమైన సమస్యల పట్ల సానుకూలమైన చర్చ, పరిష్కారాలు కొనసాగకుండా, అసలు కార్మికులు, ఉద్యోగులు మౌలికంగా అడగవలసిన అనేక అంశాలు ప్రభుత్వ వైఖరి వల్ల కనుమరుగై పోతున్నాయి.

నిజంగానే ఆర్‌టిసి యాజమాన్యం, ప్రభుత్వానికి సంబంధం లేకుండా కార్మికుల డిమాండ్స్ వల్లనే ఆర్‌టిసి ఇబ్బందుల్లో కూరుకుపోయిందా అనే చర్చ జరగకుండా, కార్మిక వర్గం చెపుతున్న అసలు అంశాలు, కేంద్ర ప్రభుత్వానికి గత నాలుగు సంవత్సరాలుగా చెల్లించిన రు. 1,084 కోట్లు ఎక్సైజ్ శాఖకు, రు. 943 కోట్లు సుమారుగా రాష్ట్రానికి 'వ్యాట్' రూపంలో చెల్లించి, సుమారు గత నాలుగేళ్లుగా డీజిల్ రూపంలో ఆదా చేసిన నాలుగు వేల కోట్ల ఆదాయాలను లెక్కించకుండా, దీనికితోడు విపరీతంగా విచ్చలవిడిగా కొనసాగుతున్న ప్రైవేట్ ట్రావెల్స్ ఆంధ్రా పెట్టుబడి వర్గాల బస్సుల దోపిడీని నియంత్రించకపోవడం ఎవరి తప్పు. రోజుకు నాలుగు కోట్ల రూపాయలు పన్నుల రూపంలో పొందుతున్నా ప్రభుత్వం అసలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పెంచుతున్న టాక్సీలు, చెల్లించవలసిన రీయింబర్స్‌మెంటులతో పాటు, పెరుగుతున్న డీజిల్ రేట్లతో పాటు, అసలు అంశాలను చర్చించకుండా కార్మిక వర్గాన్ని, ఆర్‌టిసిని నష్టాల పేరిట కార్మిక వర్గాన్ని బలిపెట్టడం తప్ప మరొకటి కాదు.

అట్లాంటిదే సిపిఎస్ విధానం. ఇది ఇవ్వాళ కేవలం ఒక లక్షా ముప్పై వేల మంది ఉద్యోగులకు సంబంధించిన అంశంగా కాకుండా భవిష్యత్‌లో ఉద్యోగ వర్గం కోల్పోతున్న 'భద్రత'తో పాటు ప్రైవేటీకరణ, ప్రపంచ బ్యాంకు విధానాలకు 'రాచమార్గం' అని గుర్తించవలసి ఉంది. ఈ విధానాలు తెలంగాణలో కొనసాగించకుండా ప్రభుత్వాల మీద ఒత్తిడి పెంచడంతో పాటు, ఉద్యోగ వర్గాలు క్రియాశీలక పోరాటాలు నిర్వహించవలసిన కర్తవ్యాన్ని కొనసాగించాలి. అదే కోవలో ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాలు అడగవలసిన అనేక అంశాలు ఈ సందర్భంగా అట్లాగే మిగిలిపోయినవి అనడానికి, ఉద్యోగ సంఘాలు ఇంతకు మించి ఏమీ చేయలేవనే, సర్దుకుపోయే ధోరణి కాని లేదా ఎన్నికల సందర్భంగా సాధించవలసిన తాత్కాలిక సమస్యల పట్ల వేచిచూసే ధోరణి అయినా కావచ్చు. ఇదే సందర్భంగా సాధ్య సాధ్యాలు ఊహిస్తూనే ఎన్నికలు సమీపిస్తున్న సందర్భంలో గతంలో ప్రభుత్వం హామీపడ్డ డిమాండ్స్‌తో పాటు, భవిష్యత్‌లో నిర్ణయం తీసుకోవాల్సిన, అనుసరించాల్సిన విధానాల పట్ల దృష్టి పెట్టవలసి ఉంది.

చాలా సాహసోపేతమైన నిర్ణయంగా చెప్పుకుంటున్న జిల్లాల విభజన అనంతరం పెరిగిన పనిభారంతో పాటు సరిపడ సిబ్బందిలేక కార్యాలయాలు ఖాళీగా బోసిపోతున్నవి. మరొకవైపు లక్షలాది నిరుద్యోగులు అనుకున్న మేరకు ఖాళీల భర్తీ ప్రక్రియ ఊపందుకోక పోవడం వల్ల తీవ్ర నిరాశా నిస్పృహలతో ఆత్మహత్యల బాట పట్టడం చూస్తున్నాం. కనుక ఖాళీలను భర్తీ చేయాలని ఉద్యోగ సంఘాలు డిమాండ్ చేయవలసి ఉంది. అట్లాగే విద్యా రంగంలో గత కొంత కాలంగా 'స్నేక్ అండ్ ల్యాడల్' గేమ్ లాగా కొనసాగుతున్న 'కామన్ సర్వీస్ రుల్స్'తో పాటు, వేలాది ఖాళీల భర్తీ, ప్రమోషన్లు, కెజి టు పిజిలో అందరికి సమాన విద్యా అవకాశాల గూర్చి చర్చించలేకపోవడం విద్యా రంగాన్ని నిర్వీర్య పరుస్తున్నది.

నిర్విరామంగా కొనసాగుతున్న కాంట్రాక్ట్, ఔట్ సోర్సింగ్ విధానాల పట్ల కార్మిక వ్యతిరేక, విద్యా, వైద్య తదితర రంగాల్లో రాజ్యమేలుతున్న ప్రైవేటీకరణ విధానాలను నిలువరించే ప్రయత్నం చేయకుంటే ఎన్నికలు సమీపిస్తున్న సందర్భాల్లో పార్టీల ముందు ఒక ప్రధాన ఎజెండాగా విద్య, వైద్య, ఉద్యోగ, కార్మిక, నిరుద్యోగ అంశాలను అడగకుండా భవిష్యత్‌లో ఉద్యోగ వర్గం, ప్రజా సంక్షేమం కనుమరుగవ్వడానికి అన్ని వర్గాల మౌనం మార్గం సుగమం చేస్తుందని మరవకూడదు. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# ప్రభుత్వాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

***ప్రజా ఉద్యమ ఫలితంగా ఏర్పడిన ప్రభుత్వాన్ని ప్రజా ప్రభుత్వంగా ప్రచారం చేస్తున్న బుద్ధిజీవుల వాదనలను ఖండిస్తూ, వర్గ సమాజంలో ప్రభుత్వ స్వభావం గురించి వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

తెలంగాణ ప్రజల చిరకాల వాంఛ అయిన ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తర్వాత, ఉద్యమంలో ప్రధాన భాగస్వామిగా ఉన్న రాజకీయ పార్టీ ఎన్నికల్లో గెలిచి ప్రభుత్వం ఏర్పరచింది. తర్వాత సాగిన నాలుగు సంవత్సరాల పాలన తెలంగాణ ప్రజల ఆకాంక్షలనూ, ఉద్యమంలో వ్యక్తమైన ఆకాంక్షలనూ నెరవేర్చే దిశగా ప్రయాణించడం లేదనే అభిప్రాయం క్రమక్రమంగా బలపడుతూ వస్తున్నది. ఈ అసంతృప్తిని విభిన్న ప్రజా సమూహాలు ఎన్నో సందర్భాలలో వ్యక్తం చేస్తున్నాయి. మరొకపక్క, ఉద్యమంలో పాల్గొని ప్రస్తుతం అధికారం నెరపుతున్న శక్తులు, ఉద్యమంలో పాల్గొనకుండానే, ఉద్యమాన్ని తీవ్రంగా వ్యతిరేకించి కూడ ప్రస్తుతం అధికారంలోకి దూరిన శక్తులు తెలంగాణ పాలన సజావుగా ఉన్నదని, బంగారు తెలంగాణ దిశగా ప్రయాణిస్తున్నదని భావిస్తున్నారు. ఈ ప్రభుత్వం ప్రజా ఉద్యమ ఫలితంగా ఏర్పడింది గనుక, ఈ ప్రభుత్వాన్ని నడుపుతున్న రాజకీయ పార్టీ ఆ ఉద్యమంలో ప్రధానస్థానం వహించింది గనుక ఈ ప్రభుత్వం ప్రజా ప్రభుత్వమేనంటున్నారు.

ఈ రెండు చివరల అభిప్రాయాల మధ్య 'కొంత బాగుంది, కొంత బాగులేదు', 'దశాబ్దాల పాటు జరిగిన అన్యాయాన్ని రాత్రికి రాత్రి సరిచేయ గలమా', 'తప్పులు జరుగుతున్నాయి గాని అందుకు కారణం ఉమ్మడిరాష్ట్ర పాలకుల చరిత్రే', 'ఇప్పుడే పుట్టిన శిశువు మీద అభాండాలా, ఇంకా వేచిచూద్దాం' లాంటి అనేక మధ్యంతర అభిప్రాయాలు కూడ ఉన్నాయి.

ఈ భిన్నాభిప్రాయాల వైవిధ్యం సాధారణ ప్రజానీకంలో మాత్రమే కాక ఆలోచనాపరులలో, బుద్ధిజీవులలో కూడ వినబడుతున్నది. పైగా ఆ ఆలోచనాపరులలో, బుద్ధిజీవులలో చాలమంది అంతకుముందు ఉద్యమకాలంలో విప్లవకారులుగా, విప్లవోద్యమ సానుభూతిపరులుగా, ప్రజాభిప్రాయాన్ని రూపుదిద్దగల మేధావులుగా, కవులుగా, కళాకారులుగా ఉన్నవారే. బుద్ధిజీవులు ఎప్పుడూ ప్రభుత్వపక్షాన ఉండగూడదని, ప్రతిపక్షంగా, ప్రజాపక్షంగా మాత్రమే ఉండాలని అన్నవారే. కాని, వారే ఇప్పుడు కొత్త సిద్ధాంతాలు తయారుచేస్తూ, ఈ ప్రభుత్వమే ప్రజా ప్రభుత్వమని, అందువల్ల ప్రజాపక్షం వహించడానికీ ప్రభుత్వపక్షం వహించడానికీ తేడా లేదని అంటున్నారు.

ఈ స్పష్టమైన ప్రభుత్వానుకూల అభిప్రాయాలు, తటస్థత పేరుతో చలామణీ అవుతున్న ప్రభుత్వానుకూల అభిప్రాయాలు ఎక్కువ ప్రాచుర్యాన్నే పొందుతున్నాయి. ప్రచారసాధనాలన్నీ కూడ ప్రయోజనాల కోసమో, నయానో భయానో ప్రభుత్వానుకూలంగా ఉన్నాయి గనుక ప్రభుత్వానుకూల అభిప్రాయాలే విస్తృతంగా ఉన్నాయేమోననే అభిప్రాయం కూడ బలపడుతున్నది. సమాజంలో పాలకవర్గ భావాలే ప్రబలమైన భావాలుగా చలామణీ అవుతుంటాయని మార్క్స్ అన్నమాట మరొకసారి రుజువవుతున్నది.

ఈ నేపథ్యంలో తెలంగాణ ప్రభుత్వాన్ని ప్రజా ప్రభుత్వం అనవచ్చునా లేదా తెలుసుకోవడానికి, అసలు ప్రభుత్వం అంటే ఏమిటి, ప్రజలంటే ఎవరు, ఒక ప్రభుత్వాన్ని ప్రజా ప్రభుత్వమని అనడానికి అవసరమైన ఆధారాలేమిటి, వర్తమాన భారత రాజకీయాలలో ఒకానొక రాష్ట్ర ప్రభుత్వం ప్రజా ప్రభుత్వం అయ్యే అవకాశం ఉందా వంటి మౌలిక విషయాల్ని చర్చించవలసి ఉంది. కొందరు బుద్ధిజీవులు తమ తాత్కాలిక, శాశ్వత ప్రయోజనాల కోసమో, తప్పుడు చైతన్యం వల్లనో, భ్రమల వల్లనో, అపోహల వల్లనో ప్రచారం చేస్తున్న అభిప్రాయాల వెనుక సారాంశాన్ని అర్థం చేసుకోవలసి ఉంది.

ప్రభుత్వం అనేది రాజ్యాంగయంత్రంలోని అసంఖ్యాక సాధనాలలో ఒకానొకటి మాత్రమే. పాలన నెరపే ప్రత్యక్ష సాధనంగా ప్రభుత్వం ఎక్కువ కనబడుతుంది. ప్రభుత్వంలో కూడ ఇతర విభాగాల కన్న పోలీసు విభాగం ఎక్కువ కనబడుతుంది. పోలీసులు మాత్రమే ప్రభుత్వం అనిపిస్తుంది. అందుకే బ్రిటిష్ పాలన పోయి కాంగ్రెస్ పాలన వస్తుందంటే హెడ్ కనిష్టీబు బదిలీ అవుతాడా అని జట్కావాలా అడుగుతాడని కన్యాశుల్కంలో గురజాడ అప్పారావు రాశారు! అలా ప్రత్యేకంగా పోలీసులకు, మొత్తంగా ప్రభుత్వానికి ఎక్కువ దృశ్యనీయత, ప్రచారం, ప్రభావం ఉంటాయి గాని, మొత్తంగా రాజ్యాంగ యంత్రంలో చట్టాలు, న్యాయవ్యవస్థ, నియంత్రణా వ్యవస్థలు, చెరసాలలు, సంస్కృతీ సాధనాలు వంటి ఎన్నో అంశాలు ఉంటాయి. వర్గ సమాజంలో రాజ్యాంగయంత్రపు ఏకైక లక్ష్యం ఆస్తి పరిరక్షణే. అంటే పాలకవర్గాల ప్రయోజనాల రక్షణే రాజ్యాంగయంత్రం పని. ప్రభుత్వం పని కూడ అదే. ఈ రాజ్యాంగ యంత్రంలో మిగిలిన సాధనాలన్నీ యథాతథంగా ఉండి, గతంలో పరిరక్షించిన ఆస్తి ప్రయోజనాలనే పరిరక్షిస్తూ, కేవలం ప్రభుత్వ నిర్వాహకులు మారినంత మాత్రాన పాలనలో, సమాజ నిర్వహణలో ఏ మార్పులూ రావు. అందువల్ల రాజ్యం గురించి మాట్లాడకుండా ప్రభుత్వంలో మార్పు గురించి మాట్లాడితే ఏ ప్రయోజనమూ లేదు.

ప్రభుత్వం రాజ్యం చేతిలోని, స్పష్టంగా చెప్పాలంటే పాలకవర్గాల చేతుల్లోని ఒకానొక సాధనం మాత్రమే గనుక అసలు రాజ్యం ఎలా ఏర్పడిందో అర్థం చేసుకోవాలి. ఆధునిక రాజ్యపు ఒకానొక సాధనంగా ప్రభుత్వం ఎలా ఆవిర్భవించి, కొంత స్వతంత్ర ప్రతిపత్తిని ప్రదర్శిస్తూ, దాన్ని చేపడితే సమస్తమూ మార్చవచ్చుననే భ్రమలను ఎలా కల్పిస్తున్నదో చూడాలి.

ప్రభుత్వం రాజ్యంలో భాగమేనని గుర్తించకపోవడం, ప్రభుత్వం గురించి అనవసరమైన భ్రమలు సాధారణ ప్రజల్లో మాత్రమేకాక, విద్యావంతుల్లో, బుద్ధిజీవుల్లో, చివరికి తమను తాము మార్క్సిస్టులుగా భావించుకునే వారిలో కూడ ఉన్నాయి గనుక ఈ అంశాన్ని నిశితంగా పరిశీలించాలి. కేవలం ప్రభుత్వాన్ని మార్చగలిగే ఎన్నికల ద్వారా రాజ్యాన్ని మార్చగలమనే తప్పుడు నమ్మకాన్ని కలిగిస్తున్న పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీల ప్రభావం ఉన్న భారత సమాజంలో ఈ చర్చ ఇంకా ఎక్కువ అవసరం. వ్యవస్థ మారకుండానే ప్రభుత్వాన్ని మార్చడం ద్వారా ప్రజల జీవితాలను, భవిష్యత్తును మార్చగలమని, ప్రభుత్వాన్ని మార్చడానికి ఎన్నికలు ఒక మార్గమని ప్రచారం చేస్తున్నవారు అమాయకులైనా కావాలి, లేదా ఉద్దేశపూర్వకంగా తమ ప్రయోజనాల కోసం అబద్ధాలైనా చెపుతూ ఉండాలి.

వర్గసమాజంలో, అంటే సమాజానికి అత్యవసరమైన ఉత్పత్తి సాధనాలకు యజమానులైన వర్గమూ, ఆ ఉత్పత్తి సాధనాలను ఉపయోగించి సమాజానికి ఉపయోగకరమైన శ్రమ చేస్తూ, కనీస శ్రమ ఫలితం కూడ దక్కని వర్గమూ ప్రధానంగా ఉన్న సమాజంలో, భిన్న వర్గాల ప్రయోజనాల మధ్య సహజంగానే ఘర్షణ ఉంటుంది. మధ్యంతర వర్గాలు కూడ భౌతికంగానో, భావజాలపరంగానో అటో ఇటో చేరిపోవలసి వస్తుంది. ఈ భిన్నవర్గాల మధ్య తమ తమ ప్రయోజనాల కోసం నిరంతరం సాగే ఘర్షణను అదుపులో ఉంచడానికి, యథాస్థితిని, అంటే పాలకవర్గాల ఆధిపత్యాన్ని కొనసాగించడానికి రాజ్యం పుట్టుకువచ్చింది. యథాస్థితిలో తమ ప్రయోజనాలు దక్కడం లేదని గుర్తించిన పాలితవర్గాలు తిరుగుబాటుకు దిగితే హింస ద్వారా అణచివేయడానికి, హింసా వినియోగపు గుత్తాధిపత్యాన్ని రాజ్యం తనకు తాను ఇచ్చుకుంది.

"గతంలో ఎంతో చులకనగా చూసిన సొంత ఆస్తిని పవిత్రమైనదిగా స్థిరపరచడం మాత్రమే కాదు, ఆ పవిత్రతను కాపాడడమే మానవ సమాజ ప్రధాన గమ్యంగా ప్రకటించాలి. అంతేకాదు, ఆస్తులను సంపాదించేందుకు అవసరమైన నూతన పద్ధతులకూ, సంపదల నిరంతరాభివృద్ధికీ సామాజిక ఆమోదాన్ని కల్పించాలి. సమాజంలో కొత్తగా తలెత్తుతున్న వర్గ విభజననే కాకుండా, ఆస్తిపరుల వర్గం ఆస్తిలేని వర్గాలను దోచుకుని, పాలించే హక్కును కూడ శాశ్వతంగా కొనసాగించే వ్యవస్థ కావాలి. ఆ రకమైన సంస్థగానే రాజ్యం ఉనికిలోకి వచ్చింది" అని ఎంగెల్స్ 'కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుక'లో రాజ్య ఆవిర్భావాన్ని అద్భుతంగా వివరించాడు.

అలా క్రీ.పూ. ఆరో శతాబ్ది ప్రాంతంలో గ్రీకు నగరం ఏథెన్స్ లో ఆవిర్భవించిన రాజ్యం కాలక్రమంలో ఎన్నెన్నో సాధనాలను పోగు చేసుకుంది. బానిస సమాజంలో పుట్టిన రాజ్యం, భూస్వామ్య దశలో నిరంకుశాధిపత్యంగా బలపడి, పెట్టుబడిదారీ దశలో ఆధునికంగా మారి జనాకర్షక విధానాలను తనలో కలుపుకుంది. సార్వత్రిక వోటు హక్కు, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం, అధికారాల విభజన, భావప్రకటనా స్వేచ్ఛ అనే అలంకారాలు దిద్దుకుని తనను తాను తటస్థమైనదానిగా, మధ్యవర్తిగా, ప్రజా ఆకాంక్షలను నెరవేర్చే సంక్షేమ రాజ్యంగా చూపుకోవడానికి ప్రయత్నిస్తున్నది. "కార్మికుల మద్దతు కూడగట్టుకోక తప్పని స్థితివైపు పాలకవర్గాలను సార్వత్రిక వోటు హక్కు నెడుతుంది" అని ఎంగెల్స్ అన్నమాట రాజ్యం కొనసాగింపుకూ సార్వత్రిక వోటు హక్కు వంటి నాటకాలకూ మధ్య సంబంధాన్ని చూపుతుంది.

కాని ఎంత మారినా, ఎన్ని రంగులు అద్దుకున్నా, మౌలికంగా రాజ్యపు సాధనాలన్నిటి లక్ష్యం సొంత ఆస్తిని, వర్గ సమాజాన్ని, ఆధిపత్యవర్గాల పాలనను రక్షించడమే. రాజ్యాలన్నీ కూడ ఈ మౌలిక సూత్రం మీద పనిచేస్తున్నవే. అందుకే మార్క్స్ ఆధునిక రాజ్యపు కార్యనిర్వాహక వర్గమైన ప్రభుత్వాన్ని "సమస్త బూర్జువా వర్గపు ఉమ్మడి వ్యవహారాలను నిర్వహించే బృందం తప్ప మరేమీ కాదు" అన్నాడు.

ఈ నేపథ్యంలో చూసినప్పుడు వర్గ రహిత సమాజంలో తప్ప రాజ్యమూ, రాజ్యాన్ని అంటిపెట్టుకుని ఉండే దుర్మార్గమూ రద్దయిపోవు. ఆ వర్గ రహిత సమాజాన్ని చేరడానికి ముందు, ఇప్పటిదాకా పాలిత వర్గంగా ఉండిన శ్రామికవర్గం తన శక్తి తెలుసుకుని ఆధిపత్య వర్గాల నుంచి రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవలసి ఉంటుంది. ఆధిపత్య వర్గాలు తిరిగి తలెత్తకుండా, కుట్రలకూ కుహకాలకూ పాల్పడకుండా శ్రామిక వర్గ నియంతృత్వ రాజ్యాన్ని అమలు చేయవలసి ఉంటుంది. వందల సంవత్సరాలలో, వేల సంవత్సరాలలో పట్టే ఈ చారిత్రక క్రమం మన ఇష్టాయిష్టాల ప్రకారం హఠాత్తుగా జరిగిపోదు. అందుకు అనుకూలమైన భౌతిక పరిస్థితులు, అంటే ఉత్పత్తి సాధనాల, ఉత్పత్తి శక్తుల పరిణతి ఏర్పడవలసి ఉంటుంది. అనుకూలమైన స్వీయ మానసిక శక్తుల సంసిద్ధత, పోరాటం అవసరమవుతాయి. తమ సంపదను, అధికారాన్ని నిలిపి ఉంచుకోవడానికి పాలకవర్గాలు హింసా దౌర్జన్యాలు ఉపయోగిస్తాయి గనుక ఈ పోరాటం ప్రతిహింసా పోరాటం కాకతప్పదు. పాలకవర్గాలు వందల సంవత్సరాలుగా ప్రజల మెదళ్లలో నింపిన భావజాలం దోపిడీ పీడనల యథాస్థితి సహజమైనదనీ, శాశ్వతమైనదనీ, మారదనీ అనుకునే తప్పుడు చైతన్యాన్ని కలిగించి ఉంటుంది గనుక ప్రజలలో చైతన్యం నింపే సుదీర్ఘ ప్రయత్నం, పోరాటం అవసరమవుతాయి. ఇవేమీ లేకుండా అల్లావుద్దీన్ అద్భుత దీపం లాగ రాత్రికిరాత్రి ప్రజాప్రభుత్వం, ప్రజారాజ్యం ఏర్పడవు. ఇంత సుదీర్ఘ ప్రయత్నం, పోరాటం తర్వాత ఏర్పడిన ప్రభుత్వం కూడ ప్రజాప్రభుత్వంగా, ప్రజారాజ్యంగా మారాలంటే, కొనసాగాలంటే ప్రజల నిరంతర జాగరూకత, చైతన్యం అవసరమవుతాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పాలకవర్గ రాజ్యాధికారాన్ని యథాతథంగా కొనసాగించడానికి వేసుకున్న ఒకానొక ఎత్తుగడ మాత్రమే. ఈ పార్లమెంటరీ ప్రజాస్వామిక ఎన్నికల ద్వారానే ప్రభుత్వాల మార్పు జరుగుతుంది. ప్రభుత్వాల మార్పు అంటే పాలకవర్గాల ముఠాలలోనే ఒక ముఠా నుంచి మరొక ముఠాకు అధికారం మారడమే తప్ప, ప్రజలకు అధికారం రావడం కాదు, రాజ్యం మారడం కాదు.

మరి ప్రజలకు అధికారం అంటే ఏమిటి? అసలు ప్రజలు అనే మాటను వర్గసమాజంలో ఎలా అర్థం చేసుకోవాలి?ఆ మాటను సర్వసాధారణంగా వాడుతూ దాని అసలు అర్థం మరిచిపోయిన స్థితిలో ఉన్నాం. గ్రీకు, రోమన్ బానిస సామ్రాజ్యాల నాటి నుంచి ఆధునిక కాలం దాకా పాలకవర్గాలు ఎప్పుడూ 'ప్రజలు' అనే మాటను తమ వర్గానికీ, తమ ఆశ్రితులకూ మాత్రమే వర్తించేట్టుగా వాడాయి. బానిస సమాజంలో బానిసలు ప్రజలు కారు, భూస్వామ్య సమాజంలో భూమిలేని అసంఖ్యాక నిరుపేద రైతుకూలీలు ప్రజలు కారు. పెట్టుబడిదారీ సమాజం

సార్వత్రిక వోటింగ్ హక్కు, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం అనే మాటలు చెప్పి జనాభా అంతటినీ ప్రజలుగా గుర్తిస్తున్నట్టు ప్రకటించింది గాని వాస్తవానికి సరుకు కొనుగోలుశక్తే ప్రజలు అనే నిర్వచనంలో చేరడానికి అనుమతి పత్రంగా ఉంది. దాన్నిబట్టి తేలేదేమంటే, చరిత్ర పొడవునా మానవ సమూహాన్నంతా ప్రజలుగా గుర్తించడం జరగలేదు. మరో మాటల్లో చెప్పాలంటే బానిస సమాజం తనలో కొంత భాగాన్ని మనుషులు గానే చూడలేదు, జంతువులుగా చూసింది. భూస్వామ్య సమాజం తనలో కొంత భాగాన్ని కేవలం వెట్టి శ్రామికులుగా చూసింది. పెట్టుబడిదారీ సమాజం పౌరులుగా, సమానంగా చూస్తానని వాగ్దానం చేసింది గాని వినియోగదారులుగా చూడడంతో ఆగిపోయింది. కనుక ఈ సమాజాలు వేటిలోనూ పాలకుల వ్యక్తిగత మంచి చెడులతో, ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ప్రజా ప్రభుత్వం ఏర్పడే అవకాశం లేదు.

ఎవరి శ్రమ వల్ల సమాజ చలనానికి వీలు కలుగుతుందో, సమాజ సంపద పోగుపడడానికి అవకాశం వస్తుందో వారే ప్రజలు. ఇతరుల శ్రమ ఫలితాన్ని అనుభవించేవారు ప్రజలు కాజాలరు. శ్రామికులకు వోటు హక్కు ఇచ్చినప్పటికీ వారి నిజమైన ప్రతినిధులు అధికారానికి వచ్చే అవకాశం లేనందువల్ల అలా ఏర్పడేవి ప్రజా ప్రభుత్వాలు కాజాలవు. "ప్రజలలో" కొందరి వోట్లతోనే అధికారానికి వచ్చినప్పటికీ మౌలికమైన పునాది మారనంతవరకూ అవి ప్రజా ప్రభుత్వాలు కాజాలవు.

ఈ స్థూలమైన తాత్విక, చారిత్రక, రాజకీయార్థిక అవగాహన ఉంచుకుంటూనే, ఆధునిక ప్రభుత్వాలు అప్పుడప్పుడు చూపే "ప్రజానుకూల" విధానాలను, చర్యలను ఎలా అర్థం చేసుకోవాలనే ప్రశ్నకు జవాబు చెప్పవలసి ఉంటుంది. వర్గ సమాజంలో ప్రభుత్వాలు పాలకవర్గాలకు అనుకూలంగానే తప్ప ప్రజలకు అనుకూలంగా పనిచేయవనే అవగాహన నిజమే అయినా, కొన్ని సందర్భాలలో ప్రభుత్వాలు ఏదో ఒక ప్రజానుకూల విధానాన్ని ప్రకటించడమో, ప్రజానుకూల చర్య అమలు చేయడమో, చేసినట్టు నటించడమో మనం చూస్తూనే ఉన్నాం. అటువంటి విధానాలూ చర్యలూ మనలో కొంత గందరగోళాన్ని కలిగిస్తున్న మాట కూడ నిజమే.

ఈ సందర్భంలో ఆ ప్రభుత్వ విధానాలనూ చర్యలనూ నాలుగు స్థాయిలలో అర్థం చేసుకోవలసి ఉంటుంది. 1. ప్రజలను ఆకర్షించడానికి, ప్రత్యేకంగా ఎన్నికల సమయంలో, తీవ్రమైన ప్రజావ్యతిరేకత గల పాలకవర్గాలు కూడ ప్రజానుకూల విధానాలను ప్రకటిస్తాయి, చర్యలను అమలు చేస్తాయి. 2. ఆ ప్రజానుకూల విధానాలు, చర్యలు అనబడేవి కూడ పైకి చూడడానికి అలా కనబడతాయి గాని లోతుకు వెళ్లి సారాంశంలో పరిశీలిస్తే ప్రధాన ప్రయోజనం, ఎక్కువ ప్రయోజనం పాలకవర్గాలకే సమకూరేలా ఉంటాయి. ఎంతో కొంత, అతి స్వల్ప ప్రయోజనం ప్రజలకు దక్కితే దక్కవచ్చు. 3. భిన్న వర్గాల సమాజంలో ప్రభుత్వంలో అందరికందరూ పాలకవర్గాలకు చెందినవారే ఉండే అవకాశం లేదు. ఎక్కడో ఒకచోట నిర్ణయాధికార స్థానంలో ఎవరో ఒక ప్రజానుకూల వ్యక్తి ఉండవచ్చు. వారి పరిధి మేరకు ప్రజానుకూల నిర్ణయాలు అమలు చేయవచ్చు. కాని ఆ నిర్ణయాలు మౌలికంగా వ్యవస్థను ప్రశ్నించేవి కానంతవరకు మాత్రమే ఆమోదించబడతాయి. మౌలిక ప్రశ్నలు వేస్తే వారి అధికారమే రద్దవుతుంది. 4. అటువంటి ప్రజానుకూల నిర్ణయం అమలైన సందర్భంలో కూడ అదేదో ఆ ప్రభుత్వ పెద్దలు ప్రజల పట్ల చేసే మెహర్బానీగా చూడడం సరి కాదు. ప్రజల శ్రమ ఫలితాన్ని పన్నుల రూపంలో అనుభవిస్తున్న, ప్రజల వోట్లతో గద్దెనెక్కామని అనుకుంటున్న ప్రభుత్వ నిర్వాహకులు తప్పనిసరిగా ప్రజలకు చెల్లించవలసిన వాటా, ప్రతిఫలం అది. ఆ ప్రయోజనాలు పొందడం ప్రజల హక్కు, ప్రభుత్వాల దయాదాక్షిణ్యం కాదు.

ఈ నాలుగు అంశాలూ ప్రపంచంలో ఎక్కడైనా వర్తించేవి కాగా, భారత సమాజంలో మరొక అంశం కూడ ఉంది. ఇక్కడి రాజ్యాంగంలో కేంద్ర ప్రభుత్వ జాబితా, రాష్ట్ర ప్రభుత్వ జాబితా, ఉమ్మడి జాబితా ఉన్నాయి గనుక, రాష్ట్ర ప్రభుత్వ అధికారంలోకి వచ్చినవారు తమ పరిధిలో ఉన్న అంశాలలో ప్రగతిశీల, ప్రజానుకూల విధానాలను ప్రవేశపెట్టి, అమలు చేయవచ్చు. అలాగే ఈ సువిశాల దేశంలో సంక్లిష్టమైన, విశాలమైన అధికారవ్యవస్థ ఏర్పడి ఉంది గనుక ఎక్కడో ఒక ప్రభుత్వాధికారి తన పరిధిలో కొన్ని ప్రజానుకూల చర్యలు అమలు చేసే అవకాశం ఉంది. అయితే గత ఏడు దశాబ్దాలలో వామపక్షాలు అనబడేవి రాష్ట్ర ప్రభుత్వ అధికారంలోకి వచ్చిన చోట్ల కూడ, కనీసం తమ పరిధిలోని అంశాలలోనైనా ప్రజానుకూల విధానాలు అమలు చేయలేదు. అమలు చేయడానికి ప్రయత్నించిన అతి కొద్ది సందర్భాలలో ప్రభుత్వాధికారాన్నే వదులుకోవలసి వచ్చింది. అలాగే అధికారులు ప్రజానుకూలంగా ఉండడం కూడ వారు ప్రదర్శనావస్తువులుగా ఉన్నంతవరకే ఆమోదించడం, వారు అంతకన్న ఎక్కువ మౌలిక ప్రశ్నలు వేస్తే వారిని ఆ స్థానాల నుంచి తొలగించడం ఎన్నో సార్లు జరిగింది. అలా ప్రభుత్వాలైనా, అధికారులైనా మౌలిక ప్రజానుకూల నిర్ణయాలను అమలు చేయలేకపోయారంటేనే ఈ వ్యవస్థలో ప్రజానుకూల ప్రభుత్వాలు ఏర్పడే అవకాశం లేదనడానికి రుజువు.

పారిస్ కమ్యూన్ గురించి మార్క్స్ చేసిన విశ్లేషణ 'సివిల్ వార్ ఇన్ ఫ్రాన్స్' ను 1891లో పునర్ముద్రిస్తూ ఎంగెల్స్ రాసిన ముందుమాటలో ప్రభుత్వం గురించి, ప్రభుత్వోద్యోగుల గురించి ఎప్పటికీ మరచిపోగూడని మాటలన్నాడు: "సమాజం తన ఉమ్మడి ప్రయోజనాలను పర్యవేక్షించ దానికి తన సొంత సంస్థలను తయారు చేసుకుంది. మొట్టమొదట ఈ ఏర్పాటు ఒక సరళమైన శ్రమ విభజన. కాని ఈ సంస్థలన్నిటికీ పైన రాజ్యాధికారం ఉంది గనుక కాలక్రమంలో ఈ సంస్థలన్నీ తమ సొంత ప్రత్యేక ప్రయోజనాలను నెరవేర్చుకునే పనిలో పడ్డాయి. అవి తమను తాము సమాజ సేవకుల స్థానం నుంచి సమాజ యజమానుల స్థానానికి మార్చుకున్నాయి. ఈ విషయం వంశపారంపర్య రాచరికంలో మాత్రమే కాదు, ప్రజాస్వామిక గణతంత్రంలో కూడ సమానంగా అమలు కావడం చూడవచ్చు. ఇలా "రాజకీయవేత్తలు" అందరికన్న పైన ఒక ప్రత్యేక, శక్తిమంతమైన బృందంగా మారిన దేశాలలో ఉత్తర అమెరికా లాంటిది మరెక్కడా లేదు. అక్కడ రెండు ప్రధాన పార్టీలు ఒకదాని తర్వాత ఒకటి అధికారంలోకి వస్తాయి. రాజకీయాలనే వ్యాపారంగా మార్చుకున్న వారు ఆ పార్టీలను అదుపుచేస్తారు. వారే కేంద్ర శాసనసభలోనూ, వివిధ రాష్ట్రాల శాసనసభలలోనూ ఎవరికి ఎన్ని స్థానాలు వస్తాయో అంచనా కడతారు. పార్టీ విజయం కోసం ఉద్యమాలు సాగించడంలోనే వారి భుక్తి సమకూరుతుంది. చివరికి ఆ పార్టీ విజయం సాధించగానే వారికి

పదవుల ప్రతిఫలం దొరుకుతుంది.”

ఈ ఉటంకింపులో సమాజసేవకులుగా ప్రారంభమైన రాజకీయ నాయకులు సమాజ యజమానులుగా మారడం అనేది కీలకాంశం. వర్గ సమాజం ఉన్నంతకాలం ఈ మార్పుకు అవకాశం ఉంటుంది. ఈ సూత్రీకరణకు సోషలిస్టు దశ కూడ మినహాయింపు కాదని ఇరవయో శతాబ్ది విప్లవానంతర ప్రభుత్వాలు చూపాయి. అటువంటప్పుడు భారత సమాజంలో, తెలంగాణలో రాజకీయ నాయకులు సమాజ సేవకులుగా ఉంటారని, ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తారని, ప్రజానుకూల విధానాలు అమలు చేస్తారని ఆశించడం అత్యాశే అవుతుంది.

అయితే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఒక ప్రాంత ప్రజల ఆకాంక్షల ఉద్యమం గనుక ఆ ప్రాంతంలోని అన్ని వర్గాల, అన్ని దృక్పథాల ప్రజా సమూహాలు ఆ ఉద్యమంలో పాల్గొన్నాయి. ఆ ఆకాంక్షలలో అన్ని సమూహాలకు చెందిన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ఆకాంక్షలు ఉన్నాయి గనుక, ఆ ఆకాంక్షలకు చారిత్రక స్వభావం ఉంది గనుక అన్ని సమూహాల భాగస్వామ్యం ఎక్కువగానే ఉండింది. అందువల్ల భిన్న భావజాలాల వ్యక్తుల మధ్య ఉద్యమకాలంలో సాన్నిహిత్యం, స్నేహం, మొహమాటాలు బలపడ్డాయి. దానితో ప్రభుత్వాధికారంలో ఉన్నవారితో నిష్కర్షగా, నిర్మొహమాటంగా వ్యవహరించే, వారి ప్రజావ్యతిరేక చర్యలను ఎత్తిచూపి, నిరసన తెలిపే అవకాశం బలహీనపడింది.

అన్ని ఉద్యమాలలోలాగనే ఈ ఉద్యమంలో కూడ కొన్ని సమూహాలు అవసరమైనదానికన్న ఎక్కువ త్యాగం చేయడమూ, కొన్ని వర్గాలు ఏ త్యాగమూ చేయకుండానే నాయకత్వం వహించడమూ జరిగింది. ఉద్యమ మౌలిక లక్షణాలలో అది బహుళవర్గ ఆకాంక్ష కావడం, ఉద్యమానికి మిగిలిన అన్ని అస్తిత్వ ఉద్యమాల వలెనే సంకుచిత స్వభావం ఉండడం, ఉద్యమ నాయకత్వం పాలకవర్గాలలో ఒక ముఠా చేతిలో ఉండడం వంటి కారణాల వల్ల అంతిమంగా ప్రభుత్వాధికారం ఆ ముఠాకే దక్కింది. మిగిలిన వర్గాలు తమ ఆకాంక్షలు నెరవేరుతాయని ఎదురుచూడడమో, తమ సొంత ప్రయోజనాలు దక్కితే చాలునని అధికారవర్గంతో కుమ్మక్కు కావడమో తప్ప గత్యంతరం లేకపోయింది. బుద్ధిజీవులలో అత్యధిక సంఖ్యాకులు ఇలా కుమ్మక్కు కావడానికో, మౌనంలోకీ, నిర్లిప్తత లోకీ వెళ్లడానికో సిద్ధపడ్డారు. సమీపగతంలోని ఉద్యమ ఉధృతి వల్ల ఎక్కువ వర్గాలు తక్షణమే అధికార వర్గపు స్వభావాన్ని విప్పి చెప్పి ప్రభుత్వ వ్యతిరేకతను కూడగట్టడానికి తొలిరోజుల్లో సాహసించలేకపోయాయి. ఈ సంక్లిష్ట చిత్రంలో పాలకవర్గ ప్రయోజనాలు పెద్దఎత్తున నెరవేరుతూ వచ్చాయి. చివరికి ఉద్యమం ఏ పాలకవర్గ ముఠాల ప్రయోజనాలను ప్రశ్నించిందో, నిలదీసిందో ఆ ముఠాల అధికారమూ, ప్రయోజనాలూ కూడ తగ్గలేదు సరిగదా పెరిగాయి. ఎన్ని పరిమితులలోనైనా ప్రజా ఆకాంక్షలు నెరవేరడానికి ఉన్న అవకాశాల మీద పట్టుపట్టడానికి కూడ శక్తిలేనంతగా ప్రజారాశులు బలహీనమైపోయాయి.

నిజానికి భారత చరిత్రను అధ్యయనం చేస్తే ఇదేమీ కొత్త విషయం కాదు. అధికార మార్పిడి తర్వాత, 1947 ఆగస్ట్ 15 తర్వాత భారత ప్రభుత్వం సరిగ్గా అంతకు ముందరి బ్రిటిష్ ప్రభుత్వం లాగనే పాలన కొనసాగించింది. నిజాం పాలన అంతమైన తర్వాత, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత తెలంగాణ ప్రజలు ఇటువంటి పాలననే అనుభవించారు. ఉద్యమ ఆకాంక్షలు నెరవేరకపోవడం, ప్రజలకు లిఖిత పూర్వకంగా ఇచ్చిన హామీలను కూడ పాలకవర్గాలు నెరవేర్చకపోవడం భారత చరిత్రలో ఎన్నోసార్లు జరిగాయి. 2014 జూన్ 2 తర్వాత తెలంగాణ ప్రభుత్వ పాలన కూడ అదే తానులోని ముక్క అని గుర్తించడానికి ఎక్కువ శ్రమ పడనక్కరలేదు. ఈ నాలుగేళ్ల పాలన అంతకు ముందరి పాలనల లాగనే ఉంది. పాలనా విధానాలు, ఆర్థిక విధానాలు, ప్రజా సంక్షేమ విధానాలు, పౌరహక్కులు, అధికార పటాటోపం, అవినీతి వంటి ఏ ఒక్క సూచిక తీసుకున్నా 1956-2014 పాలన కన్న రెండాకులు ఎక్కువ చదివిన ప్రజావ్యతిరేక పాలనే సాగుతున్నది గాని, ప్రజానుకూలమైన, ఉద్యమకాలపు ఆకాంక్షలకు అనుగుణమైన మార్పు ఒక్కటి కూడ రాలేదు. ఏవో కొన్ని సంక్షేమ పథకాలు, వాగాడంబరాలు చూసి మోసపోయినా, మోసపుచ్చ దలచుకున్నా, మౌలిక అంశాలను పరిశీలిస్తే ఏ ఒక్క సూచికలోనూ ఇది భిన్నమైన ప్రభుత్వం కాదని, కొన్ని సూచికలలో ఇంకా దారుణమైన ప్రభుత్వమని కూడ నిర్ధారణ అవుతుంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# మార్క్స్ పుట్టిన ఊళ్లో 200వ పుట్టినరోజు

ప్రపంచ శ్రామికులందరికీ, శ్రమను గౌరవించేవారందరికీ, పీడిత ప్రజలందరికీ అధ్యాపకుడు, స్నేహితుడు, మార్గదర్శి కార్ల మార్క్స్ 200వ పుట్టినరోజు (మే 5, 2018) న ఆయన పుట్టిన ఊళ్లో, పుట్టిన ఇంట్లో గడిపే అరుదైన అవకాశం వీక్షణం సంపాదకుడికి కలిగింది. మార్క్స్ పుట్టిన ఊరు ట్రియర్‌ను, మార్క్స్ పుట్టిన ఇంటిని గతంలో సందర్శించిన వారు, భవిష్యత్తులో సందర్శించబోయేవారు ఎందరైనా ఉండవచ్చు గాని, 200 పుట్టినరోజు చారిత్రక సందర్భం మాత్రం మళ్లీ రాదు. ట్రియర్ సందర్శన గురించి సంపాదకుడి ఉద్వేగభరిత నివేదిక వీక్షణం పాఠకుల కోసం ప్రత్యేకం.

❖ ❖ ❖

మానుకోట మిత్రుడు రంజిత్ ఉద్యోగార్థం జర్మనీ చేరినప్పటి నుంచీ, నాలుగేళ్లకు పైగా, నన్ను జర్మనీ వచ్చి కొన్ని రోజులు ఉండమనీ, అక్కడ చూడవలసిన ప్రదేశాలు చూడమనీ ఆహ్వానిస్తున్నాడు. జర్మనీలో చాల నగరాల పేర్లు మార్క్స్, ఎంగెల్స్‌ల రచనల్లో చదివి ఉండడం వల్ల ఎప్పటికైనా ఆ నగరాలు చూడగలిగితే, ఆ చరిత్రను పునర్జీవించ గలిగితే బాగుండునని నాకూ కోరిక ఉండింది. చివరికి, మార్క్స్ 200 వ జయంతి సందర్భంగా ఆయన పుట్టిన ఊరు ట్రియర్‌లో ఎన్నో ఉత్సవాలూ, ప్రదర్శనలూ జరుగుతున్నాయని విని ఆ రోజుకల్లా అక్కడికి వెళ్లగలిగితే బాగుంటుందనుకున్నాను. అలా ఏప్రిల్ 29 నుంచి మే 16 దాకా జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీల్లో కొన్ని నగరాలు, స్థలాలు చూశాను. ఆ అనుభవాలన్నిటిలోకీ శిఖరాయమానమైనవి, ఉద్వేగభరితమైనవి మే 5న ట్రియర్‌లో పొందిన అనుభవాలు.



కార్ల్ మార్క్స్ కాంస్య విగ్రహం

రంజిత్ ఉండే ఊరు వాల్డెన్‌బర్గ్ నుంచి ట్రియర్ మూడు వందల కిమీ దూరం. మేం (రంజిత్, నా సహచరి వనజ, నేను) మే 5 ఉదయాన్నే బయల్దేరాం. కొబ్లెన్స్‌లో ఉండె తెలుగు మిత్రులు శ్రావ్య, రాహుల్ ట్రియర్‌కు నేరుగా వచ్చారు. ట్రియర్ చేరడానికి ముప్పై నలభై కిమీ ముందు రోడ్డు పక్కన రెస్ట్ హౌజ్, రెస్టారెంట్ దగ్గర ఆగినప్పుడు ట్రియర్‌కే వస్తున్న రెండు మూడు బస్సులు కనబడ్డాయి. వారు కూడ మార్క్స్ ద్విశతజయంతి ఉత్సవాల్లో పాల్గొనడానికి వస్తున్నారని తెలిసింది. దక్షిణ జర్మనీలో ఒక పట్టణంలో స్థానిక స్వపరిపాలన సంస్థకు ఎన్నికైన సభ్యుడు, లండన్‌లో మార్క్స్ వాక్ నిర్వహించే లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అధ్యాపకురాలు పరిచయమయ్యారు. అంటే అక్కడి నుంచే మార్క్స్ జయంతి సంరంభం, మార్క్స్ పుట్టిన ఊరి అనుభూతులు ప్రారంభమయ్యాయన్నమాట.

జర్మనీ పశ్చిమ భాగంలో మోసెల్ నదీ తీరాన ప్రాచీన నగరం ట్రియర్. ఆ నగరం రోమన్ సామ్రాజ్యపు రోజులనుంచీ ఉందనడానికి గుర్తుగా ఆ ఊరి మధ్యలో పెద్ద రోమన్ దుర్గ ప్రాకార శిథిలాలున్నాయి. ఆల్ప్స్ పర్వతాలకు ఉత్తరంగా జర్మనీలో రోమన్ సామ్రాజ్య కేంద్రంగా ఉండిన ఏకైక నగరంగా దానికి గుర్తింపు ఉంది. ప్రాచీన కట్టడాలకు యునెస్కో గుర్తింపు పొందిన సాంస్కృతిక కేంద్రం అది. రెండు వేల ఏళ్లుగా ద్రాక్ష తోటలకు ప్రసిద్ధి అనీ, మధ్య యుగాలలో కూడ పేరెన్నికగన్న నగరమనీ నగర వాసులు చెప్పుకుంటారు.

ట్రియర్‌లో ఊరు ఊరంతా మార్క్స్ జయంతి జరుపుతున్నది. ఊళ్లో ఎక్కడ చూసినా 'హాపీ బర్త్‌డే కార్ల్ మార్క్స్' అని పోస్టర్లు, బానర్లు ఉన్నాయి. సాధారణ దుకాణాలు కూడ ఆ పోస్టర్లు అతికించుకుని ఉన్నాయి. జర్మనీ ప్రభుత్వం, ట్రియర్ నగర పాలక సంస్థల ఆధ్వర్యంలో నడిచే రైనిషెస్ లాండెస్ మ్యూజియం, స్టాడ్ట్ మ్యూజియం సిమియన్ స్టిఫ్ట్, మ్యూజియం కార్ల్ మార్క్స్ హౌజ్ నిర్వహిస్తున్న ఫ్రెడరిక్ ఎబర్ట్ స్టిఫ్టుంగ్, ఊళ్లో అతి పురాతనమైన కెథెడ్రల్ – అన్నీ కూడ మార్క్స్ జయంతిని తమ తమ పద్ధతుల్లో జరుపుతున్నాయి. ఈ నాలుగు ప్రధాన సంస్థలూ తమ తమ ప్రత్యేక ప్రదర్శనా ఇతివృత్తాలను ఉంచుకుంటూనే, 'కార్ల్ మార్క్స్ 1888 – 1883 లెబెన్. వెర్క్. జీట్.' (జీవితం, కృషి, కాలం) అనే ప్రధాన ఇతివృత్తాన్ని పెట్టుకున్నాయి. ఇవి కాక, చైనా ప్రభుత్వం ట్రియర్ నగరపాలక సంస్థకు ఈ సందర్భంగా ప్రత్యేక కానుకగా ఇచ్చిన భారీ కాంస్య విగ్రహావిష్కరణ కార్యక్రమం కూడ ఉంది.

మేం ట్రియర్ చేరీ చేరగానే మార్క్స్ పుట్టిన ఇంటికే బయల్దేరాం. కాని ఈ సందర్భంగా ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ప్రదర్శన కోసం,

పునర్నవీకరించడం కోసం ఆరు నెలలుగా మూసి ఉన్న ఆ భవనాన్ని అప్పుడే మళ్లీ తెరుస్తున్నారు గనుక అక్కడ ఆహ్వానితుల కోసం మాత్రమే జరుగుతున్న ఉత్సవం సాగుతున్నది. ఆ ఉత్సవం అయిన తర్వాతనే ఇంట్లోకి ఎవరినైనా అనుమతిస్తామన్నారు. దానితో వేమిక విగ్రహావిష్కరణ స్థలం వైపు మళ్లాం. నాలుగడుగులు వేయగానే మొట్టమొదట కనిపించింది నినాదాలు ఇస్తున్న ఓ యాభై అరవై మంది గుంపు. వాళ్లు ఇస్తున్న నినాదాలు అర్థం కాక, దగ్గరికి వెళ్లి చూస్తే వాళ్లంతా దలైలామా బొమ్మలు పట్టుకుని ఉన్నారు. చైనా ప్రభుత్వానికి, మార్క్సిజానికి వ్యతిరేకంగా నినాదాలు ఇస్తున్నారు. 'ఓహో మార్క్స్ జయంతి సందర్భంగా, ప్రత్యేకించి ఇవాళ్టి విగ్రహావిష్కరణలో చైనా ప్రభుత్వ ప్రమేయం ఉంది గనుక వీళ్లు నిరసన ప్రదర్శన జరుపుతున్నట్టున్నారు' అనుకుని ముందుకు కదిలాం.

మరొక నాలుగడుగులు వేసేసరికి వందలాది మంది ఎర్రజెండాల ఊరేగింపు. జర్మనీకి చెందిన నాలుగు కమ్యూనిస్టు పార్టీలు సంయుక్తంగా నిర్వహిస్తున్న ఆ ఊరేగింపులో దేశదేశాల నుంచి వచ్చిన కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధులు, స్వతంత్ర కమ్యూనిస్టులు ఎందరో కలిసిపోయారు. ఆ ఊరేగింపులో కలిసి, ఆ నినాదాల్లో భాగం పంచుకుంటూ విగ్రహం ఉన్న చోటివరకూ వెళ్లాం.

**విగ్రహావిష్కరణ**

మార్క్స్ 200వ జయంతి సందర్భంగా ట్రియర్ నగరానికి ఒక భారీ కాంస్య విగ్రహం కానుకగా ఇస్తానని చైనా ప్రభుత్వం గత సంవత్సరం సందేశం పంపింది. ట్రియర్ నగరవాసులలో, ముఖ్యంగా నగరపాలక సంస్థలో ఈ కానుకను స్వీకరించాలా లేదా అని చర్చ మొదలైంది. చైనా నేషనల్ మ్యూజియం డైరెక్టర్, చైనా పీపుల్స్ పొలిటికల్ కన్సల్టేటివ్ కాన్ఫరెన్స్ సభ్యుడు, ప్రపంచ ప్రఖ్యాత శిల్పి వు వెయిషాన్ విగ్రహం నెలకొల్పే స్థలాన్ని చూడడానికి జనవరిలో ట్రియర్ సందర్శించాడు. మార్క్స్ ఈ ఊళ్లో గడిపింది బాల్య, కౌమారాలు మాత్రమే గనుక ఆయనను ఒక చిన్నపిల్లవాడిగా చిత్రించాలని, ఆ చిన్నపిల్లాడు ఒక బెంచి మీద కూచుని ఆడుకుంటున్నట్టు ఉండాలని, ఆయన పక్కన కూచోవడానికి ఇతరులకు స్థలం కూడ వదలాలని ట్రియర్‌లో ఒక సూచన వచ్చిందట. మార్క్స్ వ్యక్తిత్వానికి, ఘనతకు తగినట్టుగా భారీ విగ్రహమే ఉండాలని, పద్నాలుగు అడుగుల ఎత్తయిన విగ్రహం తయారు చేస్తానని శిల్పి అన్నాడట. చివరికి ఆ విగ్రహమే నిర్ధారణ అయి, ఏప్రిల్ నాటికి విగ్రహం ట్రియర్ చేరింది. ఈలోగా చైనా మానవ హక్కుల ఉల్లంఘనకు పాల్పడుతున్నది గనుక చైనా కానుకను స్వీకరించవద్దని నిరసనలు, ప్రకటనలు మొదలయ్యాయి. చివరికి 42–7 వోట్ల ఆధిక్యతతో విగ్రహాన్ని స్థాపించాలని, పోర్టా నిగ్రా అని పిలుచుకునే రోమన్ ప్రాకార శిథిలాల దగ్గర స్థాపించాలని నిర్ణయించారు. అది మార్క్స్ పుట్టిన ఇంటికి ఒక ఫర్లాంగు దూరంలో ఉంటుంది గనుక మార్క్స్ తన ఇంటివైపు చూస్తున్నట్టుగా దాన్ని ఏర్పాటు చేశారు. మూడడుగుల పునాది కూడ కలిసి అది నేల నుంచి పదిహేడడుగుల ఎత్తున ఉంది.

ఆ విగ్రహావిష్కరణ కార్యక్రమానికి ఏర్పాటు చేసిన ప్రాంగణంలో దాదాపు వెయ్యి మంది, ప్రాంగణం బైట రోడ్ల మీద, భవనాల గదుల్లో, కప్పుల మీద దాదాపు మరొక రెండు మూడు వేల మంది ఉన్నారు. ఒక




పక్కన 'నియంతల పిత మార్క్స్' అనీ, 'లక్షలాది మంది ప్రజల హంతకుల పిత' అనీ, టిబెట్‌కు స్వాతంత్ర్యం కావాలనీ బానర్లు, ప్లకార్డులు పట్టుకుని నినాదాలు చేస్తున్న యాభై అరవై మంది టిబెటన్లు, వారితో పాటు ఉన్న కొందరు జర్మన్ కమ్యూనిస్టు వ్యతిరేకులు ప్రాంగణంలోకి జొరబడకుండా నిరోధించడానికి పోలీసు వలయాలు ఏర్పాటు చేశారు.

జర్మన్, చైనీస్ ప్రభుత్వ ప్రతినిధుల ఉపన్యాసాలు, వాటికి జర్మన్, చైనీస్ అనువాదాలు గంటన్నర రెండు గంటలపాటు సాగి విసుగెత్తించినా అందరూ ప్రశాంతంగా వేచి చూశారు. వృద్ధులు, యువకులు, పిల్లలు, చిన్నపిల్లలను భుజాల మీదికి ఎక్కించుకుని కూచోపెట్టుకున్న తల్లిదండ్రులు, వేరువేరు దేశాలవాళ్లు, వేరు వేరు భాషల వాళ్లు, వేరువేరు రంగుల వాళ్లు నిజంగా అక్కడ 'ప్రపంచ కార్మికులారా ఏకం కండి' అని మార్క్స్ ఇచ్చిన నినాదం వాస్తవరూపం దాల్చిన దృశ్యం కనబడింది. విగ్రహం మీద అప్పటివరకూ కప్పి ఉంచిన ఎర్ర గుడ్డను ప్రభుత్వ ప్రతినిధులు తొలగించి విగ్రహాన్ని ఆవిష్కరించగానే వేలాది మంది ప్రేక్షకుల కరతాళ ధ్వనులు, నినాదాలు మిన్నంటాయి.

ఆ ప్రాంగణంలోనూ, నగరంలో చాల చోట్ల ఈ సందర్భంగా మార్క్స్ బొమ్మలను, సూక్తులను సరుకులుగా మార్చి అమ్ముకునే ప్రయత్నం కూడ పెద్ద ఎత్తునే జరిగింది. మార్క్స్ బొమ్మలతో, సంతకంతో పెన్నులు, తాళం చెవులు, కార్డులు, పుస్తకాలు, ఫోటోలు మాత్రమే కాక మార్క్స్ పేరుతో ప్రత్యేకంగా విడుదల చేసిన కాఫీ, బీర్, షాంపేన్‌ల అమ్మకాలు కూడ జోరుగా సాగాయి. చివరికి మార్క్స్ ఇంటికి వెళ్లే దారిలో కూడలిలో రెడ్ సిగ్నల్, గ్రీన్ సిగ్నల్ కూడ మార్క్స్ బొమ్మలతో తయారు చేశారు.

**స్టాడ్ట్ మ్యూజియం సిమియన్ స్టిఫ్ట్**

ట్రియర్‌లో కొన్ని దశాబ్దాలుగా ఉన్న సిటీ మ్యూజియం ఆ విగ్రహం పక్కనే ఉంది. అది ఆ ప్రాంతంలో దొరికిన శిల్పాలను, పురావస్తువులనూ, చిత్రాలనూ, జీవనశైలి చిహ్నాలనూ సంగ్రహపరిచిన మంచి మ్యూజియం అని పేరు పొందింది గాని, ప్రస్తుతం ప్రత్యేకంగా మార్క్స్ జీవితం పై 'స్టేషన్స్ ఇన్ లైఫ్' అనే ఉప ఇతివృత్తంతో ఒక మూడు అంతస్తుల, పది పన్నెండు గదుల ప్రదర్శన ఏర్పాటు చేసింది. మూడు అంతస్తులు కనబడే మెట్లపక్కన ఆ మూడు అంతస్తుల నిలువునా మార్క్స్ జీవితక్రమంలోని ఏడెనిమిది కీలకమైన ఫొటోలు నిలువెత్తు పరిమాణంలో ముద్రించిన పెద్ద బానర్ వేలాడదీశారు.

ఈ ప్రదర్శన చివర చెప్పినట్టు 'మార్క్స్ జీవితం ఒక సుదీర్ఘ ప్రయాణం' అనే అవగాహనతో ఆ జీవిత ప్రయాణంలో ఆయన ఒక రోజయినా, కొన్ని సంవత్సరాలయినా నిలిచిన స్టేషన్ల ద్వారా ఆయన వ్యక్తిత్వాన్ని, కృషిని, కాలాన్ని పరిచయం చేయడం ఈ ప్రదర్శన ఉద్దేశం. అలా ట్రియర్‌లో బయల్దేరి ఎన్నెన్నో ఊళ్లూ దేశాలూ తిరుగుతూ ఒక్కొక్క స్టేషన్‌లో ఎంతో మందిని కలుస్తూ, ఎన్నో అన్వేషిస్తూ, ఎన్నో రాస్తూ, ఎందరినో సంఘటితపరుస్తూ, ఎందరినో ప్రభావితం చేస్తూ సాగిన ఈ మహత్తర జీవిత యాత్రను ఈ ప్రదర్శన అద్భుతంగా పట్టుకుంది. అది కార్ల్ మార్క్స్ అనే ఒకానొక వ్యక్తి జీవితచరిత్రగా మాత్రమే కాక, ఆ వ్యక్తి అలా ఎదగడానికి కారణమైన సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక నేపథ్యంలో ఆ వ్యక్తిని భాగంగా చూసే సామాజిక చరిత్రగా చూసింది గనుక అది మరింత అద్భుతంగా ఉంది.

ప్రదర్శన ప్రారంభంలోనే 1818లో మార్క్స్ పుట్టేనాటికి ట్రియర్ ఎలా ఉందో, ఆ ట్రియర్ జీవితం మార్క్స్ ఆలోచనాసరళి మీద ఎటువంటి ప్రభావం వేసిందో, అంటే ప్రారంభమైన స్టేషన్‌లోనే ఈ రైలు ప్రయాణ దిశ ఎలా నిర్ణయమయిందో ఆధారాలతో సహా వివరించారు. 1820లలో ట్రియర్‌లో కలరా వ్యాపించి వందలాది మంది చనిపోయారట. ఆ తర్వాత కలరా ఎందుకు అంతగా విస్తరించిందో తెలుసుకోవడానికి ప్రభుత్వం 1831లో ట్రియర్‌లో ఒక సామాజిక, ఆర్థిక సర్వే నిర్వహించిందట. ఆ సర్వేలో ప్రజలను అడిగిన ప్రశ్నలు, జవాబులు నమోదు చేసిన రిజిస్టర్ల కాగితాలు అక్కడ ప్రదర్శనకు పెట్టారు. ఆ సర్వే ప్రకారం ఆనాటి ట్రియర్ జనాభాలో 70 శాతం పైన కనీస సౌకర్యాలు లేని, పేదరికపు జీవనం గడుపుతున్నారని తేలిందట. అలా పేదలు నివసించే ప్రాంతాలతో 1831 నాటి ట్రియర్ పటాన్ని కూడ అక్కడ ప్రదర్శనకు పెట్టారు. సంపన్న కుటుంబంలో పుట్టి పెరుగుతున్నప్పటికీ, తన ఇంటి చుట్టుపట్లనే కనబడుతున్న దుర్భర దారిద్ర్యం ఆయనలో ఆ తర్వాతి అన్వేషణలకు బీజం వేసి ఉంటుందని అక్కడ వ్యాఖ్య రాశారు.

అయితే మార్క్స్ అక్కడ ఎక్కువ రోజులు ఉండలేదు. పదిహేడేళ్ల వయసులో, 1835లో న్యాయవిద్య అభ్యసించడం కోసం తండ్రి బాన్ విశ్వవిద్యాలయానికి పంపాడు. తనలాగే కొడుకు కూడ న్యాయవాది కావాలని తండ్రి ఆశించాడు. తర్వాతి స్టేషన్ బాన్. న్యాయవిద్య తనకు సరిపడదని మార్క్స్ త్వరలోనే తెలుసుకున్నాడు. అందుకని బాన్ స్టేషన్‌లో రైలు ఎక్కువ సేపు ఆగలేదు. అప్పటికి మేధో సంచలనాలకు, తాత్విక చర్చలకు కేంద్రంగా ఉన్న బెర్లిన్ విశ్వవిద్యాలయానికి వెళ్లాలని మార్క్స్ అనుకున్నాడు. న్యాయశాస్త్రం వదిలి తత్వశాస్త్రంలో ప్రవేశించాడు.

తన తత్వశాస్త్ర సిద్ధాంతపత్రాన్ని స్వీకరించడానికి బెర్లిన్ విశ్వవిద్యాలయం తిరస్కరించిన తర్వాత, మార్క్స్ దాన్నే యేనా విశ్వవిద్యాలయంలో సమర్పించి, పిఎచ్ డి పొందాడు. ఎక్కడో ఒకచోట తత్వశాస్త్ర అధ్యాపకుడిగా చేరాలనుకుని, తన విప్లవ భావాల వల్ల ఆ ఉద్యోగం దొరకదని తేలిపోయాక, 1842లో కోలోన్ చేరి జర్నలిస్టుగా మారి రైనిష్ జీటుంగ్ లో చేరాడు. ఆ పత్రికలో ఆయన రాస్తున్న విప్లవ భావాలను సహించని ప్రష్యన్ ప్రభుత్వ సెన్సార్లు ఆ పత్రిక మీద ఎన్నో ఆంక్షలు విధించారు. చివరికి 1843లో పత్రికలో రష్యన్ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ వచ్చిన ఒక వ్యాసంతో, జార్ చక్రవర్తి మొదటి నికొలస్ పత్రికను నిషేధించమని ప్రష్యన్ ప్రభుత్వాన్ని కోరాడు. ప్రష్యన్ ప్రభుత్వం పత్రికను నిషేధించడంతో మార్క్స్ మరొక పత్రిక కోసం పారిస్ తరలిపోవలసి వచ్చింది.

పారిస్‌లో ఆయనకు ఎంగెల్స్ పరిచయమై ఒక అసాధారణమైన, అపురూపమైన, దశాబ్దాల పాటు సాగిన మేధో మైత్రి మొదలయింది. ఆ తర్వాత గడిచిన ఆరు సంవత్సరాలలో ఒక్కొక్క దేశం నుంచి బహిష్కృతుడవుతూ మార్క్స్ పారిస్, బ్రస్సెల్స్, కోలోన్‌లలో కాస్త ఎక్కువ కాలం, ఇంగ్లండ్, హాలండ్, ఫ్రాన్స్‌లలో అనేక నగరాలలో కొద్దికాలం గడిపాడు. అలా ఆయన ఉండిన ప్రతిస్థలంలోనూ ఆయన స్నేహ బృందంలో ఎవరున్నారో, ఆ బృందం ఏయే పనులు చేసిందో, ఆయన ఏ రచనలు చేశాడో మొదలైన వివరాలు, చిన్న చిన్న వివరాలతో రాశారు. ఆయా కాలాల్లో అచ్చయిన పుస్తకాల తొలి ప్రచురణ ప్రతులు, 1848లో అచ్చయిన కమ్యూనిస్టు ప్రణాళిక, 1867 నాటి దాస్ కాపిటల్, 1845 నాటి ఎంగెల్స్ కండిషన్ ఆఫ్ వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లండ్‌తో సహా, ప్రదర్శనకు పెట్టారు. కన్ఫెషన్స్ పేరుతో ఆ రోజుల్లో విరివిగా సాగుతుండిన 20 ప్రశ్నల పత్రానికి మార్క్స్ 1865లో హాలండ్‌లో ఉన్నరోజుల్లో రాసిన జవాబుల చేతిరాత ప్రతి కూడ ఇక్కడ ప్రదర్శనకు పెట్టారు. ఆ ప్రతిలోనే ఆయన 'మీ మూలసూత్రం ఏమిటి' అనే ప్రశ్నకు 'మనిషికి సంబంధించి నదేదీ నాకు పరాయిది కాదు' అనే రోమన్ కవి టెరెన్స్ వాక్యాన్ని, 'మీ ఆశయం ఏమిటి' అనే ప్రశ్నకు 'ప్రతిదాన్నీ ప్రశ్నించు' అని ఫ్రెంచి తత్వవేత్త దేకార్త్ మాటను తన జవాబులుగా రాశాడు. అలాగే ఈ ప్రదర్శనలో మార్క్స్ వాడిన పెన్నులు, పాళీలు, సిరా బుడ్డీలు కూడ ప్రదర్శనకు పెట్టారు.

ఈ ప్రదర్శన మాత్రమే కాదు, ట్రియర్‌లో మేం చూసిన మూడు ప్రదర్శనలూ ఎంత శ్రద్ధగా, ప్రేమగా తయారు చేశారంటే అవి కేవలం మొక్కుబడి జీవితచరిత్రలు కావు. మార్క్స్ జీవితచరిత్రలు ఇప్పటికి వందకు పైగా వచ్చి ఉంటాయి. వాటన్నిటిలో లేనిదేదో ఒకటి, వాటిలో కనబడని ఏదో ఒక కోణం, వాటిలో సమ్మిళితం కాని భిన్న ఘటనలు, ఆ పాత జీవితచరిత్ర రచయితలకు కూడ తెలియని, అందుబాటులోకి రాని ఏదో ఒక కొత్త సమాచారం, తెలిసిన సమాచారం మీద కూడ కొత్త వ్యాఖ్య, కొత్త వెలుగు ఈ ప్రదర్శనల్లోని ముఖ్యాంశాలు.

అలా ఈ ప్రదర్శనలో ఇదివరకెక్కడా బైటపడని, ఎవరికీ తెలియని ఒక రేఖాచిత్రం ఉంది. మార్క్స్ కన్న నాలుగేళ్లు పెద్దవాడైన హైన్రిక్ రోస్ బాక్ (1814-79) అనే ట్రియర్‌లోని చిత్రకారుడు, వైద్యుడు, వృక్ష శాస్త్రజ్ఞుడు 1835-36లో పదిహేడేళ్ల మార్క్స్ రేఖాచిత్రం పెన్సిల్‌తో గీశాడు. ఇది మార్క్స్ విశ్వవిద్యాలయానికి వెళ్లే ముందో, బాన్‌లో ఉన్నప్పుడో గీసింది కావచ్చు. ఆ చిత్రం 2016లో బైటపడింది. అది ఈ ప్రదర్శనలో తొలిసారి బహిరంగంగా ప్రదర్శించారు.

**కార్ల్ మార్క్స్ హౌజ్**

మ్యూజియం మార్క్స్ హౌజ్ మార్క్స్ పుట్టిన ఇల్లు. ఇది కార్ల్ మార్క్స్ తండ్రి హైన్రిక్ మార్క్స్ కట్టించిన, కొనుక్కున్న సొంత భవనమా, అద్దెకు ఉన్న ఇల్లా అనే అంశంలో భిన్న కథనాలున్నాయి గాని ప్రసిద్ధుడైన న్యాయవాదిగా, ద్రాక్షతోటల యజమానిగా, ఎగువ మధ్యతరగతిలో ఉండిన హైన్రిక్ ఈ భవనం సొంతదారు అయి ఉండడానికే ఎక్కువ అవకాశాలున్నాయి. ఆ కుటుంబం ఈ ఇంట్లో అద్దెకే ఉన్నారని, పోర్టా నిగ్రా సమీపంలో సొంత ఇల్లు ఉండేదని స్థానిక జర్నలిస్టు ఒకరు ప్రస్తుతం రాసిన పుస్తకంలో రాశారు. మొత్తానికి మార్క్స్ ఆ ఇంట్లోనే పుట్టి పెరిగాడనేది నిర్వివాదం.

అయితే మార్క్స్ చనిపోయిన ఇరవై ఏళ్ల తర్వాత, 1904 నాటికి ఈ ఇంటి గురించి తెలిసి జర్మన్ కమ్యూనిస్టులు, ముఖ్యంగా జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ (ఎస్ పిడి) ఈ ఇంటిని పరిరక్షించాలని పూనుకున్నారు. వారి ప్రయత్నాలు 1928లో ఫలించి, ఆ భవనం ఎస్ పిడి సొంతమైంది. కాని హిట్లర్ అధికారానికి రాగానే 1933లో ఈ భవనాన్ని ఆక్రమించి, అందులో ప్రభుత్వ ముద్రణాలయం పెట్టారు. మళ్లీ 1947కు గాని అది ఎస్‌పిడి చేతికి రాలేదు. ఎస్‌పిడి ఆ భవనంలో మార్క్స్ జీవితం, కృషికి సంబంధించిన మ్యూజియం ఏర్పాటు చేసి 1947 మే 5న ప్రారంభించింది. 1968లో ఈ భవనం ఎస్‌పిడికి సన్నిహితంగా ఉన్న ఫ్రెడరిక్ ఎబర్ట్ స్టిఫ్టుంగ్ అనే సేవా సంస్థకు అప్పగించారు. 1983లో మార్క్స్ శత వర్ధంతి సందర్భంగానూ, 2005 లోనూ ఈ మ్యూజియంను కొన్ని నెలలు మూసివేసి పునర్నిర్మాణం, పునర్నవీకరణ పనులు చేపట్టారు. ప్రస్తుతం ద్విశత జయంతి సందర్భంగా 2017 సెప్టెంబర్‌లో మూసివేసి, కొత్త ప్రదర్శన ఏర్పాటు చేసి, ఈ మే 5న ప్రారంభించారు. గత పునర్నవీకరణల నాటి నుంచీ కూడ ఈ ప్రదర్శనలో కేవలం మార్క్స్ జీవితం, కృషి విభాగాలు మాత్రమే కాక ప్రపంచం మీద మార్క్స్ ప్రభావం అనే విభాగాన్ని కలిపారు.

అసలు ఆ భవనంలో అడుగు పెడుతున్నప్పుడే శిశువుగా, బాలుడిగా, కౌమారదశలో మార్క్స్ ఈ గదుల్లో, ఈ నేల మీద, ఈ గోడలు పట్టుకుని అంబాడి, లేచి నిలబడి, తిరుగాడి, తోబుట్టువులతో, స్నేహితులతో ఆటలు ఆడుకుని, ఇక్కడి గాలి పీల్చి, ఈ గాలిలోకి మాటలు వదిలి ఉంటాడు గదా అని ఉద్విగ్నతకు లోనయ్యాను. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. కళ్లు చెమ్మగిల్లాయి.

ఆ మూడంతస్తుల భవనంలో ప్రతి గదినీ చాల శ్రద్ధగా, ప్రేమతో, గౌరవంతో అలంకరించారు. ఫొటోలు, చిత్రాలు, వస్తువులు, పుస్తకాలు, పాత పత్రికలు జాగ్రత్తగా గాజు అద్దాల్లో ప్రదర్శనకు పెట్టడం మాత్రమే కాదు, ప్రతి ప్రదర్శన వస్తువు పక్కనా అందమైన చేతిరాతతో, మార్క్స్ పట్ల గౌరవం, మార్క్సిజం భవిష్యత్తు పట్ల ఆశ కలిగించే పద్ధతిలో వ్యాఖ్యలు రాసి పెట్టారు. ఇక్కడ కూడ మార్క్స్, ఎంగెల్స్‌ల చేతి రాతలు, లేఖలు, వారి అచ్చయిన పుస్తకాల తొలి ప్రచురణ ప్రతులు, మార్క్స్ వాడుకున్న వస్తువులు, వివిధ చిత్ర రూపాలలో మార్క్స్ బొమ్మలు ప్రదర్శనకు పెట్టారు. మార్క్స్ జెన్నీని ఉద్దేశించి రాసిన కవిత ఆయన చేతిరాతలో ఉంది. కమ్యూనిస్టు ప్రణాళిక, లుడ్విగ్ ఫ్యూర్ బా – సాంప్రదాయిక జర్మన్ తత్వశాస్త్ర ముగింపు తొలి ప్రచురణ ప్రతులు, మార్క్స్ వ్యాసం అచ్చయిన న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్ 1853 జూన్ 25 ప్రతి, దాస్ కాపిటల్ తొలి ప్రచురణ ప్రతి వంటివెన్నో ఉన్నాయి. స్వయంగా మార్క్స్



ఉపయోగించిన, మార్క్స్ మార్జినల్ నోట్స్ రాసుకున్న ఆడమ్ స్మిత్ రాసిన వెల్త్ ఆఫ్ నేషన్స్ ప్రతి ఉంది. ఆరోజుల్లో ఫొటోస్టాట్, స్కానింగ్ సౌకర్యాలు లేవు గనుక తాను చదివిన ఎందరో తనకంటె ముందరి రచయితల రచనల నుంచి మార్క్స్ వేలాది పేజీలు ఎత్తిరాసుకున్నాడు. వాటిని ఉటంకిస్తూ తన విశ్లేషణ సాగించాడు. అలా ఆడమ్ స్మిత్ వెల్త్ ఆఫ్ నేషన్స్ నుంచి ఎత్తి రాసుకున్న పేజీ కూడ ఇక్కడ ఉంది. కమ్యూనిస్టు మానిఫెస్టోలో ఒక పేజీ మార్క్స్ చేతిరాతలో, దాని మీద జెన్నీ వ్యాఖ్యతో ఇక్కడ ఉంది.

ఈ ప్రదర్శనలో ఏర్పాటు చేసిన వస్తువులు, వాటికి రాసి పెట్టిన వ్యాఖ్యలు కూడ చూసి తీరవలసినవి. ప్రారంభంలోనే "అర్థం చేసుకోవడం, మార్చడం, విముక్తి చేయడం' అనే శీర్షికతో "తన రచనల్లో కార్ల్ మార్క్స్ ప్రధాన దృష్టి స్వేచ్ఛ మీద ఉండేది. ఆ స్వేచ్ఛకు రెండు అర్థాలున్నాయి: ఒకటి, దోపిడీ నుంచీ, పీడన నుంచీ స్వేచ్ఛ. రెండు, ప్రతి మనిషీ తన సొంత అవసరాల, సామర్థ్యాల మేరకు జీవించే, పనిచేసే స్వేచ్ఛ" అని రాసి పెట్టారు. మార్క్స్ జీవితకాలంలో ఎంతెంత కాలం ఏయే ఊళ్లో గడిపాడో తెలియజేయడానికి ఇరవైకి పైగా ఇసుక గడియారాలతో ఒక బల్ల తయారు చేశారు.

మార్క్స్ ఉపయోగించిన గడియారం (ఆ రోజుల్లో చేతి గడియారం పెద్దగా వాడకంలోకి రాలేదు. ఒక గొలుసుకు కట్టి నడుముకు పెట్టుకునే, చేతిలో పట్టుకునే గడియారాలుండేవి) పెట్టి, "కార్ల్ మార్క్స్ గడియారం. మార్క్స్ తన జీవితమంతా పనిచేస్తూనే గడిపాడు – అయినా ఆయన చేయదలచుకున్న పనులు పూర్తి చేయడానికి ఆయనకు ఎప్పుడూ సమయం సరిపోయేది కాదు" అని వ్యాఖ్య పెట్టారు. లండన్ ఇంట్లో మార్క్స్ ఎప్పుడూ కూచుని చదువుకునే, చివరికి మరణించిన కుర్చీ కూడ ఇక్కడ ఉంది. ఆ కుర్చీని కావలించుకుంటే కన్నీళ్లు ఆగలేదు.

మార్క్స్ ప్రభావం గురించి కూడ ఈ ప్రదర్శనలో సవివరంగా మూడు నాలుగు గదుల్లో చిత్రించారు. మార్క్స్ మరణం తర్వాత 1939 వరకూ జరిగిన పరిణామాలు, బోల్షివిక్ విప్లవం, యూరప్‌లో బలపడిన సోషల్ డెమొక్రటిక్ పార్టీల చరిత్ర వంటివి ఈ విభాగంలో ఉన్నాయి. తర్వాతి విభాగం 1939 నుంచి ప్రపంచీకరణ వరకు, ఆ తర్వాతి విభాగం ప్రపంచీకరణ యుగంలో మార్క్సిజం ప్రభావం గురించి వివరించాయి.

మార్క్సిజాలు, లెనినిజాలు, స్టాలినిజాలు, గువేరాయిజాలు, మావోయిజాలు, ట్రాట్స్కీయిజాలు, పోస్ట్ మార్క్సిజాలు, ఆస్ట్రో మార్క్సిజాలు, టిటోయిజాలు, లిబరేషన్ థియాలజీ, క్రిటికల్ థియరీ, డెమొక్రటిక్ సోషలిజం వంటివన్నీ మార్క్స్ ఆలోచనాధార నుంచి వికసించినవేనని ఒక చిత్రం గీసి పెట్టారు. “మార్క్సిజం ఒక మూసుకు పోయిన సిద్ధాంతం కాదు’ అనే శీర్షికతో. “పందొమ్మిదో శతాబ్ది చివరి రోజుల నుంచీ సోషలిస్టులు, సోషల్ డెమొక్రట్లు కార్ల్ మార్క్స్ విశ్లేషణలకు తమ వ్యాఖ్యానాలను ‘మార్క్సిజం’ అనే పేరుతో పిలుస్తున్నారు. సమాజం మీద, పెట్టుబడిదారీ విధానం మీద ఆయన సాగించిన విమర్శ ఈ పేరుతోనే విశేష ప్రాచుర్యంలోకి వచ్చింది. ఆ కాలంలో యూరప్‌లోని ఎన్నో లేబర్ పార్టీలు తమను తాము మార్క్సిస్టుగానే భావించుకునేవి. కాని ఈ మాట మార్క్స్ తన మరణానంతరం ఏదో ఒక మూసుకుపోయిన సిద్ధాంతాన్ని మిగిల్చి వెళ్లిపోయాడేమోననే అపార్థానికి అవకాశం ఇస్తుంది. కాని కొన్ని ఎంపిక చేసిన మార్క్సిజాలను గనుక పరిశీలిస్తే, అది వాస్తవం కాదని తెలుస్తుంది. అందుకు భిన్నంగా పెట్టుబడిదారీ విధానం మీద మార్క్స్ చేసిన విమర్శ, విశ్లేషణ సమగ్రమైనవే గాని అసంపూర్ణమైనవీ, అక్కడక్కడ పొసగనివీ కూడ. అలాగే ఆయన రచనల్లో చాల భాగం చాల కాలం వరకూ ప్రచురణ కాలేదు గనుక, వేరువేరు వ్యక్తులు, పార్టీలు, ఉద్యమాలు ఆ ఖాళీలను పూరించడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో భాగంగా వాళ్లు కొత్త మార్క్సిజాలను తయారు చేశారు. వాటిలో చాల భాగం సారాంశంలో ఒకదానితో ఒకటి సంబంధంలో ఉంటాయి. కొన్ని మాత్రం వేరేవాటితో స్పష్టంగా వేరు చేసుకుంటాయి. అయినా మిగిలిపోయే ప్రశ్న: వాటిలో ప్రతి ఒక్కదానిలో ఎంత మార్క్స్ ఉన్నాడు అనేదే” అని రాసి పెట్టారు.

ఒకచోట గోడ మీద పెద్ద ఎర్ర కాన్వాస్ గుడ్డ మీద నలుపు రంగులో వందలాది గీతలు ఉంటాయి. దగ్గరికి వెళ్లి చూస్తే ఆ గీతలన్నీ ప్రపంచ ప్రసిద్ధులైనవారి పేర్లు, వివరాలు. ఆ పేర్ల మధ్య నుంచే ముదురు నలుపులో మార్క్స్ ముఖచిత్రమూ కనబడుతుంది. దగ్గరికి వెళ్లి ఆ పేర్లు చదివితే ఇరవయో శతాబ్ది తత్వవేత్తలు, శాస్త్రజ్ఞులు, రచయితలు, కళాకారుల పేర్లు కనబడతాయి. “ఇరవయో శతాబ్దిలో తత్వవేత్తలు, శాస్త్రజ్ఞులు, రచయితలు, కళాకారులు వంటి అసంఖ్యాకమైన మేధావులెందరో మార్క్సిస్టు భావాలతో ప్రభావితమయ్యారు. తమ జీవితాలలో కొద్దికాలం వరకు గాని, జీవితాంతం గాని ఆ భావాలతో ఉన్నారు” అని రాసిపెట్టారు.

ఒక చోట “మరణించాడని ప్రకటించారా లేక ఇంకా సజీవుడేనా? ఇంకా ఎంతకాలం ఉంటాడు” అనే శీర్షికతో “మార్క్స్ సామాజిక శాస్త్రాలలో, పరిశోధనలో జీవించే ఉంటాడు. మార్క్స్ మీద మేధోపూర్వక వ్యాఖ్యానాలు కొనసాగుతూనే ఉంటాయి” అని రాశారు.

చిట్టచివరికి, వాట్ ఈజ్ లెఫ్ట్ (మిగిలిందేమిటి) అనే శీర్షికతో “2007లో అమెరికాలో గృహరుణాల బుడగ పేలిపోయింది. రుణగ్రహీతలు తమ ఇళ్ల తనఖా రుణాలను చెల్లించలేకపోయారు గనుక, ఆ గృహరుణాల ఖాతాల విలువలు అంతర్జాతీయ స్టాక్ మార్కెట్లలో కుప్పకూలిపోయాయి. అంతర్జాతీయ బ్యాంకు, ద్రవ్య వ్యవస్థ సంక్షోభంలో పడింది. అమెరికాలోని లేమాన్ బ్రదర్స్‌తో సహా పెద్ద బ్యాంకులు పేకమేడల్లా కూలిపోయాయి. వారిని ఆదుకోవడానికి ప్రభుత్వాలు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ సంక్షోభం ద్రవ్యేతర రంగానికి కూడ వ్యాపించింది. యూరప్‌లో గ్రీస్ వంటి దేశాలు దివాళా ఎత్తే అంచుల వరకూ చేరాయి. అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానం ఉపయోగ కరమైనదనే ఊహాత్మక ఆశ ఈ కొత్త దెబ్బతో ధ్వంసమైపోయింది. యుద్ధాలు, ప్రజలను, పర్యావరణాన్ని దోపిడీ చేయడం, డిజిటలైజేషన్ ప్రతికూల ఫలితాలు సామాజిక రాజకీయ రంగాల విజయాలన్నిటినీ సవాలు చేస్తున్నాయని తేటతెల్లమైంది. ప్రపంచాన్ని సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా న్యాయబద్ధమైన సమాజంగా తీర్చిదిద్దే కార్యక్రమాలలో ప్రజలు ఇదివరకెన్నటికంటె ఎక్కువగా పాల్గొనడానికి ఈ సమస్యలు పురికొల్పాయి. కార్ల్ మార్క్స్ రాసిన కాపిటల్ అమ్మకాలు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్నాయంటే ఆశ్చర్యమేమీ లేదు” అని ప్రదర్శన ముగుస్తుంది.

**మ్యూజియం ఆమ్ డోమ్**

ఇక మరొక ఆసక్తికరమైన ప్రదర్శన ట్రియర్‌లోని చర్చి ఏర్పాటు చేసినది. హై కెథెడ్రల్ ఆఫ్ సేంట్ పీటర్ అనీ, ట్రియర్ కెథెడ్రల్ అనీ పిలిచే ఈ చర్చి పాత రూపంలో మూడో శతాబ్ది నుంచీ ఉందనీ, ప్రస్తుత రూపంలోని భవనం 1270 నుంచీ ఉందని చరిత్ర చెపుతునది. జర్మన్‌లో సాధారణంగా కెథెడ్రల్‌ను డోమ్ అంటారు. ఈ డోమ్‌కు అనుబంధంగా 1904 నుంచీ ఒక మ్యూజియం ఉంది.

ఇది మామూలుగా క్రైస్తవ మ్యూజియమే గాని, మార్క్స్ ద్విశతజయంతి సందర్భంగా మార్క్స్ శ్రమ గురించి రచించాడు, విశ్లేషించాడు గనుక శ్రామిక జీవితానికీ, మానవ గౌరవానికీ మధ్య ఘర్షణను అన్వేషించే ప్రదర్శన ఏర్పాటు చేయాలని ఈ మ్యూజియం నిర్వాహకులు తలపెట్టారు. ‘లీబెన్స్ వెర్ట్ ఆర్బైట్’ (సార్థకమైన శ్రమ) అనే శీర్షిక కింద ఏర్పాటు చేసిన ఈ ప్రదర్శన శ్రమను గౌరవించే, శ్రమ సౌందర్యాన్ని, నైపుణ్యాన్ని, సార్థకతను ప్రేమించేవారందరూ తప్పనిసరిగా చూడవలసినది. కళ, ఊహ, శారీరక శ్రమ, యాంత్రిక శ్రమ, మరమనుషుల శ్రమ వంటి అనేక రంగాలలో జరుగుతున్న సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలతో ఈ ప్రదర్శన తయారయింది. చేనేత, అల్లకం, కుట్టు, కుండల తయారీ, లోహ సామగ్రి తయారీ, భవన నిర్మాణం వంటి లెక్కలేనన్ని శ్రమ రూపాలు ఇక్కడ ఆరు హాళ్లలో ఆరు ఉపశీర్షికల కింద, ఆరు కీలకమైన ప్రశ్నలతో సాగాయి.

క్రైస్తవ సామాజిక నీతి, ప్రస్తుత పనిస్థలం – భవిష్యత్తు పనిస్థలం, శ్రమ ఇతివృత్తంలో వైతాళిక అన్వేషణలు, కళా పథకాల సహకారం, ఆటర్స్‌బర్గ్ యూనివర్సిటీ కళా పథకం, ప్రపంచీకరణలో శ్రామిక ప్రపంచపు ప్రభావాలు అనే ఉపశీర్షికల కింద ఆరు హాళ్లలో ఎన్నెన్నో శ్రమైక జీవన సౌందర్యపు చిహ్నాలను ప్రదర్శించారు. ప్రతి హాలు లోనూ ఒక ఆలోచనా స్ఫోరకమైన ప్రశ్న వేశారు: “నేను ప్రతిదీ చేయగలనా, చేయవచ్చా?”, “నేను శ్రమిస్తున్నప్పుడు నా ఆత్మ ఏం చేస్తుంటుంది?” “ప్రతిదీ ఇంతగా చెడిపోయిందేనా?” “నేను మరొకరిని అయి ఉండ గలనా?”, “ఎప్పటికైనా సంతోషం నన్ను చేరుతుందా?” “ఒక రోజంతా కష్టభరితమైన శ్రమ తర్వాత కడుపునిండా గంజి అడగడమే అపరాధమా?” అనేవి ఆ ప్రశ్నలు.

ఇంకా మరొక మ్యూజియం కూడ చూడవలసే ఉండింది గాని ఆ మ్యూజియం మూసివేసే సమయం కావడంతో, అప్పటికే రోజంతా తిరిగిన అలసటతో, అపారమైన అనుభవాల, అనుభూతుల, ఉద్వేగాల జడివానలో తడిసి ముద్దై వెనక్కి తిరిగాం. మరొకచోట రాసినట్టు జీవితం సార్థకమైందని అనిపించిన రోజు ఇది. ✦

# చైనా పరిణామాలు - శాస్త్రీయ అధ్యయనం

- ఎం. కృష్ణ ఆదిత్య

**1.** చైనాలో మళ్లీ జీవితకాల అధ్యక్ష పదవి – చైనా రాజకీయాలపై వీక్షణం, 2018 ఏప్రిల్ సంచిక సంపాదకీయ శీర్షిక ఇది. ఈ వ్యాఖ్య వాస్తవాలతో పనిలేని విధంగా ఉంది. దేశాధ్యక్షపదవిలో రెండు పర్యాయాలు మాత్రమే కూర్చోవాలన్న నిబంధనని రద్దు చేయాలన్న చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్ణయాన్ని చైనా పార్లమెంట్ ఆమోదించింది. అంత మాత్రాన అది జీవిత కాల అధ్యక్ష పదవి కాజాలదు. కానీ, ఈ వ్యాఖ్యలో, జిన్ పింగ్ జీవితకాల అధ్యక్షుడిగా కొనసాగేందుకు అవకాశం కలుగుతుంది, అని రాశారు. అవకాశం వేరు, వాస్తవం వేరు. శీర్షిక ఈ పరిస్థితిని వక్రీకరించేదిగా ఉంది. రెండో విషయం – సోషలిజంలో మార్కెట్ వ్యవస్థ గురించి ఉంది. దానికి సంబంధించి సిద్ధాంతాల క్లుప్త పరిచయం ఈ వ్యాఖ్య లక్ష్యం.

2. అవధుల్లేని అధికారం ఎన్నడూ ప్రజాస్వామికం కాదు – అని సంపాదకీయాన్ని ముగించారు. అక్కడ జరిగిందేమిటి? అవధుల్లేని అధికారమా? చైనా కమ్యూనిస్టుపార్టీ 9 కోట్ల మందికిపైగా సభ్యులు కల పార్టీ. కింది నుంచి పై స్థాయిదాకా జరిగే రెగ్యులర్ మహాసభల ద్వారా కేంద్రకమిటీని, కేంద్ర నాయకత్వాన్ని ఎన్నుకుంటుంది. అలాగే 50 శాతంకన్నా హెచ్చు ఓట్లు తెచ్చుకున్న సభ్యులతో కూడినది వారి పార్లమెంట్. ఈ రెండు వ్యవస్థల ద్వారా ప్రజాస్వామిక సూత్రాలను అనుసరించి వారి రాజ్యవ్యవస్థకు సంబంధించి కొన్ని మార్పులు చేసుకున్నారు. దీనిపై ప్రజాస్వామికం కాదు అని తీర్పు చేస్తే ఎలా? మావో తనకాలంలో జీవితకాలం పార్టీ అధ్యక్షుడిగా, దేశ అధ్యక్షుడిగా 26 ఏళ్లపాటు (1949–76) కొనసాగారు. ఆనాడు దాన్ని వెనకేసుకు వచ్చినవారు, కాదననివారు కూడా నేటి మార్పుకి విమర్శకులైనారు. నేటి నిర్ణయం రెండుసార్లు మాత్రమే అన్న నిబంధనను రద్దు చేసింది; అంతేకానీ జీవితకాల అధ్యక్ష పదవిని నిర్ణయించలేదు.

3. వ్యక్తిపూజ సంస్కృతి, అధికారంకోసం రక్తపాతం, అరాచకత్వం తదితర సామాజిక సంక్షోభాలు తలెత్తవచ్చు – అని రాశారు. మావో విప్లవ సాంప్రదాయాలని బలపరచడం అవసరమే. కానీ ఆనాటి తప్పులను వెనకేసుకురానక్కరలేదు. వ్యాఖ్యలో ఆ తప్పే చేశారు. పైవన్నీ మావో కాలంలో, సాంస్కృతిక విప్లవకాలంలో ఉండిన అవలక్షణాలేనన్నది ఎవ్వరూ కాదనలేని సత్యం. అలా మళ్లీ జరుగవచ్చునేమోనన్నది ఊహ మాత్రమే. చైనా పార్టీలో మావో తర్వాతి కాలంలో ఎలాంటి ప్రక్రియ అమలులో ఉన్నదో తెలియనివారు, లేదా తెలుసుకోవడానికి ఇష్టం లేనివారు ఇలాంటి ఊహాగానాలు చేస్తున్నారు. జీవితకాలం తిరుగులేని నాయకుడిగా కొనసాగిన మావో తర్వాతి కాలపు చైనా పార్టీ చరిత్ర, వాస్తవాలు తెలుసుకోవడం మంచిది. 9 కోట్ల సభ్యులుగల పార్టీ ఏం చెబుతున్నది? అని అర్థం చేసుకోవడం ధర్మం – అంగీకరించినా, అంగీకరించకపోయినా. మావో తర్వాత ముందుకు వచ్చిన డెంగ్ సియావో పింగ్ తిరుగులేని నాయకుడిగా ఉన్న దశలోనే జీవితకాలపు పదవిని స్వచ్ఛందంగా వదులుకున్నారు. ఒక వయసు దాటిన సీనియర్లంతా అలా వదులుకొనే ఒరవడిని ఆయన అమలు చేయగలిగారు. ఇప్పటికీ ఈ సూత్రం అమలులోనే ఉంది.

మావో వెన్వెంటనే వచ్చిన ప్రధాన కార్యదర్శి హువాకువోఫెంగ్‌ని నిర్మాణ పద్ధతి ప్రకారం మార్చివేసుకున్నారు. తర్వాతి దశల్లో ప్రధాన కార్యదర్శిగా ఎంపికైన హుయావో బాంగ్ 1988 జనవరిలో ఆ పదవికి రాజీనామా చేయాల్సివచ్చింది. తాను చైనా రాజకీయ సూత్రాలను, సమష్టి నాయకత్వ సూత్రాలను ఉల్లంఘించి చేపట్టిన చర్యల విషయమై ఆయన ఆత్మవిమర్శ చేసుకుని రాజీనామా చేశారు. ప్రధాన కార్యదర్శిగా రిలీవ్ చేయబడిన ఆయన ఆ తర్వాత పొలిట్‌బ్యూరోలో, స్థాయీసంఘంలో కొనసాగగలిగారన్నది గమనించాల్సిన అంశం.

హుయావో బాంగ్ తర్వాత ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైన జావో జియాంగ్ 1989లో జరిగిన విద్యార్థి తిరుగుబాటు పరిణామాల క్రమంలో కేంద్రకమిటీలో చర్చ తర్వాత బర్తరఫ్ చేయబడ్డారు. చైనా పార్టీ నాయకత్వాన్ని, చైనాలో సోషలిజాన్ని కూలదోయాలన్న ప్రకటిత లక్ష్యంతో కొన్ని శక్తులు ఆ తిరుగుబాటులో పాల్గొన్నాయి. దానిని అణిచివేసే కీలక సమయంలో సైతం చైనా పార్టీ కేంద్రకమిటీలో ఓటింగు జరిగి, నిర్ణయాలు తీసుకుని అమలు జరిపారని గమనించాలి.

4. పై క్రమంలోనే రెండు పర్యాయాల పదవీ విషయమై వారు కొన్ని కొత్త నిర్ణయాలు తీసుకున్నారు. నిబంధనను తెచ్చిందీ, రద్దుచేసిందీ వారే. ప్రజాస్వామ్య ప్రక్రియను అనుసరించే చేశారు. కొన్ని జాతీయ, అంతర్జాతీయ పరిణామాల దృష్ట్యా దాదాపు ఏకగ్రీవంగా ఈ నిర్ణయం తీసుకున్నారు. పై వాస్తవాలను చూడ నిరాకరించి, ఊహల ఆధారంగా వ్యాఖ్యానించారు. మనదేశంలోని, పాశ్చాత్య దేశాల్లోని అనుభవాల ఆధారంగా 'ప్రజాస్వామ్యం' సామ్రాజ్యవాద పెట్టుబడికి ముసుగుగా, ఎన్నో వక్రీకరణలతో ఎలా సాగుతున్నదో చూస్తున్నాం. ఆశ్రిత పెట్టుబడిదారీ విధానానికి ముసుగుగా బూర్జువా ప్రజాస్వామ్యం, వంశ పారంపర్య ప్రజాస్వామ్యం, ఫాసిస్టు ప్రజాస్వామ్యం' ఎలా సాగుతున్నాయో అనుభవిస్తున్నాం. ఈ వ్యవస్థలని ప్రశ్నించే, లేదా భిన్నంగా ఉన్న ఇతర దేశాల వ్యవస్థలని నిరంకుశత్వంగా వర్ణించడం పాశ్చాత్య వ్యాఖ్యాతలకు అలవాటు. వారి కోవలోనే, వారిచ్చిన సమాచారం ఆధారంగానే ఈ వ్యాఖ్య ఉన్నది. స్వతంత్రంగా, వాస్తవాల ఆధారంగా రాసినదిగా లేదు.

5. చైనా పాలకులు ఇంకా సోషలిజం ముసుగులోనే పాలన సాగిస్తున్నారు; సొంత ఆస్తిని పునరుద్ధరించారు; కమ్యూన్‌లను రద్దు చేసారు – అని రాశారు. చైనాలో కమ్యూన్‌లను రద్దుచేసి వ్యక్తిగత బాధ్యతా విధానం అనే వ్యవసాయరంగ సంస్కరణను చేసారన్నది నిజమే. కానీ సొంత ఆస్తిని పునరుద్ధరించారన్నది వాస్తవంకాదు. చైనాలో వ్యవసాయ భూమి ఈనాడు కూడా ప్రభుత్వ ఆస్తిగానే ఉంది. రైతులకు అనుభవించే హక్కు ఉంది. ఆ హక్కుని తర్వాతి తరం పొందే హక్కు

కూడా ఉంది. ఆస్తి వ్యవస్థ వేరు, నిర్వహణా పద్ధతి వేరు. సంస్కరించింది రెండో అంశం మాత్రమే. ఈ కీలకమైన వాస్తవాన్ని విస్మరించి, 'సోషలిజం ముసుగులోనే అని వ్యాఖ్యానించడం తప్పు. ఇది అవాస్తవం, అశాస్త్రీయం, హేతువిరుద్ధం కూడా.

6. మావో పద్ధతులని పక్కనపెట్టి, 'స్వేచ్ఛామార్కెట్' విధానాలను అనుసరిస్తూ వచ్చారు అంటూ చైనాలో పెట్టుబడిదారీ పునరుద్ధరణ జరిగిందన్న సిద్ధాంతాన్ని వల్లె వేశారు. లోతుపాతులు తెలుసుకోకుండా ఇలాంటి అవగాహన ఒకటి చలామణిలో ఉన్నది. మావోకాలంలో అంతా సవ్యంగా ఉందని, మావో తర్వాత డెంగ్ అంతా తిరగదోడారనీ ఒక అభిప్రాయం ఉంది. సోషలిస్టు నిర్మాణానికి సంబంధించి కొన్ని ఆర్థిక నియమాలు ఉన్నాయి, ఉంటాయి. లెనిన్, స్టాలిన్, మావో, డెంగ్‌లు వాటి పట్ల శాస్త్రీయ అవగాహన ఉండాలని, అవి మన ఇష్టాయిష్టాల ప్రకారం ఉండవని నొక్కి చెప్పారు. వాటి అవగాహన, అన్వయాలలో అనేక ప్రయోగాలు, అనుభవాలు, అంగీకారాలు, అనంగీకారాలు కూడా ఉన్నాయి. సోషలిజానికి ఒకే రకమైన రెడీమేడ్ మోడల్ ఏమీ లేదు. నిజానికి అచ్చంగా 'స్వేచ్ఛామార్కెట్' విధానాలు ఈనాడు ఏ సామ్రాజ్యవాద దేశంలో సైతం అమలులో లేవు. స్వేచ్ఛా మార్కెట్‌కీ, గుత్త పెట్టుబడిదారీ విధానానికీ పొత్తు కుదరదు. సామ్రాజ్యవాదం అంటేనే గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థ. ఇటీవలి కాలంలో అనేక దేశాల్లో అక్కడితో ఆగలేదు. ప్రొటెక్షనిజం, ఆశ్రిత పెట్టుబడిదారీ పద్ధతులు గుత్తపెట్టుబడికి తోడైనాయి.

కాగా చైనాలో అనుసరిస్తున్నది 'స్వేచ్ఛా మార్కెట్ పద్ధతి' కాదు. దాన్ని 'సోషలిస్టు మార్కెట్ ఎకానమీ' అంటారు. దానికే 'సోషలిస్టు ప్లాన్డ్ కమోడిటీ ఎకానమీ' అనే పేరు కూడా ఉంది. 'పబ్లిక్ ఓనర్‌షిప్' పైచేయిగా ఉండే వ్యవస్థ అది. 'రాజ్యం మార్కెట్‌ని రెగ్యులేటు చేస్తుంది; మార్కెట్ ఎంటర్‌ప్రైజెస్‌ని గైడ్ చేస్తుంది' – అన్నది దాని ప్రాతిపదిక. ఆ విధంగా ప్లానింగ్, మార్కెట్ మేళవించబడుతాయి. ఈ అవగాహనను చైనాపార్టీ డాక్యుమెంట్లలో చూడవచ్చును.

7. కొన్ని మౌలిక ఆర్థిక సూత్రాలను తెలుసుకోకుండా, లేదా విస్మరించి, ఇలాంటి అవగాహన ఒకటి చలామణిలో పెట్టబడి ఉన్నది. పెట్టుబడిదారీ విధానం–మార్కెట్; సోషలిజం–ప్లానింగ్; ఇవి విడదీయరాని జంటలని ఒక అవగాహన విస్తృతంగా ఉంటూవచ్చింది. ఇది తప్పు. దీన్ని చైనా పార్టీ వివరించింది. దాని అధ్యయనం అవసరం, ఉపయోగకరం. 'ఎకనామిక్ ప్రాబ్లమ్స్ ఆఫ్ సోషలిజం ఇన్ యుఎస్ఎస్ఆర్' పేరుతో స్టాలిన్ (1951లో) రచించిన గ్రంథం ఒకటుంది. మానవాళి చరిత్రలో మొదటిసారిగా శాస్త్రీయ సోషలిజం అమలు జరిగింది సోవియట్ యూనియన్ లోనే. కార్మికవర్గం అధికారం చేజిక్కించుకోవడం సోషలిస్టు విప్లవానికి నాంది. అది బతికి బట్టకట్టాలంటే సోషలిస్టు నిర్మాణం–అభివృద్ధి కీలకం. లెనిన్ కాలంలో విప్లవం విజయవంతమైంది. ఆ వెంటనే సామ్రాజ్యవాదుల జోక్యం, అంతర్యుద్ధం రష్యాని అతలాకుతలం చేశాయి. 1922 దాకా అలాంటి సంక్షోభం కొనసాగింది. నిర్మాణం–అభివృద్ధి తొలిదశలోనే 1924 జనవరిలో లెనిన్ మరణించారు. ఆ బాధ్యతని స్టాలిన్ చేపట్టి 1953లో తన మరణం దాకా కొనసాగించారు. ఆ అనుభవాలనే స్టాలిన్ పై పుస్తకంలో చర్చించారు. ఆ విధంగా సోషలిస్టు నిర్మాణం–అభివృద్ధి కొత్త అనుభవం, కొత్త ప్రయోగం.

8. ఈ పుస్తకంలో సోషలిజంలో కూడా సరుకుల ఉత్పత్తి వ్యవస్థ, మార్కెట్ పాత్ర ఉంటాయని, అవి పెట్టుబడిదారీ సమాజంతోనే ముగియవని నిర్ధారించారు. ఈ పుస్తకంపై మావో ఒక విమర్శతో కూడిన సమీక్షను ('క్రిటిక్') 1958లో రచించారు. చైనా భవిష్యత్తుకి ఉపయోగ పరచుకునే లక్ష్యంతో రష్యా అనుభవాలను మావో పరిశీలించారు. 'ఈ రచన నెట్'లో లభిస్తుంది.

9. సోషలిజంలో మార్కెట్ వ్యవస్థ గురించి మావో అభిప్రాయాలు : స్టాలిన్ పుస్తకాన్ని పైస్థాయి కమిటీలన్నీ అధ్యయనం చేయాలని, చైనాలోని వాస్తవ పరిస్థితులతో కలిపి చూడాలని మావో ఆ రచన ప్రారంభంలో నొక్కిచెప్పారు. ఆ సమీక్షలోని అంశాలు గమనించదగినవి. వాటిలోని కొన్ని అంశాలను పాఠకులు గమనించాలని మనవి. ఎవరు ఏ నిర్ధారణకు వచ్చినా, గమనంలోకి తీసుకోవలసిన అంశాలివి. 'శాస్త్రీయ సోషలిజం' అవగాహనకు ఇది అవసరం. మావో 'సమీక్ష'లోని కొన్నిఅంశాలు ఇవీ:

బూర్జువా హక్కు భావజాలంలో ఒక భాగాన్ని' రద్దుచేయాలని అనుకుంటాం; కానీ సరకుల వ్యవస్థను, విలువ సూత్రాన్ని, అవి బూర్జువా స్వభావం కలవే అయినా, వాటిని మన ఇష్టానుసారం రద్దుచేయలేం' – అంటారు మావో.

కమ్యూనిస్టు స్వర్గంలోకి ఒక్క అంగలో వెళ్లలేం, క్రమక్రమంగానే వెళ్లగలం. పీపుల్స్ కమ్యూన్‌లు ఉన్నా, అక్కడ సరుకుల వినిమయాన్ని, విలువ సూత్రాన్ని వినియోగించాల్సి వస్తుంది; సోషలిస్టు పరిణామ క్రమానికి అవి తోడ్పడుతాయి – అంటారు మావో.

స్టాలిన్ పుస్తకంలోని అనేక విషయాలను– సరకుల ఉత్పత్తి, విలువ సూత్రం మొదలైనవి మనం కూడా అంగీకరిస్తాం; అయితే కొన్ని సమస్యలు ఉన్నాయి – అని అందులో మావో రాశారు. వ్యవసాయ ప్రధాన దేశంగా, గ్రామీణ జనాభా 80 శాతందాకా ఉన్న దేశంగా చైనా పరిస్థితులు వేరు (రష్యాలో కన్నా వెనుకబడి ఉంటాయి) అని కూడా ఎత్తిచూపారు. అక్కడ మార్కెట్ పాత్రని నొక్కి చెప్పారు.

పెట్టుబడిదారీ కాలంలో అయినా, సోషలిస్టు కాలంలో అయినా– ఆర్థికాభివృద్ధికి, రాజకీయార్థిక శాస్త్రానికి చెందిన కొన్ని నియమాలు వర్తిస్తాయని చెప్పాల్సి ఉంటుంది. ప్రకృతి, విజ్ఞాన శాస్త్రంలో వలెనే, ఆర్థికాభివృద్ధి నియమాలు కూడా వస్తుగతమైనవి (ఆబ్జెక్టివ్), అవి మానవుని ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ఉంటాయని మావో రాశారు.

సోషలిస్టు ఆర్థికానికి సంబంధించిన 'రెడీమేడ్' అంశాలేవీ లేనందున, 'కొత్తవైన సోషలిస్టు ఆర్థిక రూపాలను సృష్టించాల్సి ఉంటుందని', ఈ క్రమాన్నీ అ–ఆ ల నుంచి మొదలు పెట్టాల్సివస్తుందని... నిస్సందేహంగా ఇది 'జటిలమైన, సంక్లిష్టమైన, ఇంతకుముందెన్నడూలేని కర్తవ్యంగా' ఉంటుందని మావో చెప్పారు. సోవియట్ యూనియన్ నుంచి నేర్చుకుని మనం మెరుగుపరచుకోవాలని, అలాకాక మన వ్యవహారాలని చెడగొట్టుకుంటే 'చైనీస్ మార్క్సిజం' పనిచేయదని అది చూపెడుతుందని అంటారు. ఆర్థిక నియమాలను రష్యా రద్దు చేయగలుగుతుందని, కొత్త వాటిని సృష్టించుకోగల్గుతుందని భావిస్తే–అది పూర్తిగా అసత్యం–అని చెప్తారు మావో.

మన ప్రణాళికా సంస్థలు సామాజిక ఉత్పత్తిని సరిగ్గా (కరెక్ట్ గా) ప్లాన్ చేయడం సాధ్యమే. ఇక్కడ సాధ్యం కావడాన్ని, వాస్తవంలో

సాధించడాన్ని కలగాపులగం చేయకూడదు. అవి రెండూ వేర్వేరు విషయాలు. సాధ్యతను వాస్తవం'గా మార్చగలగాలంటే, ఆర్థికాన్ని అధ్యయనం చేయడం, దానిపై పట్టు సాధించడం, పూర్తి అవగాహనతో దాన్ని అన్వయించగలగడం అవసరం. ఆయా నియమాలను పూర్తిగా ప్రతిబింబించగల్గినటువంటి ప్రణాళికలను రూపొందించుకోవాలి- అంటారు మావో. అలాంటి నియమాల్లో భాగమే సరకుల వ్యవస్థ, మార్కెటూ. ఈ నియమాలనూ, మన ప్రణాళికలనూ కలగాపులగం చేయకూడదు. గతంలో మనం అలాంటి ప్రణాళికలు రూపొందించాం; కానీ తరచుగా అవి తుఫానులని సృష్టించాయి.

అయితే అతి, కాకపోతే మరీ తక్కువ అయింది. అనేక వైఫల్యాల తరువాత, 40 అంశాల వ్యవసాయ కార్యక్రమం రూపొందించుకున్నాం. ఆ తర్వాత మళ్లీ కొత్త 40 అంశాలనూ తయారు చేసుకోవల్సివచ్చింది. ఈ క్రమాన్ని వాస్తవంగా సాధించగలమా? ఇప్పటికి వాస్తవిక ఆచరణలో దీన్ని ఇంకా నిరూపించాల్సే ఉన్నది-అని ప్రయోగాల అవసరాన్ని మావో నొక్కిచెప్పారు. మన ఉత్పత్తి ప్రణాళిక పూర్తిగా కరెక్టుగా ఉందని, అది వాస్తవిక సూత్రాలను పూర్తిగా ప్రతిబింబించిందని మనం చెప్పలేం. ఫలితంగా-మన ప్రణాళికలు వాస్తవిక సూత్రాలను పూర్తిగా ప్రతిబింబించ లేదు. అంతిమ పరిశీలనలో సరకుల ఉత్పత్తి ఉత్పాదక శక్తులతో కూడా ముడిపడి ఉంటుంది. అందువల్ల-పూర్తిగా సోషలైజు చేయబడిన పబ్లిక్ ఓనర్‌షిప్ కింద కూడా- సరకుల వినిమయం అమలులో ఉండడం- కొన్ని రంగాల్లోనైనా-తప్పనిసరవుతుందీ అని మావో అంటారు. సరకుల ఉత్పత్తి వ్యవస్థ అనగానే మనలో కొందరికి చిర్రెత్తుతుంది; అది పెట్టుబడిదారీ విధానమే అని భావిస్తాం. కానీ కోట్లాది రైతుల సంఘీభావాన్ని సమీకరించుకోగలగాలంటే, సరకుల ఉత్పత్తిని, మనీ సప్లయ్‌ని పెద్దయెత్తున పెంపొందించాల్సి వస్తుందని కనపడుతుంది- అని వెనుకబడిన, రైతాంగ దేశాల ప్రత్యేకతల దృష్ట్యా మావో చెబుతారు.

'పుస్తక పఠనం దృష్ట్యా చూసినప్పుడు చైనా ఆర్థికవేత్తలు మార్క్సిస్టు- లెనినిస్టులే. కానీ ఆర్థిక ఆచరణ ఎదురయ్యేసరికి వారి మార్క్సిజం- లెనినిజం పస ఏమిటో బయటపడుతుందీ' - అని మావో అంటారు. ప్రయోగాల అవసరం గుర్తిస్తారు.

'పట్టణాలకు-గ్రామాలకు, పరిశ్రమలకు-వ్యవసాయానికి మధ్య ఆర్థిక సంబంధాన్ని గట్టిపరచాలంటే, సరకుల ఉత్పత్తి వ్యవస్థని కొంతకాలం ఉంచాల్సిందేనని బోధపడుతుంది. పట్టణాలతో అలాంటి బంధం మాత్రమే రైతాంగానికి ఆమోదయోగ్యంగా ఉంటుంది' -అంటారు మావో. ఇంకా ఇలా అంటారు:

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకీ, వెనుకబడిన పారిశ్రామిక వ్యవస్థలకూ, వ్యవసాయ ప్రధాన దేశాలకూ తేడా ఉంటుంది. ఒకే దేశంలో పరిశ్రమలకూ-వ్యవసాయానికీ, పట్టణ వర్గాలకూ-రైతాంగానికీ కూడా తేడాలుంటాయి. కొన్ని వాస్తవిక ఆర్థిక సూత్రాలు, నియమాలకు లోబడి ఉంటాయి; మానవుడి ఇష్టాయిష్టాల ప్రకారం ఉండవు. వాటిని అవగాహన చేసుకుని, అన్వయించుకోవలసి ఉంటుంది. సరకుల ఉత్పత్తి వ్యవస్థ వద్దే వద్దూ అని కొందరనుకుంటారు. కాని అది తప్పు. ఆ వ్యవస్థను గురించి లెనిన్ నుంచి స్టాలిన్ నేర్చుకున్నారు. స్టాలిన్ నుంచి మనం నేర్చుకోవాలి అంటారు మావో. 'సరకుల ఉత్పత్తి వ్యవస్థ కేవలం పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించినదేకాదు-అన్నది నిజమే...సరకుల ఉత్పత్తి విడిగా ఒంటరిగా ఉండదు. సందర్భాన్నిబట్టి-పెట్టుబడిదారీ విధానంలోనా, సోషలిజంలోనా అని దాన్ని చూడాలి. పెట్టుబడిదారీ సందర్భంలో అది పెట్టుబడిదారీ సరుకుల ఉత్పత్తి వ్యవస్థగాను, సోషలిస్టు సందర్భంలో అది సోషలిస్టు ఉత్పత్తి వ్యవస్థగాను ఉంటుంది. నిజానికి సరుకుల ఉత్పత్తి ప్రాచీనకాలం నుంచీ ఉంటూ వచ్చింది'-అని మావో అంటారు. సరకుల ఉత్పత్తి వ్యవస్థ అంటే అది పెట్టుబడిదారీ వ్యవస్థేనని నిర్ధారించడానికి వీల్లేదని, దాని చారిత్రిక పూర్వ రంగాన్ని గుర్తు చేస్తారు మావో. డెంగ్ ఈ ప్రాతిపదికనే వివరించి, విస్తరించి 'సోషలిస్టు మార్కెట్ ఆర్థికవ్యవస్థ'ను ప్రతిపాదించారు.

'సోషలిస్టు యుగంలో మనం సరకుల వ్యవస్థని సంపూర్ణ వికసన దశవరకూ అభివృద్ధి చేయాలి.. యుద్ధాన్ని దశాబ్దాలపాటు సాగించాం. తైవాన్ విముక్తి కోసం ఇప్పటికీ ఓపిగ్గా ఎదురు చూస్తున్నాం...అలాగే సోషలిజం పరిణతికోసమూ ఎదురు చూడాల్సి వస్తుంది. మరీ త్వరగా విజయాలు వచ్చేస్తాయని ఆశించవద్దు' అంటారు మావో. చైనాలో సోషలిజం ప్రాథమిక దశలోనే ఉంది అని డెంగ్ సూత్రీకరించింది ఈ అవగాహనతోనే.

రష్యాలో సోషలిజం చాలా పరిణతి చెంది, వర్గరహిత కమ్యూనిజంవలె రూపొందుతున్నదన్న అతివాద అంచనావేసి, పొరపాటుచేసినట్టు స్టాలిన్‌కాలం చివరిలో గుర్తించబడింది. రష్యాలోని ఆ పొరపాటుని మావో కాలంలోనే చైనాపార్టీ గుర్తించింది. నేడు చైనాలో సోషలిజం ప్రాథమిక స్థాయిలో ఉన్నది; అక్కడ సోషలిస్టు మార్కెట్ వ్యవస్థకి కీలక పాత్ర ఉన్నది - అని డెంగ్ నాయకత్వంలో చైనాపార్టీ సూత్రీకరించింది. దానికి పైన వివరించినదే సిద్ధాంత పునాది. మనదేశంలో చాలామంది కమ్యూనిస్టులకు, అభ్యుదయవాదులకు ఆదర్శవాద, ఊహాజనిత సోషలిజమే ఒంటబట్టింది. వారికి ఎంగెల్స్ నొక్కి చెప్పిన శాస్త్రీయ సోషలిజం' అంతగా తెలియదు, పట్టదు. అందుకే అశాస్త్రీయమైన అవగాహనతో మాట్లాడుతుంటారు, విమర్శలు చేస్తుంటారు. ఈ విషయంపై సమగ్ర అధ్యయనం అవసరం; ఇవి తేలిగ్గా నిర్ధారించేవి కావు - అని నొక్కిచెప్పటానికే క్లుప్తంగా వాటిని పేర్కొనటం జరిగింది.

10. రష్యాలో సోషలిజం నిర్మాణ అనుభవాలతో రాజకీయ ఆర్థిక శాస్త్రం-పాఠ్యపుస్తకం' ఒకటి రష్యాలో ప్రచురించబడింది. స్టాలిన్ నేతృత్వంలో సోవియట్ ఆర్థికవేత్తల బృందం దాన్ని రూపొందించింది. దాన్ని సమీక్షిస్తూ మావో ఒక 'రీడింగ్‌నోట్స్'ని రాశారు. 1961-62లో రాసిన, 1969లో వెలుగుచూసిన ఈ సమీక్షలో కూడా పైన పేర్కొన్న అవగాహన ఉంది. రష్యాతో విభేదిస్తూనే, కొన్ని ఆర్థిక నియమాలను గుర్తిస్తూ మావో రచించారు. ఇవన్నీ మావో ఆలోచనా విధానంలో భాగం గా, మార్క్సిజం-లెనినిజం కొనసాగింపుగా అధ్యయనం చేయాల్సినవే.

11. 'సోషల్ సామ్రాజ్యవాదం' అంటూ చైనాని సంపాదకీయంలో విమర్శించారు. సిద్ధాంతరీత్యా చూసినా, ఆచరణలో చూసినా చెల్లని ఆరోపణ ఇది. సామ్రాజ్యవాదులు, వారి దళారీలు చేస్తున్న ఆరోపణను, వారి ప్రచారానికి తలొగ్గి చేయటం, అదీ సంపాదకీయంగా రావడం తగనిపని. దేశంలోని కొన్ని గ్రూపులు ఇలాంటి ప్రచారం చేస్తున్నాయి. పాశ్చాత్య మీడియా, పాశ్చాత్య మేధావులు వారికి మూలాధారం. చైనాపార్టీ ఏం చెప్తున్నది? అన్నదానితో వారికి పనిలేదు.

# జాతీయ మెడికల్ కమిషన్ బిల్లు - అభ్యంతరాలు

*వైద్య విద్యను వ్యాపారమయంగా మార్చి సాధారణ ప్రజలు అందుకోకుండా చేసే ప్రయత్నమే జాతీయ మెడికల్ కమిషన్ బిల్లు అని అంటున్నారు* **డా. నళిని**

**భా**రతీయ మెడికల్ కౌన్సిల్ (ఎంసిఐ)లో అవినీతి పేరుకు పోయిందంటూ 2015లో నీతి ఆయోగ్ వైద్య రంగంలో సంస్కరణలను ప్రతిపాదించింది. 2017 డిసెంబర్‌లో జాతీయ మెడికల్ కమిషన్ (ఎన్ఎంసి) బిల్లుని లోక్ సభలో ప్రవేశపెట్టారు. దేశ వ్యాప్తంగా డాక్టర్ల నిరసన ప్రదర్శనలు, సమ్మెలు జరగడంతో దాన్ని పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ముందు పెట్టారు. డాక్టర్ల సంఘాలన్నీ ఈ బిల్లుని వ్యతిరేకిస్తూ, కమిటీకి కొన్ని ప్రతిపాదనలు పంపాయి. రెసిడెంట్ డాక్టర్ల సంఘాల ఫెడరేషన్ (ఫోర్డాం) ప్రతినిధులు 2018 ఫిబ్రవరి 27న పార్లమెంటరీ కమిటీకి పంపిన ప్రతిపాదనలు, అభ్యంతరాలు ఇలా ఉన్నాయి.

1. ఈ బిల్లు జాతీయ మెడికల్ కమిషన్‌కి ఎలాంటి స్వాతంత్ర్యాన్ని ఇవ్వకపోగా, వైద్య విద్యని రాజకీయం చేసి, దాన్ని అధికారుల చేతిలో కీలు బొమ్మని చేస్తుంది.

2. ప్రతిపాదించిన కమిషన్‌లో సభ్యుల్ని అధికారుల సలహాతో ప్రభుత్వమే నామినేట్ చేస్తుంది.

3. ప్రస్తుతం ఉన్న రూపంలో ఈ బిల్లు ఆమోదయోగ్యం కాదు. అది ప్రజా వ్యతిరేక, పేదల వ్యతిరేక బిల్లు. ఇది ప్రజల ప్రాతినిధ్యం లేని ప్రజాస్వామ్య వ్యతిరేక లక్షణాలు కలిగి ఉంది.

4. బ్రిడ్జి కోర్సుని వ్యతిరేకించాలి. ప్రాక్టీస్ చేయాలంటే ఎక్సిట్ పరీక్షని పాసవ్వాలి అనే నిబంధనను ఆపాలి. ఈ పరీక్ష డాక్టర్ల ప్రతిభని అంచనా వేయలేదని వారి వాదన.

5. సుప్రీంకోర్టు ఆదేశాల ప్రకారం డాక్టర్లకి ఖచ్చితమైన డ్యూటీ వేళలు ఉండాలి. దేశ వ్యాప్తంగా ఇటర్న్ డాక్టర్లు అందరికీ ఒకే రకమైన స్టయిఫెండ్ విధానం తప్పనిసరిగా ఉండాలి. ప్రభుత్వ ఆసుపత్రులలో, మెడికల్ కాలేజీలలో సౌకర్యాలు మెరుగుపరచాలి. టీచర్లని ఎప్పటికప్పుడు నియమించాలి. ఖాళీలను వెంటనే భర్తీ చేయాలి.

6. ఫీజుల వసూల్లలో తేడాలను కూడా వారు వ్యతిరేకించారు. సీట్లలో 40 శాతం ప్రభుత్వ ఫీజుల ప్రకారం, మిగిలిన 60 శాతం సీట్లకి ప్రైవేట్ కాలేజీల ఫీజుల ప్రకారం వసూలు చేసే వీలుని ఈ బిల్లు కల్పించింది. దానికి బదులు, 85 శాతం ప్రభుత్వ ఫీజుల ప్రకారం 15 శాతం యుజిసి ప్రకారం ఉండాలని డాక్టర్లు డిమాండ్ చేస్తున్నారు.

ఇదిలా ఉండగా, 2018 మార్చ్ నెలాఖరుకి పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ప్రతిపాదనలని పరిగణలోకి తీసుకుంటూ, కేంద్ర క్యాబినెట్ ఈ ఎన్ఎంసి బిల్లుని ఆమోదించింది. మొదటి బిల్లుకి, మార్చిన బిల్లుకి మధ్య తేడాలు ఏమిటో, వాటిని కూడా డాక్టర్లు ఎందుకు ఖండిస్తున్నారో చూద్దాం.

1. ఆధునిక వైద్యాన్ని లేదా అల్లోపతిని ప్రాక్టీసు చేయడానికి 'ఆయుష్' డాక్టర్లకి వీలు కల్పించే 'బ్రిడ్జి కోర్సు' ప్రతిపాదనని క్యాబినెట్ రద్దు చేసింది.

కాని దొడ్డిదారిన ఈ ప్రతిపాదన అమలవుతోందని ఐఎంసి (ఇండియన్ మెడికల్ అసోసియేషన్) వాదిస్తోంది. ఎలా అంటే, గ్రామీణ వైద్యాన్ని పటిష్టపరచడం పేరుతో, అవసరానికి తగిన నైపుణ్యాన్ని పెంచే నెపంతో, 'మిక్సోపతి'ని, నకిలీ డాక్టర్లని ప్రోత్సహిస్తోందని వారి వాదన. సరైన నైపుణ్యం లేకుండానే అలాంటి వారు డాక్టర్లుగా చెలామణి అయ్యే ప్రమాదం ఉంది.

2. ఎంబిబిఎస్ ఆఖరి సంవత్సరం పరీక్షని దేశ వ్యాప్తంగా ఉమ్మడి పరీక్షగా నిర్వహించాలని క్యాబినెట్ నిర్ణయించింది. దాన్ని 'నేషనల్ ఎక్సిట్ టెస్ట్' (నెక్స్ట్) గా పిలవాలని అది నిర్ణయించింది.

కాని ఈ పరీక్షని దేశ వ్యాప్తంగా ఎవరు, ఎలా నిర్వహిస్తారనే విషయంలో స్పష్టత లేదని, ఆ పరీక్ష రూపకల్పన వివరాలు కూడా

---

గుత్తపెట్టుబడిదారీ విధానం, దాని అత్యున్నత రూపం సామ్రాజ్య వాదం అవుతుంది – అని లెనినిజం చెప్తుంది. చైనాలో గుత్త పెట్టుబడిదారీ విధానం అనే పునాది లేదు. వెనుకబడిన చైనాలో, అనేక (పబ్లిక్, సమిష్టి, ప్రైవేటు, వ్యక్తిగత) సెక్టర్లున్న చైనాలో గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రాతిపదిక లేదు. అలాంటిచోట సోషల్ సామ్రాజ్యవాదం ఎలా ఏర్పడుతుంది? అమెరికా అగ్రరాజ్యాన్ని, వారి మద్దతుతోవున్న భారత విస్తరణవాద పాలకులను ఎదుర్కోవాల్సిన స్థితిలోవున్న చైనాపై అలాంటి ఆరోపణలు చేయటం అర్ధరహితం. ఇది చెల్లని వాదన.

12. అంతర్జాతీయ, చైనా వ్యవహారాల నిపుణులైన జె.ఎన్.యు. ప్రొఫెసర్ అల్కా ఆచార్య జిన్‌పింగ్ ఎన్నికపై ఒక సమీక్షావ్యాసం రాశారు. (ఇపిడబ్ల్యు...5-5-2018). బీజింగ్‌లో ఒక యువపరిశోధకుడు 2017లో అన్న మాటతో తన వ్యాసం ముగించారు: 'మావో మమ్మల్ని విముక్తి చేశారు. డెంగ్ మమ్మల్ని సంపన్నులుగా మార్చారు. ఇప్పుడు జిన్‌పింగ్, పార్టీ చైనాను శక్తివంతంగా రూపొందిస్తారు.'

భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం విప్లవ గమనంలో కుంటుపడి, అనేక తప్పులు చేసి, ఎదురుదెబ్బలు తిని, ప్రతిష్ఠంభనలో ఉన్నది, మనదేశంలో మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం పట్ల అవగాహన కూడా అలాగే పిడివాదంలో కూరుకొని ఉంది. కాగా చైనా – విప్లవ విజయం తర్వాత, సోషలిస్టు నిర్మాణంలో అంచెలంచెలుగా ముందుకు సాగుతున్నది. పై వాక్యాలు అక్కడి పరిణామాలను అర్థంచేసుకోవడానికి ఉపయోగపడుతాయి

*(రచయిత పాత్రికేయుడు)* వీ

లేవని ఐఎంఎ అభ్యంతరం చెప్పింది.

3. జాతీయ మెడికల్ కమిషన్ ఏర్పాటు అప్రజాస్వామికమని డాక్టర్లు భావిస్తున్నారు. ఎందుకంటే, 25 మంది సభ్యుల్లో 80 శాతాన్ని నామినేట్ చేస్తారు. అంటే కమిషన్‌కి జాతీయ, ప్రజాస్వామిక ప్రాతినిధ్య లక్షణమే ఉండదు.

4. ప్రైవేట్ పాఠశాలల్లో, డీమ్డ్ యూనివర్సిటీల్లో 40 శాతం సీట్ల ఫీజుని ప్రభుత్వం నిర్ణయిస్తుందనే ప్రతిపాదనని క్యాబినెట్ 50 శాతానికి పెంచింది.

కాని ప్రస్తుతం ఫీజు నియంత్రణ ప్రభుత్వం చేతిలో 80 శాతం, ప్రైవేట్ కాలేజీ చేతుల్లో 15 శాతంగా ఉంటే, దాన్ని ఇప్పుడు బిల్లులో 50 శాతం చేశారు. ఇది పేదలకి, ప్రజలకి ఎలా ఉపయోగమో ప్రభుత్వమే చెప్పాలి. గ్రామీణ ప్రాంతాల్లో డాక్టర్లు కావాలంటూ ప్రభుత్వం పట్టణ ధనికులకి కోటాని పెంచడం సబబు ఎలా అవుతుందని ఐఎంఎ ప్రశ్నిస్తోంది. పేదరికం పీడిస్తుంటే అవకాశాలు, వసతులు లేకపోవడం వంటి అననుకూల పరిస్థితుల్లో చదువుకునే పేదవారికి వైద్య విద్య గగన కుసుమమైపోతుంది. అందుకే నిరుపేద వ్యతిరేక, ధనిక అనుకూల కమిషన్‌ని సవరించాలని ఐఎంఎ కోరుతోంది. ఈ దిశగా వారు మార్చ్ 25న ఢిల్లీలో 25 వేల మంది డాక్టర్లతో మహా పంచాయత్ ప్రదర్శనని నిర్వహించారు. పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ప్రతిపాదనలు మోసపూరితమైనవని దుయ్యబట్టారు. దొడ్డిదోవన 'క్రాస్‌పతీ'ని ప్రోత్సహించి, నకిలీ వైద్యాన్ని చట్టబద్ధం చేస్తున్నారని ఆరోపించారు.

'కాపలాదారులని కావలి కాసేవారెవరు?' అనే రోమన్ కవి జువెనాల్ మాటలని ఉటంకిస్తూ, కంటి వైద్య నిపుణులు రఘురాజ్ హెగ్డే కూడా తన వాదనలు ఇలా వినిపించారు. ఈ బిల్లు ప్రతిపాదనలో ప్రజల, వైద్యుల పాత్ర ఎంత మాత్రం లేదు. ముఖ్యంగా మెడికల్ డాక్టర్లు, కొంత మంది ప్రభుత్వ నియమిత సభ్యులతో ఏర్పడిన మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా (ఎంసిఐ) ఇన్నాళ్లూ అని కాలేజీల్లో ఒకే రకమైన ప్రమాణాల కోసం పాటుపడింది. డిగ్రీలను గుర్తించడం, రద్దు చేయడంలో తగిన పాత్ర వహించింది. శాశ్వత రిజిస్ట్రేషన్‌కి వీలు కల్పించింది. విదేశీ వైద్య సంస్థలతో కలిసి, పరస్పర డిగ్రీల గుర్తింపుని సాధ్యం చేసింది. అయితే ఎంసిఐలో అవినీతి కారణంగా 69 కళాశాలల్లో అవకతవకలు జరిగాయి. ఎంట్రన్స్ పరీక్షల్లో రిగ్గింగ్, విద్యార్థుల అడ్మిషన్ల కోసం లంచాలు తీసుకోవడం వగైరాలు జరిగాయి. అలా ప్రైవేట్ మెడికల్ కళాశాలల్లో అవినీతి పేరుకుపోతోంది. దేశానికేమో వైద్యం అవసరం.

మనదేశంలో డాక్టర్లకి కొరత లేదు. కాని నైపుణ్యంగల డాక్టర్ల కొరత ఉంది. ఈ లోటుని సరిచేసే దిశగా ఎన్ఎంసి బిల్లు పనిచేయదు. ఎందుకంటే ఎంసిఐ స్వయం నియంత్రణ కలిగిన, ఎన్నికైన, సంయుక్త నిర్మాణంగల సంస్థ. కాని జాతీయ మెడికల్ కమిషన్‌లో ప్రభుత్వ అధికారులు, సామాజిక కార్యకర్తలు, చార్టర్డ్ ఎకౌంటెంట్‌లు, ఇంజనీర్లు, లాయర్లు, మేనేజ్‌మెంట్ నిపుణులు ఉంటారు. అది ఎంత హాస్యాస్పదమో ఈ కంటి డాక్టరు ఇలా వివరిస్తారు, 'ఆ వృత్తితో సంబంధంలేని బయటవాళ్లు ఒక వృత్తిని నియంత్రించడం హాస్యాస్పదం. డాక్టర్లు, ఇంజనీర్లు సిఏలను నియంత్రిస్తే ఎలా ఉంటుంది? రాజకీయ నాయకులు, అధికారులు, మేనేజ్‌మెంట్ నిపుణులు బార్ కౌన్సిల్‌ని నడిపితే ఎలా ఉంటుంది? డాక్టర్లు కాని వారు, ఎంసిఐలో దొరికిన కొందరు అవినీతి పరుల కంటే నీతిగలవాళ్లా? ఈ కొత్త బిల్లు అవినీతిని ఎలా నిరోధించగలదు?'.

ఏ ప్రభుత్వం కూడా ఒక వృత్తిపరమైన సంస్థని నడపకూడదు. ఎందుకంటే అక్కడ తమతమ ప్రయోజనాల మధ్య ఘర్షణ తలెత్తే అవకాశం ఉంటుంది. రాజకీయ నాయకులు మెడికల్ కాలేజీల యజమానులు కావడం వల్ల, ఓటు బ్యాంకు రాజకీయాల వల్ల ఈ ఘర్షణ ఏర్పడవచ్చు. అప్పుడు వైద్యాన్ని ప్రజోపయోగ అవసరాలు తీర్చడానికి కాక, రాజకీయ లక్ష్యాలను చేరుకోవడానికి వినియోగించుకునే ప్రమాదం ఉంది.

జాతీయ మెడికల్ కమిషన్ వల్ల రెండు నష్టాలు ఉన్నాయి. అవి ఏమిటంటే, 1. తప్పుదోవ పట్టిన మెడికల్ కాలేజీలని తేలిగ్గా నెలకొల్పే వీలు కల్పిస్తుంది. ఒకసారి అప్రూవల్ వచ్చాక ఆ తర్వాత వారి వసతులు తగు స్థాయిలో లేకపోయినా కాలేజీని రద్దు చేసే అవకాశం ఉండదు.

2. అండర్ గ్రాడ్యుయేట్ సీట్లు పెంచుకునే అవకాశం కల్పించడం వల్ల వారు కేంద్ర నియంత్రణ సంస్థ అనుమతి లేకుండానే పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు ఆరంభించే వెసులుబాటు కలుగుతుంది. మొత్తం మీద ప్రైవేట్ యాజమాన్యాల మీద నియంత్రణ, నిఘా మాయమైపోతుంది.

ఈ అవకతవకల వల్ల ప్రభుత్వ, ప్రైవేట్ మెడికల్ కళాశాలలన్నిటిలో ఒకే రకమైన ప్రమాణాలు ఏర్పడే అవకాశం లేదు. డాక్టర్లు, ప్రజలు, ప్రభుత్వం కలిసి నిర్ణయాలు తీసుకోవలసిన అవసరం ఉండగా, ప్రభుత్వం మాత్రమే పెత్తనం చేసే అవకాశం ఉంది. మన వైద్య ఆరోగ్య బడ్జెట్ కేటాయింపులు జిడిపిలో 1.3 శాతాన్ని మించి ఉంటేనే మన వైద్య, ఆరోగ్య వ్యవస్థ మెరుగుపడుతుంది. ప్రభుత్వ విధానాలు పేదలకి అందుబాటులోకి వస్తాయి.

వైద్యంలో డిగ్రీలు లేకుండా వైద్యం చేసే వారికి సంవత్సరం శిక్ష, ఐదు లక్షల జరిమానా అని క్యాబినెట్ ఆమోదించింది. అలానే ఎంబిబిఎస్ డాక్టర్లకి గ్రామీణ పోస్టింగు ఉండాలని, మన గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేట్లు మనదేశంలో తప్పకుండా కొంత కాలం పనిచేయాలనే నిబంధన పెట్టాలని పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ప్రతిపాదించింది. ఇవి అమలైతే మంచిదే. కాని మిగిలిన ప్రతిపాదనలు మాత్రం ప్రజా వ్యతిరేకమైనవేనని చూశాం.

బ్రిటిష్ మెడికల్ జర్నల్ (బిఎంజె) ఎడిటర్ రిచర్డ్ హోర్టన్ మన వైద్య విధానాన్ని ఇలా వర్ణించాడు. 'ఇండియా ఒక అంచుకి చేరుకుంది. దాని ముందు రెండు మార్గాలున్నాయి. ప్రజల కోసం పనిచేస్తూ భవిష్యత్తుని ఆశాజనకంగా, సంపూర్ణంగా రూపుదిద్దడం, లేదంటే ఇప్పటిలాగే వైద్యాన్ని నిర్లక్ష్యం చేయవచ్చు. అప్పుడు దేశ వ్యాప్తంగా అంటు వ్యాధులు ప్రబలి, భవిష్యత్తుని నాశనం చేస్తూ, జాతీయ భద్రతని పణంగా పెట్టవచ్చు. మనం మయన్మార్, నియోగ్రాలియోన్, హయితీల్లా ప్రజోపయోగ సేవలను నిర్లక్ష్యం చేస్తామా, లేదా యూరప్, థాయ్‌లాండ్, క్యూబా వంటి మెరుగైన వైద్య ఆరోగ్య సేవల అనుభవాన్ని చూసి మన వైద్యాన్ని మెరుగు పరచుకుంటామా అనేది ఇప్పుడు మన ముందు ఉన్న ప్రశ్న'. ఇలాంటి బిల్లులు మన వైద్య రంగాన్ని అధఃపాతాళానికి తొక్కక ముందే వైద్యులు, వైద్య నిపుణులు సరైన సూచనలిచ్చి, బడ్జెట్ కేటాయింపులు పెంచి, ప్రభుత్వ ఆసుపత్రులను మెరుగుపరచాలి.

*(రచయిత చిన్న పిల్లల వైద్యురాలు)* వీ

# బస్తర్‌లో భూ సంబంధాలు - 3

*ఆదివాసులు జీవిక కోసం అటవీ ఉత్పత్తులపై, వ్యవసాయంపై ఏ విధంగా ఆధారపడుతున్నారో చెపుతూ, అటవీ ఉత్పత్తులను స్థానిక షావుకారులు, ఖనిజ సంపదను కార్పొరేట్ కంపెనీలు ఎలా దోపిడీ చేస్తున్నారో తెలియచేస్తున్నారు* **విశ్వం**

*(గత భాగం తరువాయి...)*

**అటవీ ఉత్పత్తులు**

బస్తర్‌లోని మెజారిటీ ఆదివాసులు వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా స్వీకరించినప్పటికీ ఇంకనూ అడవిపై ఆధారపడడం మానలేదు. ఆదివాసుల జీవితావసరాలను అడవియే 50-80 శాతం మేర తీరుస్తున్నది. వ్యవసాయం తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న నేటి రోజులలో అటవోత్పత్తులకు ఉజ్వల భవిష్యత్తు ఉంది. ఆదివాసుల సొంతమైన అటవీ సంపదను ఎవడికి తోచిన విధంగా వాడు దోచుకొనిపోయే విధానాన్ని నిలవరించాల్సి ఉంది. అటవీ ఉత్పత్తులు రెండు రకాలు. తన అవసరాలను తీర్చుకునేందుకు ఉపయోగపడేవి కొన్నయితే, మారకం చేసేందుకు ఉపయోగపడేవి మరికొన్ని.

2014-15 సంవత్సరంలో సర్వే చేసిన గ్రామాలలోని మొత్తం 490 కుటుంబాల అటవోత్పత్తుల వివరాలు ఇలా ఉన్నాయి. నేటి మార్కెట్ ధరల ప్రకారం ఇప్పపూవు రు. 12,20,000 (పైలీ రు. 20), చింతపండు రు. 6,43,249 (కెజి రు. 19), కొసకాయలు రు. 1,81,400, బంక రు. 1,11,000, మామిడి ఒరుగులు రు. 43,950. ఇంకా ఇతర అటవోత్పత్తులు 33,364. మొత్తంగా రు. 23,77,185. సగటున ఒక్కో కుటుంబానికి రు. 4,851 ఆదాయం లభిస్తుంది. ఇందులో ఇప్పపూవును సగమ్మేర తమ అవసరాలకు గానూ దగ్గరుంచుకుని మిగతాదంతా నడుమ నడుమ తమ ఇతర అవసరాలను (సబ్బులు-చెప్పులు) తీర్చుకోవడం కోసమని కొంచెం కొంచెంగా అమ్ముతుంటారు. అటవీ ప్రాంతంలోని ఆదివాసులైనా, ఆదివాసేతరులైనా ధాన్యం తర్వాత ధాన్యంతో సమానంగా ఇప్పపూల సేకరణయే ప్రధానంగా ఉంది. తొండవేడ, ఇర్పనారు లాంటి లోతట్టు గ్రామాల్లోనైతే కొన్ని కుటుంబాలు ధాన్యపు పంటను మించి ఇప్పపూలను సేకరిస్తున్నాయి.

**గ్రామాల వారీగా వ్యవసాయోత్పత్తులు - అటవీ ఉత్పత్తులు**

| | యూనిట్ | కుటుంబాలు | వ్యవసాయ ఉత్పత్తులు రూపాయలలో | అటవీ ఉత్పత్తులు రుపాయలలో |
|---|---|---|---|---|
| 1 | ఆదేవేడ | 44 | 2,54,350 | 4,36,295 |
| 2 | తొండవేడ | 74 | 2,96,700 | 6,47,700 |
| 3 | మంగనారు | 95 | 2,80,810 | 3,34,770 |
| 4 | పిచ్‌కొడ్డేర్ | 59 | 3,79,910 | 4,18,698 |
| 5 | ఇతమెట్ట | 60 | 3,13,520 | 1,49,263 |
| 6 | హర్రెకొడ్డేర్ | 84 | 4,47,260 | 2,67,608 |
| 7 | హర్రెకొడ్డేర్ (గైరాదివాసి) | 75 | 3,37,280 | 1,22,853 |
| | **మొత్తం** | **490** | **23,09,830** | **23,77,187** |

ఈ యూనిట్లలో మొత్తం 20 గ్రామాలున్నాయి. బస్తర్‌లో ఇప్పచెట్లను కల్ప వృక్షంగా భావిస్తారు. ఒక్కో ఇప్పచెట్టు ఏటా 500-1000 రుపాయల వరకు ఆదాయాన్ని సమకూర్చి పెడుతుంది. ఏదో ఒక కుటుంబం మినహాయిస్తే దాదాపు అన్ని కుటుంబాలకు 5-10కి తక్కువ కాకుండా ఇప్పచెట్లు ఉన్నాయి. లఘు అటవోత్పత్తుల సేకరణ కూడా గరిష్టంగా గాక కనీసస్థాయిలోనే జరుగుతున్నది. సేకరించిన ఉత్పత్తులను పెద్ద మొత్తంలో నిల్వచేసుకునే పద్ధతి లేకపోవడం, అలాగే సేకరించిన ఉత్పత్తులను కూడా వెంట వెంటనే మార్కెట్టుకు తరలించే తగిన రవాణా సౌకర్యాలు కూడా లేకపోవడంతో వాటి సేకరణ తక్కువ మొత్తంలోనే సాగుతున్నది. అటవోత్పత్తుల సేకరణలో కూడా పెద్ద మొత్తంలో సేకరించి బాగా సంపాదించాలనే వ్యాపార దృష్టి లేకపోవడంతో సేకరణ మొత్తంలో 30-40 శాతానికి మించడం లేదు. వాస్తవంగా ఇప్పపూలను మొత్తంగా గాక సగం మాత్రమే ఏరడం జరుగుతున్నది. మిగతా సగానికి పైనే పశువులు, మేకలు, పందులు తింటున్నాయి. ఇప్పపూలను ఒక్కో కుటుంబం 5-10 కండీలకు తక్కువ కాకుండా సేకరిస్తారు. ఏటా 20-40 కండీలు కూడా సేకరించే కుటుంబాలు ఉన్నాయి. అయితే అప్పుడప్పుడు కాలం పోతే చేసేదేమీ లేదు.

అటవోత్పత్తులలో ఇప్పపూలు, చింతపండుతో పాటు సారపప్పు, గారపప్పు, కోసుం, బంక, దూపం (గుగ్గిలం), మామిడి (ఒరుగులు), గుగ్గిలం గింజలు, చేరోటా, ఉసిరి, కరక్కాయ, కోసకాయ ఉన్నాయి. ఇవేగాక తేనె, క్వినయిన్ సంబంధిత అడవి వేప లాంటి ఔషధ మొక్కలు, వేర్లు, చెట్లతోల్లను సేకరించి సంతలో అమ్ముతుంటారు. (ఔషధ మొక్కల సేకరణ ఈ మధ్య కాలంలో చాలా తగ్గినవి) అలాగే దుప్పి, చిరుతపులి, జాదుం లాంటి జంతువుల చర్మాలను కూడా కొంత (షికారుదార్లు) మంది అమ్ముతుంటారు. వీటిని అమ్మగా వచ్చిన ఆదాయం వారి డిపాజిట్ల (నిలవ) ఆదాయాలలో ప్రధానమైనది. అటవోత్పత్తులలో పెద్ద మొత్తంలో ఆదాయాన్ని చేకూర్చి పెట్టేదాంట్లో ఇప్పపూలు, చింతపండు తర్వాత కోసకాయ, బంక, లక్క వస్తాయి. కోసకాయల సేకరణలో ఒక్కో కుటుంబం సాధారణంగా 2-3 రూపాయల విలువ చేసే మొత్తాన్ని సేకరిస్తారు. కాగా అరకొర వ్యక్తులు మాత్రం 10-20 వేల రూపాయల విలువైన మొత్తాన్ని సేకరిస్తారు. వీటిపై ఒక్కో సీజన్‌లో లక్ష రూపాయల వరకు కూడా సంపాదించే కుటుంబాలున్నాయంటే కూడా ఆశ్చర్యపడాల్సింది లేదు. వీటి తర్వాత తక్కువ మొత్తంలో ఆదాయాన్ని సమకూర్చేవి మామిడి, ఉసిరి, కరక్కాయ, కోసుం, చెరోటా, గుగ్గిలం గింజలు, సారాపప్పు ఉన్నాయి. వీటిని సేకరించి సంతల్లో అమ్మడం ద్వారా తమకవసరమైన బట్టలు, నూనెలు, సబ్బులు, పాత్రలు లాంటివి కొనుక్కుంటూ ఉంటారు. ఈ గ్రామాలలోని మెజారిటీ ఆదివాసి

రైతాంగానికి తాము పండించిన వ్యవసాయోత్పత్తులు సగటున 4-6 నెలలకు సరిపోగా మిగతా కాలానికి గానూ అటవోత్పత్తులపై వచ్చే ఆదాయం పైనే ఆధారపడాల్సి వస్తున్నది. గతంలో నూకల కోసమని కోసుం గింజలను సేకరించి సంతల్లో మార్పిడి చేసి సరికిసరి నూకలు తెచ్చుకునేవారు. ఇప్పుడు రేషన్ కార్డుపై బియ్యం దొరుకుతూ ఉండడంతో కోసుం గింజల సేకరణ దాదాపుగా నిలిచిపోయింది.

అటవోత్పత్తులలో కూడా అన్ని అంతటా దొరకడం లేదు. లక్కసేకరణలో దొరికితే, పూర్వ బస్తర్‌లో మొత్తానికే లేదు. అదే పూర్వ బస్తర్‌లోని వాయనారులో తునికాకు సేకరణ ఉంటే అముదాయి, ఆదేవేడ, తాండవేడల్లో అది లేనేలేదు. కొసకాయలు వాయనారు, కుదురు, కిల్లెం, ఆదేవేడ ప్రాంతాలలో పెద్ద ఎత్తున సేకరించడం ఉన్నది. అదే కోసకాయ హద్దేర్, పిచ్‌కొద్దేర్, మంగనారు ప్రాంతాలలో నామ మాత్రమే. మామిడి (ఒరుగులను) హద్దేర్, మంగనారులలో ఆదివాసులతో పాటు ఆదివాసేతరులు కూడా సేకరిస్తున్నారు. పశ్చిమ బస్తర్‌లో మామిడి (ఒరుగులు) సేకరణ పెద్ద ఎత్తున జరిగితే మాడ్‌లో చివురుగడ్డిని పెద్ద ఎత్తున సేకరించడం ఉంది. ఒక్కొక్కటి ఒక్కో ప్రాంతంలో అధికంగా లభ్యమవుతున్నది. మామిడి, చింత, కోస లాంటి వాటి కాపుకాలం రెండేసి సంవత్సరాలుగా ఉంది. ఇప్పపూలు, మామిడి ఈ సంవత్సరం విరగగాస్తే వచ్చే సంవత్సరం వాటి కాపు 5-10 శాతానికి మించే ఉండడం లేదు. చింత, కోసకూడ అంతే, ఈ ప్రాంతంలో వెదురు వనాలు విస్తృతంగా ఉన్నా నరకడం అనేది లేదు.

అటవోత్పత్తులను సేకరించడం, వాటిని సంతలలో మారకం చేయడం అంత సులువైన విషయమేమీ కాదు. ఎండలో, వానలో సైతం ఎంతో కష్టపడాల్సి వస్తున్నది. లఘు అటవోత్పత్తులను సేకరిస్తున్న సమయంలో చెట్లపై నుండి కింద పడడం, పాము కాటుకు గురికావడం, క్రూర మృగాల దాడులకు గురై మరణించినవారు, గాయపడినవారు ఎందరో ఉన్నారు. సేకరించిన వాటిని కూడా సంతలకు వెంట వెంటనే తీసుకెళ్లడానికి ఎటువంటి ట్రాన్స్‌పోర్ట్ సౌకర్యం లేకపోవడంతో బుజాలపై పదుల కిలోమీటర్లు శ్రమకోర్చి కావడితో మోయాల్సి వస్తున్నది. అంత కష్టపడి తీసుకెళ్లిన వాటిని సంతలలో షావుకార్లు రకరకాల కారణాలతో, తప్పుడు లెక్కలతో, కొలతలతో ఆదివాసులను మోసం చేస్తూ నిలువు దోపిడీ చేస్తున్నారు. సంతలలో షావుకార్ల ఆగడాలు, ప్రభుత్వం నీతిమాలిన విధానాల ఫలితంగా ఒక్కోసారి సేకరణలో అయోమయ పరిస్థితి నెలకొంటున్నది. షావుకార్లు ఎప్పుడు ఏది కొంటారో, ఏది కొనరో తెలియని స్థితిలో క్రమబద్ధంగా సాగే లఘు అటవోత్పత్తుల సేకరణలో మందత్వం నెలకొంటున్నది. కొన్ని సార్లయితే ఎంతో కష్టపడి సేకరించి అంతదూరం మోసుకెళ్లిన వాటిని షావుకార్లు తీసుకో నిరాకరించడంతో వాటిని అక్కడే నేలపాలు చేసి రావాల్సి వస్తున్నది. 15 రకాల అటవోత్పత్తులను గిరిజన కార్పొరేషన్ల ద్వారా కొనుగోలు చేస్తానని ప్రకటించిన ఛత్తీస్‌గఢ్ రమన్‌సింగ్ ప్రభుత్వం చివరకు వాటి కొనుగోలును షావుకార్ల పుణ్యానికే వదిలేసింది. వ్యవసాయంలో మౌలిక సౌకర్యాల కొరతతో పాటు సాగు చేయడంలో సైతం నిపుణత కొరవడిన కారణంగా వ్యవసాయం పైనే పూర్తిగా ఆధారపడలేని స్థితి ఒకవైపు. అటు అటవోత్పత్తుల పైనన్న ఆధారపడుదామనుకుంటే మార్కెట్ ఆశాజనకంగా లేకపోవడంతో ఆదివాసుల పరిస్థితి సంకటంగా తయారయింది. అయినా కూడా అటవోత్పత్తుల డిమాండ్ ఏమాత్రం తగ్గలేదు. ప్రకృతి వనరులు రోజు రోజుకు తరిగిపోతున్న నేటి తరుణంలో వాటికి మంచి డిమాండే ఉంది. అటవీ ఉత్పత్తుల సేకరణ విధానం కాలం చెల్లిన ఉత్పత్తి విధానమేమీ కాదు. వ్యవసాయోత్పత్తుల, అటవోత్పత్తుల గిట్టుబాటు ధరల సూచికను చూసిన ఈ విషయం అర్థమవుతుంది.

అటవోత్పత్తులలో సంతలలో మారకం జరిగేవే గాక రోజువారీగా

**వ్యవసాయ - అటవీ ఉత్పత్తుల గిట్టుబాటు ధరలు**

| | వ్యవసాయ ఉత్పత్తులు | 1995 | 2014 | పెరుగుదల |
|---|---|---|---|---|
| 1 | ధాన్యం (వరి) | 6.00 | 10.00 | 1.6 రెట్లు |
| 2 | ఆవాలు | 14.00 | 40.00 | 2.8 రెట్లు |
| 3 | పప్పులు | 13.00 | 50.00 | 3.8 రెట్లు |
| 4 | కోహలా | 0.50 | 30.00 | 60 రెట్లు |
| నెం | అటవీ ఉత్పత్తులు | 1995 | 2014 | పెరుగుదల |
| 1 | ఇప్పపూవు | 2.75 | 20.00 | 7.2 రెట్లు |
| 2 | గుగ్గిలం గింజలు | 1.10 | 10.00 | 9.0 రెట్లు |
| 3 | కరక్కాయ | 1.10 | 7.00 | 6.3 రెట్లు |
| 4 | ఉసిరి | 1.10 | 12.00 | 10 రెట్లు |
| 5 | చింతపండు | 2.00 | 19.00 | 9.5 రెట్లు |

ఉపయోగించేవి కూడా ఎన్నో ఉన్నాయి. ఇవి రెండో రకానికి చెందినవి. పళ్లు తోముకునే పుల్లతో మొదలు ఇల్లుగప్పే ఈతగడ్డి వరకు, వడ్లు దంచే రోలు రోకలికర్ర మొదలు ఇంటి వాసాల వరకు ఇటువంటివి ఎన్నో ఉన్నాయి. రోజు వాడుకునే వీటికి ఏమాత్రం విలువ కట్టలేం. రోజు తినే కూరల్లో స్థానికంగానే చేపలు, ఆకు కూరలు, దుంపలు లాంటివి అడవిలో, పొలాల్లో, నదుల్లో 70 శాతం వరకు దొరుకుతున్నాయి. కుంటల్లోని చేపలు, అడవిలోని దుంపగడ్డలు, కూరలు లాంటివి స్థానికంగానే 150కి మించి దొరకుతున్నాయని ఇక్కడి పెద్దలు చెప్పుకొస్తున్నారు. ఇంకా సీజన్ వారిగా దొరికే మామిడి, అల్లనేరడి, తునికి, కోసుం, రేల, మొర్రిపండ్లు అయితే కొదువే లేదు. సీజన్‌లో అందరూ మామిడి పండ్లను కడుపారా 10-20 కిలోలకు తక్కువ గాకుండా తింటూ ఉంటారు. సీజన్‌లో విపరీతంగా కాసే మామిడి పండ్లను తిని ఆ పూటను గడుపుకునే కుటుంబాలు ఎన్నో ఉన్నాయి. సీజన్‌లో క్వింటాల్ మామిడి పండ్లు కూడా తినేవాల్లున్నారంటే ఆశ్చర్యపడాల్సింది లేదు. అడవిలో రెండు సంవత్సరాలకోమారే అయినా మామిడి కాపుకు అంతులేదు. పూర్వ బస్తర్‌లో కాస్తున్న మొత్తం మామిడి కాపులో కాయలు, పండ్లు తినడానికైనా, సంతల్లో ఒరుగులు చేసి అమ్మడానికైనా మొత్తంగా కాసే కాపులో 20-25 శాతానికి మించవు. చివరికి మిగిలిన కాయలు, పండ్లు నేలరాలి కుల్లిపోయి మళ్లీ భూమికి ఎరువుగా మారాల్సిందే. అల్లనేరడి, మొర్రిపండ్లు అంతే.

ఆదివాసులు నేటికీ కాల్చిన ఇటుకలతో ఇళ్లను నిర్మించడమనేది లేదు. అలా అవి పక్క ఇళ్లు కాకపోవడంతో ప్రతి ఐదు పదేళ్ల కొకసారి తిరిగి మళ్లీ కొత్త ఇళ్లను నిర్మించాల్సి వస్తున్నది. ఈ ప్రాంతంలో మెజారిటీ ఇళ్లు ఇలాంటివే. ఏ తండ్రి తన కొడుక్కి తన ఇంటిని వారసత్వంగా ఇచ్చింది ఎరుగరు. ఈ ఇళ్ల నిర్మాణానికి ఉపయోగించే కలప, వెదురు, ఈతగడ్డి అడవి నుండే లభిస్తుంది. అలాగే వంట చేసుకోవడానికి ఉపయోగించే వంట చెరుకు అడవి నుండే లభిస్తున్నది. అంతేగాదు

చలికాలంలో చలి కాచుకునేందుకు వేసే మంటలకోసమని ఒక్కో కుటుంబానికి సుమారు నాలుగైదు టన్నుల నుండి పది టన్నుల పైనే కలప అవసరం పడుతున్నది. ఆదివాసులు వీటన్నింటిని అడవి నుండే సేకరిస్తున్నారు. మార్కెట్లో వీటి విలువ వేల రూపాయలలోనే ఉంటుంది.

మారకానికి ఉపయోగపడే లఘు అటవోత్పత్తులే గాక ఇంకా అడివిలో అనేక రకాల విలువైన అటవీ సంపద ఉంది. వెదురు, తునికాకు, కలప కూడా అటవీ ఉత్పత్తులే. అయితే ఆదివాసులు వాటిని తమ ఇష్టానుసారం సేకరించడం గాకుండా, బడా కంపెనీల, టెకెదార్ల వద్ద కూలీకి నరికి ఇవ్వాల్సి వస్తున్నది. అడవి తమదే అయినా, తరతరాల నుండి అడవిని తామే కాపాడుకుంటూ వచ్చినా కూడా అత్యంత విలువైన అటవీ సంపదను కేవలం కూలీ డబ్బులకే నరికి ఇవ్వాల్సి వస్తున్నది. అడవిలోని వెదురు, కలపపై తమకేమాత్రం అధికారాలు లేకుండా పోయాయి. తమ అడవిలోనే తామంతా వెదురు, కలప నరికే కూలీలుగా బతకాల్సి వస్తున్నది. ఆ ఇచ్చే కూలీ కూడా చాలా తక్కువ. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలన్నీ కూడా అడవిపై తమదే సర్వాధికారంలా వ్యవహరిస్తున్నాయి. ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో ప్రతి ఏటా 845 లక్షల ఘణపు మీటర్ల కలప సేకరణ జరుగుతున్నది. దీనితో ప్రభుత్వానికి ఏటా రాయల్టీ కింద వందల కోట్ల రూపాయల ఆదాయం వస్తున్నది. విప్లవోద్యమ పోరాటాల ఫలితంగా చైతన్య వంతులైన ప్రజానీకం ఫారెస్టు వాళ్ల ఆగడాలను ఎదిరించడంతో పాటు తమ అడవి నుండి కలపను తరలించుకపోడాన్ని నిలవరించ గలిగినప్పటికీ, దాని తిరుగు ఫలితం మాత్రం ఆదివాసులకు దక్కనే లేదు.

సుప్రీంకోర్టు 1977 జూలై 11న వెలువరించిన తన సమత తీర్పులో అటవీ ప్రాంతాలలో భూమిపై భాగమే గాక భూమిలోపలి పొరలు కూడా ఆదివాసులకే చెందుతాయని, ఇక్కడ గనులు తవ్వే హక్కులు కూడా కేవలం ఆదివాసులకే ఉంటుందని పేర్కొంది. అడవిలోని చెట్లు మరి వాటికి కాసే కాయలు, పండ్లు లాంటి అడవి సంపదనే గాక, భూ గర్భంలోగల ఖనిజ సంపదలను కూడా ప్రకృతి వనరుల కిందనే జమకట్టాలి. అడవిలోని భూ లోపలి పొరల్లో లభ్యమయ్యే బొగ్గు, ఇనుప ఖనిజం, బాక్సైట్, కొరండం లాంటివి ముడి సరుకుల రూపేణా ఉన్నందునా వాటిని ప్రకృతి వనరులుగానే గుర్తించాలి. బస్తర్‌లోని విశాలమైన అడవి ప్రాంతంలో అపారమైన ఖనిజ సంపద భూమిలోపలి పొరల్లో నిగూఢమై ఉంది. 2013-14వ ఆర్థిక సంవత్సరంలో ఖనిజ సంపదలపై ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వానికి 3036 కోట్ల రూపాయల రాయల్టీ లభించింది. ప్రభుత్వాలే ఇంత పెద్ద మొత్తంలో రాయల్టీని వసూలు చేస్తుంటే, ఇక కార్పొరేట్ కంపెనీల లాభాలు ఎంత పెద్ద మొత్తంలో ఉంటాయో ఊహించవచ్చు. సొత్తు ఒకరిదైతే, భాగ్యం మరొకరిది.

ఇక్కడ దోపిడీ అంటే వ్యవస్థీకృత దోపిడీయే. ఆదివాసులను దోపిడీ చేయడమంటే, వారి శ్రమకంటే వారి సంపదలైన అడవి, అడవిలోని ముడి పదార్థాలను, ప్రకృతి వనరులను, ఖనిజ సంపదలను దోచుకుపోవడమే. ఆదివాసులు అడవిలో సేకరించే లఘు అటవోత్పత్తులను షావుకార్లు దోపిడీ చేస్తుండగా కలప, వెదురు లాంటి అటవీ సంపదను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దోచుకుపోతున్నాయి. భూమిలోపలి పొరల్లోని ఖనిజ సంపదను రాజ్యం అండతో సామ్రాజ్యవాదులు, కార్పొరేట్ సంస్థలు దోచుకుంటున్నాయి. బస్తర్‌లో భూమి, అడవి సైతం రాజ్యం ఆక్రమణలో ఉంది. ఆదివాసులు తినడానికి కాసిన్ని తిండి గింజలను పండించడంతో పాటు అడవిపై, అటవీ ఉత్పత్తులపై కూడా ఆధారపడి ఉన్నారనే విషయాన్ని మరిచిపోరాదు. బస్తర్‌లో ఆదివాసుల వ్యవసాయం నేటికీ ప్రాథమిక స్థాయికి మించి లేదు. వీరి వ్యవసాయం దానితో కలగలిసిన అటవీ ఉత్పత్తుల సేకరణ లాంటి మిశ్రమ ఉత్పత్తి విధానం, దానిపై ఏర్పడిన సామాజిక, సాంస్కృతిక జీవన విధానమే వారిని మిగతా వారితో పోల్చినప్పుడు భిన్నంగా అగుపిస్తుంది. తరతరాల నుండి ఆదివాసులు తమదైన ఉత్పత్తి (సహజోత్పత్తి) విధానాన్ని కాపాడుకుంటూ వచ్చారు. అది నేటికీ పూర్తిగా కనుమరుగవలేదు. భారతదేశంలోకి బ్రిటిష్ వాడి ప్రవేశంతో ఆదివాసుల ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థలు ధ్వంసమైనా, దాని స్థానంలో నూతన తరహా ఉత్పత్తి విధానమేదీ కూడా ఇక్కడ పునర్నిర్మించబడలేదు. ఏ సమాజానికైనా దాని ఉత్పత్తి విధానమే పునాదిగా ఉంటుదను కున్నప్పుడు, ఆదివాసులలో (షెడ్యూల్డ్) వ్యవసాయమనేది పూర్తి స్థాయిలో అభివృద్ధి చెందిన కారణంగా ఇంకనూ అడవిపై, అటవోత్పత్తులపైనే గణనీయంగా ఆధారపడి ఉన్నందునా, భూస్వామ్య విధానపు సంబంధిత అర్ధ భానిస - భూస్వామి (భూ కేంద్రీకరణ, కౌలు, వడ్డీ, వ్యవసాయ కూలీ) సంబంధాల ఏర్పాటుకు భౌతిక పునాది లేకుండా పోయింది. నేడు ఆదివాసులు వ్యవసాయాన్ని ఉపాధిగా స్వీకరించినప్పటికీ కూడా ఆదివాసి (బస్తర్) సమాజం భూస్వామ్య (అర్ధ) సమాజంలోకి పరివర్తన చెందినదిగా భావించలేం.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

## తెలంగాణలో తెలంగాణ జన సమితి ఆవిర్భావం

తెలంగాణలో 'తెలంగాణ జన సమితి'(టిజెఎస్) పేరుతో కొత్త పార్టీ ఆవిర్భవించింది. టిజెఎస్ ఆవిర్భావ సభ హైదరాబాద్‌లోని సరూర్‌నగర్ స్టేడియంలో ఏప్రిల్ 28న జరిగింది. ఈ సభకు తెలంగాణలోని అన్ని జిల్లాల నుంచి ప్రజలు వచ్చారు. తెలంగాణ జన సమితి అధ్యక్షుడిగా కోదండరామ్‌ను ప్రకటించారు. కోదండరామ్ ఉద్యమ ఆకాంక్షలు, ప్రభుత్వ నిరంకుశత్వానికి మధ్య ఘర్షణ జరుగుతోందన్నారు. అంతిమ విజయం టిజెఎస్‌దేనన్నారు. తమ పార్టీ అధికారంలోకి వస్తే పెట్టుబడి, అప్పులు, వడ్డీల భారం నుంచి రైతులకు విముక్తి కలిగిస్తుందని అన్నారు. ప్రభుత్వ రంగంలోనే విద్య, వైద్యం అందేలా చూస్తామన్నారు. తెలంగాణ కోసం దెబ్బలు తిన్నోళ్లు ద్రోహులయ్యారని, ఉద్యమ ద్రోహులు ఏకంగా మంత్రులయ్యారని ఆరోపించారు. ప్రభుత్వం మిషన్ భగీరథ పేరుతో కాంట్రాక్టర్లకు లబ్ది చేకూరుస్తుందన్నారు.

## తెలుగు రాష్ట్రాల్లో మార్క్స్ ద్విశత జయంతులు

విరసం ఆధ్వర్యంలో కారల్ మార్క్స్ ద్విశత జయంతి సభలు మే 5న విజయవాడ, హైదరాబాద్‌లలో జరిగాయి. విజయవాడలో ఎం.బి.వి. కేంద్రంలో రోజంతా జరిగింది. మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతంపై ఇ.ఎస్. బ్రహ్మచరి, పర్యావరణం-మార్క్స్ దృక్పథంపై పి. వరలక్ష్మి, మార్క్సిజం-సమకాలీనతపై కా.పి. ప్రసాద్, మార్క్సిస్ట్ సాహిత్య సిద్ధాంతంపై పాణి ప్రసంగించారు, పి.కె.ఎం. కళాకారులు విప్లవగీతాలు ఆలాపించారు. హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో మార్క్సిజంపై సదస్సు జరిగింది. ఈ సదస్సుకు గీతాంజలి అధ్యక్షత వహించారు. వర్గ పోరాటం-మార్క్సిజంపై వరవరరావు మాట్లాడారు. మార్క్సిజం ప్రాధాన్యత పై కాశీం మాట్లాడారు. మార్క్సిస్ట్ సాహిత్య సిద్ధాంతంపై బాసిత్ మాట్లాడారు. పూజారి కాంకేర్ అమరుల స్మృతిలో 'ఒక వేకువ కోసం' పుస్తకాన్ని ఆవిష్కరించారు.

## గోదావరిలో పడవ ప్రమాదం

తూర్పు గోదావరి జిల్లా దేవీపట్నం మండలానికి చెందిన తాళ్లూరు, గొందూరు, కచ్చులూరు, తెలిపేరు, పెద్దగూడెం, మంటూరు గ్రామానికి చెందిన సుమారు 60 మంది నిత్యావసరాల కోసం మే 15న మండల కేంద్రమైన దేవీపట్నం వెళ్లారు. 40 మంది సామర్థ్యమున్న లాంచీలో చిన్నగా గాలులు వీస్తున్నప్పుడే బయలుదేరారు. గంట తరువాత గాలులు పెనుగాలులుగా మారి వాన మొదలైంది. కిటికీలన్నీ మూసేయడంతో పెనుగాలి ఒక్కసారిగా తోయడం, అదే సమయంలో లోపలున్న వాళ్లంతా ఆందోళనతో ఒకే వైపుకు రావడం వల్ల లాంచీ పక్కకు ఒరిగిపోయి మునిగిపోయింది. అందులోని 12 మంది నదిలో ఈదుకుంటూ ఒడ్డుకు చేరుకున్నారు. 45 మంది గల్లంతైనట్టు ఎస్.పి. రవిప్రకాశ్ తెలిపారు.

## యద్దనపూడి సులోచనారాణి మృతి

ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి (79) కాలిఫోర్నియాలోని క్యూపర్టినోలో తన కుమార్తెవద్ద గుండెపోటుతో మే 21న కన్నుమూశారు. ఆమె 1940లో కృష్ణా జిల్లా మొవ్వ మండలంలోని కాజ గ్రామంలో జన్మించారు. 100కు పైగా రచనలతో నవలా ప్రక్రియను సుసంపన్నం చేశారు. 1956లో ఆమె తొలి కథ 'చిత్ర నళినీయం' ఆంధ్రవార పత్రికలో ప్రచురితమైంది. 15 ఏళ్లకే ఆమె సాహితీ రంగంలోకి అడుగుపెట్టారు. 1963లో తన తొలి నవల 'సెక్రటరీ'తో నవలా రచనలోకి వచ్చారు. అంతకు ముందు రచనల్లో స్త్రీ అందాన్ని వర్ణించడంతోనే సాగిన నవలా ప్రక్రియలో సులోచనారాణి వ్యక్తిత్వం, ఆత్మాభిమానం కలిగిన స్త్రీ పాత్రలతో రచనలు చేశారు.

## ఖమ్మంలో నిరసన సభకు అనుమతించని పోలీసులు

ఛత్తీస్‌గడ్‌లోని పూజారి కాంకేర్‌లో మార్చి 2న జరిగిన కాల్పుల్లోని మృతులను స్మరిస్తూ ఏర్పాటు చేసిన 'రాజ్యహింస, ఎన్‌కౌంటర్ హత్యల' నిరసన సభకు పోలీసులు రెండోసారి అనుమతివ్వలేదు. అమరుల బంధుమిత్రుల సంఘం ఆధ్వర్యంలో ఖమ్మం రామనర్సయ్య విజ్ఞాన కేంద్రంలో మే 12న నిర్వహించ తలపెట్టిన సభను అడ్డుకున్నారు. మొదట ఏప్రిల్ 28న సభ నిర్వహించాలని నిర్ణయించారు. కాని నగరంలో 144 సెక్షన్ ఉందని అనుమతించలేదు. సభకు వచ్చిన 19 మందిని మే 12 ఉదయమే అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అరెస్ట్ చేసిన వారిపై కేసు నమోదుచేసి వ్యక్తిగత పూచికత్తుపై విడుదల చేసినట్లు పోలీసులు తెలిపారు.

## ఉద్దానం కిడ్నీ బాధితుల కోసం పవన్ కళ్యాణ్ దీక్ష

శ్రీకాకుళం జిల్లా ఉద్దానం కిడ్నీ బాధితులకు న్యాయం చేయాలని డిమాండ్ చేస్తూ ఎచ్చెర్ల నియోజకవర్గ పరిధిలోని ఎస్ఎస్ఆర్ పురంలో జనసేన నేత పవన్ కళ్యాణ్ మే 25 సాయంత్రం ప్రారంభించి ఒక రోజు దీక్ష చేశారు. ఉద్దానంలోని ఏడు కిడ్నీ ప్రభావిత మండలాల్లో హెల్త్ ఎమర్జెన్సీని ప్రకటించాలన్నారు. రాష్ట్రానికి ఆరోగ్య మంత్రిని నియమించాలని డిమాండ్ చేశారు.

## మాదాల రంగారావు మృతి

విప్లవ కథానాయకుడు, రెడ్ స్టార్‌గా పిలిచే సుప్రసిద్ధ అభ్యుదయ చిత్రాల నిర్మాత మాదాల రంగారావు (71) మే 27న అనారోగ్యంతో మరణించారు. ప్రకాశం జిల్లా ఒంగోలు సమీపంలోని సంతనూతలపాడు మండలం మైనంపాడు గ్రామంలో 1948 మే 25న పుట్టారు. ఒంగోలు శర్మ కాలేజీలో విద్యనభ్యసించారు. అక్కడే కమ్యూనిస్టు భావాలకు ఆకర్షితులై సిపిఐ అనుబంధ సంస్థ ఎఐఎస్ఎఫ్‌లో చురుగ్గా పనిచేశారు. విశాఖపట్నంలోని ఆంధ్ర యూనివర్సిటీలో ఎంఎ పూర్తిచేశారు. వెండితెర ద్వారా ప్రజలను చైతన్యవంతం చేయాలన్న సంకల్పంతో రంగారావు చెన్నై వెళ్లారు. జి. రామినీడు దర్శకత్వం వహించిన 'చైర్మన్ చలమయ్య'తో వెండితెరకు పరిచమయ్యారు. 1980లో 'నవతరం' బ్యానర్‌ను ఏర్పాటు చేసి 'యువతరం కదిలింది' అనే సినిమా తీశారు. 'ఎర్రమల్లెలు', 'ప్రజాశక్తి', 'స్వరాజ్యం', 'జనం మనం', 'ఎర్రమట్టి' వంటి ఎన్నో అభ్యుదయ సినిమాలు తీశారు. మొత్తం 75 సినిమాల్లో నటించిన రంగారావు, 15 సినిమాలను సొంతంగా తీశారు. ఈ క్రమంలో సెన్సార్ బోర్డుతో ఎన్నోసార్లు పోరాటం చేశారు. వీ

### యుద్ధ కేంద్రాలవుతున్న ఉద్యమ ప్రాంతాలు

ఛత్తీస్‌గడ్‌లోని గరియాబంద్ జిల్లాలోని మెయిన్‌పూర్ అడవుల్లో మే 2న పోలీసు బలగాలు గాలింపు జరుపుతుండగా మావోయిస్టులు ఐఇడిలు పేల్చారు. దీంతో ఇద్దరు జవాన్లు ప్రాణాలు కోల్పోయారు. ఛత్తీస్‌గడ్‌లో మే 3న సుకుమా జిల్లా పరిధిలోని పుట్టపాడు అడవుల్లో పోలీసులకు మావోయిస్టులకు మధ్య జరిగిన ఎదురు కాల్పుల్లో భూంకాల్ మిలీషియా ఇద్దరు సభ్యులు మరణించారు. సుకుమా జిల్లాలోని కన్నాయి గూడ-చింతకొంట అటవీ ప్రాంతంలో అదేరోజు కూంబింగ్ నిర్వహిస్తున్న బలగాలకు మావోయిస్టులకు మధ్య జరిగిన ఎన్‌కౌంటర్లో సోయం కామ మరణించినట్లు పోలీసులు తెలిపారు. దంతెవాడ జిల్లాలోని అటవీ ప్రాంతమయిన చోల్నార్-కిరండుల్ గ్రామాల మధ్య మావోయిస్టులు పోలీసుల వాహనాన్ని పేల్చారు. ఈ ఘటనలో ఏడుగురు జావాన్లు మృతిచెందారు.

### రణరంగంగా అలీగడ్ ముస్లిం యూనివర్సిటీ

అలీగడ్ ముస్లిం విశ్వవిద్యాలయం (ఏఎంయు) లో విద్యార్థుల మధ్య తలెత్తిన వివాదం రాజకీయాల వైపు మళ్లించారు. దీంతో యూనివర్సిటీలో ఇంటర్‌నెట్ సేవలను నిలిపివేశారు. అలీగడ్ పట్టణంలో 144 సెక్షన్ విధించారు. పాలకుల చర్యలను వ్యతిరేకిస్తూ విద్యార్థులు ప్రధాని మోడీ దిష్టిబొమ్మను దహనం చేశారు. ఏఎంయులో జిన్నా చిత్రపటం ఎందుకు పెట్టారని బిజెపి ఎంపి సతీష్ గౌతం మే 1న వైస్ చాన్సలర్ తారిక్ మన్సూర్‌కు లేఖ రాయడం వివాదానికి ప్రధాన కారణమైంది. జిన్నా చిత్రపటం తీస్తే ఊరుకునేది లేదని విద్యార్థులు మే 4న ఆందోళనకు దిగారు. తీసేయాలని డిమాండ్ చేస్తూ మితవాద సంస్థ హిందూ యువవాహిని సభ్యులు ఆందోళన చేయడంతో పాటు విద్యార్థులతో గొడవకు దిగారు. దీంతో పోలీసులు ప్రవేశించి బాష్పవాయు గోళాలు ప్రయోగించారు. ఈ ఘర్షణలో 28 మంది విద్యార్థులు, 13 మంది పోలీసులు సహా మొత్తం 41 మంది గాయపడ్డారు. పక్కా ప్రణాళికతోనే ఘర్షణకు దిగారని, హిందూ యువవాణిని సభ్యులను వదిలేసి ఏఎంయు సభ్యులను అరెస్టు చేయడమేంటని విద్యార్థులు ఆందోళన చేస్తున్నారు.

### బెంగాల్ ఎన్నికల ఘర్షణల్లో 13 మంది మృతి

పశ్చిమ బెంగాల్‌లో మే 14న జరిగిన పంచాయతీ ఎన్నికలు హింసాత్మకంగా మారాయి. రాష్ట్రంలో పలుచోట్ల అధికార తృణమూల్ కాంగ్రెస్, విపక్ష పార్టీల కార్యకర్తల మధ్య ఘర్షణ చోటుచేసుకుంది. రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన ఘర్షనల్లో 13 మంది మృతి చెందగా 43 మంది గాయాపడ్డారు. ప్రధానంగా ఉత్తర 24 పరగణాలు, నాడియా, ముర్షీదాబాద్, దక్షిణ దినాజ్‌పూర్ జిల్లాలో పెద్ద ఎత్తున ఘర్షణలు జరిగాయి. తృణమూల్ కాంగ్రెస్ కార్యకర్తలు కర్రలు, కత్తులు పట్టుకొని ఇతర పార్టీల వారిని ఓటు వేసేందుకు రాకుండా అడ్డుకున్నారన్న ఆరోపణలున్నాయి. పోలింగ్ కేంద్రాల వద్ద నాటు బాంబులు విసిరి ఓటర్లను భయభ్రాంతులకు గురిచేశారు.

### కర్ణాటక ఎన్నికల ఫలితాలు

కర్ణాటక ఎన్నికల ఫలితాలను మే 15న ఎన్నికల కమిషన్ ప్రకటించింది. మొత్తం 224 అసెంబ్లీ స్థానాలకు గాను 222 స్థానాలకు ఎన్నికలు జరిగాయి. బి.జె.పి. 104 స్థానాలు నెగ్గి అతి పెద్ద పార్టీగా నిలిచింది. కాంగ్రెస్ 78 స్థానాల్లో, జె.డి.ఎస్. 38 స్థానాల్లో, ఇతరులు 2 స్థానాల్లో గెలుపొందారు. ఏ పార్టీకి ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే మెజారిటీ రాకపోవడంతో కాంగ్రెస్ జెడిఎస్‌కు మద్ధతు తెలుపుతూ గవర్నర్‌కు లేఖ ఇచ్చింది. కర్ణాటక ముఖ్యమంత్రిగా అత్యధిక స్థానాలు గెలుచుకున్న బిజెపి నేత యడ్యూరప్పతో రాజ్‌భవన్‌లో గవర్నర్ వజూభాయ్ వాలా మే 17న ప్రమాణ స్వీకారం చేయించారు. యడ్యూరప్ప బల నిరూపనకు ముందే రాజీనామా చేశారు. దీంతో గవర్నర్ జె.డి.ఎస్-కాంగ్రెస్ కూటమిని ఆహ్వానించారు. కర్ణాటక రాష్ట్ర 25వ ముఖ్యమంత్రిగా విధానసౌదలోని సమావేశ మందిరంలో కుమారస్వామితో, ఉప ముఖ్యమంత్రిగా కాంగ్రెస్ నేత డా.జి. పరమేశ్వరతో గవర్నర్ వజూభాయ్ వాలా ప్రమాణ స్వీకారం చేయించారు.

### తూత్తుకుడిలో నిరసనకారులపై పోలీసు కాల్పులు

తమిళనాడులోని తూత్తుకుడిలో విష కాలుష్యాలను వెదజల్లుతున్న వేదాంతకు చెందిన స్టెరిలైట్ రాగి కర్మాగారాన్ని మూసివేయాలని డిమాండ్ చేస్తూ మే 22న పరిసర ప్రాంతాలకు చెందిన ప్రజలు కలెక్టర్ కార్యాలయం ముట్టడికి ప్రయత్నించారు. పరిసర 20 గ్రామాలకు చెందిన సుమారు 20 వేల మంది ర్యాలీగా బయలుదేరగా పోలీసులు మధ్యలోనే వారిని అడ్డుకున్నారు. ఈ సందర్భంగా పోలీసులకు ఆందోళనకారులకు మధ్య తోపులాట జరిగి పోలీసులు లాఠీ ఛార్జీ చేశారు. దీంతో ఆగ్రహానికి గురైన ఆందోళనకారులు పోలీసులపై రాళ్ల దాడికి దిగారు. అనంతరం పోలీసులు కాల్పులు జరపగా 13 మంది ఆందోళనకారులు మృతి చెందారు. మరో 60 మందికిపైగా గాయపడ్డారు. ఫ్యాక్టరీ వల్ల భూగర్భ జలాలు విషతుల్యమయి తామంతా శ్వాసకోశ వ్యాధితో బాధపడుతున్నామని, తమ సమస్యకు ఫ్యాక్టరీని మూసివేయడమే పరిష్కారమని పరిసర గ్రామాల ప్రజలు వంద రోజులుగా నిరసన దీక్షలు చేస్తున్నారు. 100 రోజులు అవుతున్న సందర్భంగా 'కలెక్టరేట్ ముట్టడి'కి కార్మిక సంఘాలు పిలుపునిచ్చాయి.

### జమ్మూ కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్‌లు

జమ్మూ కశ్మీర్‌లో షోపియాన్ జిల్లాలో మే 6న జరిగిన ఎన్‌కౌంటర్‌లో హిజ్బుల్ ముజాహిద్దీన్‌కు చెందిన ఐదుగురు మిలిటెంట్లు మరణించారు. వీరిలో ఒకరు కమాండర్ సహా కొత్తగా చేరిన అసిస్టెంట్ ప్రొఫెసర్ కూడా ఉన్నారు. ఎన్‌కౌంటర్‌ను నిరసిస్తూ పెద్ద సంఖ్యలో నిరసనకారులు భద్రతా దళాలపైకి రాళ్లు రువ్వడంతో పోలీసులు జరిపిన కాల్పుల్లో గాయపడిన ఐదుగురు నిరసనకారులు చికిత్స పొందుతూ మరణించారు. శ్రీనగర్‌లోని చత్తాబల్ ప్రాంతంలో మే 5న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు లష్కరేతాయిబాకు చెందిన మిలిటెంట్లు మృతిచెందారు. కుప్వారా జిల్లా హల్మత్‌పోరా అటవీ ప్రాంతంలో మే 21, 22 తేదీల్లో నియంత్రణ రేఖకు 8 కిలోమీటర్ల దూరంలో ఎన్‌కౌంటర్ జరిగింది. ఈ ఘటనలో ఐదుగురు భద్రతా సిబ్బంది మృతి చెందగా కొందరు భద్రతా సిబ్బంది గాయపడ్డారు. ఐదుగురు మిలిటెంట్లు మృతిచెందినట్లు డిజిపి ఎస్.పి. వాయిద్ వెల్లడించారు. ఉత్తర కశ్మీర్‌లోని కుప్వారా జిల్లా తంగ్దార్ సెక్టార్‌లో మే 26న చొరబాటుకు ప్రయత్నించిన మిలిటెంట్లు సైన్యంపైకి కాల్పులు జరపడంతో సైన్యం జరిపిన ఎదురు కాల్పుల్లో ఐదుగురు మిలిటెంట్లు మృతిచెందారని రక్షణ శాఖ ప్రతినిధి కల్నల్ రాజేశ్ కాలియా తెలిపారు.

### భారీగా పెరిగిన చమురు ధరలు

ఎన్నడూ లేనంత భారీగా చమురు ధరలు పెరిగిపోయాయి. పెట్రోలు లీటరుకు దాదాపు రు.83 కాగా, డీజిల్‌కు రు. 75 దాటుతున్న పరిస్థితి ఉంది. ఈ పెరుగుదలలు నిత్యావసరాల మీద తీవ్ర ప్రభావం చూపే పరిస్థితి ఉంది. ఇప్పటికే గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అనేక ఆర్థిక ఒడుదొడుకులను ఎదుర్కొంటోంది. కర్ణాటక ఎన్నికలు జరగడానికి 19 రోజుల ముందు నుంచీ చమురు ధరలు పెరగకుండా మోదీ ప్రభుత్వం రాజకీయ అవసరం కోసం ఆపి ఉంచింది. కౌంటింగ్ ముగియగానే చమురు ధరలు అమాంతం పెరిగిపోయాయి. వీ

### ఉత్తర, దక్షిణ కొరియాల మధ్య మైత్రి

దాదాపు ఆరున్నర దశాబ్దాల తరువాత నిత్యం యుద్ధ వాతావరణం నెలకొని ఉన్న ఉత్తర, దక్షిణ కొరియా దేశాల మధ్య శాంతి చర్యలు మొదలయ్యాయి. ఏప్రిల్ 27న ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్ జోంగ్ ఉన్, దక్షిణ కొరియా అధ్యక్షుడు మూన్ జే ఇన్‌ల మధ్య చారిత్రాత్మక సమావేశం జరిగింది. కిమ్ జోంగ్ దక్షిణ కొరియాలో అడుగుపెట్టారు. ఇరు దేశాల నేతలు తమ దేశాల మధ్య శాంతి స్థాపన కోసం, అణు నిరాయుధీకరణ దిశగా కృషి చేస్తామని అన్నారు.

### యెమెన్‌పై సౌదీ అరేబియా సంకీర్ణ దళాల దాడులు

యెమెన్ రాజధాని సానా నగరంపై సౌదీ అరేబియా నేతృత్వంలోని సంకీర్ణ దళాలు వైమానిక దాడులు జరిపాయి. ఏప్రిల్ 27న జరిగిన ఈ దాడిలో దాదాపు యాభై మంది మరణించారని అధికారులు తెలిపారు. ఇందులో ఎక్కువగా హుతీ తిరుగుబాటుదారులు ఉన్నారని అన్నారు.

### అఫ్ఘనిస్తాన్‌లో బాంబు పేలుళ్లు

అఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్‌లో ఏప్రిల్ 30న రెండు బాంబు పేలుడు సంఘటనలు జరిగాయి. మొదటి పేలుడు అఫ్ఘనిస్తాన్ ఇంటెలిజెన్స్ సర్వీస్ ప్రధాన కార్యాలయం సమీపంలో మోటర్‌సైకిల్‌పై వచ్చిన వ్యక్తి తనను తాను పేల్చుకున్నాడు. ఈ దాడిలో ఐదుగురు మరణించారు. మీడియా ప్రతినిధులు ఈ దృశ్యాలను చిత్రీకకరించేందుకు పెద్దఎత్తున అక్కడికి చేరుకోగా, ఒక వ్యక్తి మీడియా ఐడి ధరించి ఆ గుంపులో చేరి తనను తాను పేల్చుకున్నాడు. ఈ పేలుడులో పది మంది జర్నలిస్టులతో సహా ముప్పై మంది మరణించారు. ప్రముఖ న్యూస్ ఏజెన్సీ ఎఎఫ్‌పి ఫొటోగ్రాఫర్ షా మారై కూడా ప్రాణాలు కోల్పోయారు. కాందహార్ నగరంలో ఒక మదర్సా సమీపంలో నాటో మిలిటరీ వాహనంపై జరిగిన బాంబు దాడిలో పదకొండు మంది పిల్లలతో సహా ఇరవై మంది మరణించారు. మే 12న ఫారాహ్ ప్రావిన్స్‌లో రెండు చోట్ల తాలిబన్‌లు దాడులు జరిపారు. పోలీసు తనిఖీ కేంద్రాన్ని లక్ష్యంగా చేసుకొని జరిపిన దాడిలో నలభై మంది మరణించారు. ఈ దాడి జరిగిన కొద్దిసేపటికే ఫారాహ్ నగర్ పోలీసు స్టేషన్‌పై తాలిబన్లు గ్రెనైడ్లతో దాడిచేశారు. ఈ దాడిలో పదకొండు మంది పోలీసులు చనిపోయారు. మే 13న జలాలాబాద్‌లోని ఆర్థిక శాఖ కార్యాలయంలో జరిగిన మరో బాంబు దాడిలో పదిహేను మంది మరణించారు. నలభై మందికి పైగా గాయపడ్డారు.

### మలేషియా పార్లమెంట్ ఎన్నికలు

మలేషియా పార్లమెంట్‌లోని 222 స్థానాలకు మే 9న జరిగిన ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో ప్రకటన హరప్పన్ అధ్యక్షుడు 'మలేషియా ఆధునీకరణ పితామహుడు'గా పిలిచే మహతీర్ మొహ్మద్ గెలుపొందారు. ఆయనకు 121 సీట్లు వచ్చాయి. ప్రస్తుత ప్రధాని నజీబ్ రజాక్‌కు 79 సీట్లు మాత్రమే వచ్చాయి. ఆయనపై అవినీతి ఆరోపణలు వెల్లువెత్తాయి. మహతీర్ 1981 నుంచి 2003 వరకు మలేషియా ప్రధానిగా ఉన్నారు. ఆయన పాలనలో మలేషియా ఆర్థికాభివృద్ధి సాధించింది. ప్రధాని మార్పుతోనే దేశ భవిష్యత్ అనే నినాదాన్ని ప్రజల్లోకి తీసుకెళ్లి ఎన్నికల్లో విజయం సాధించారు.

### ఆస్ట్రేలియాలో నిరసనలు

ఆస్ట్రేలియాలో కార్మికులు నిరసన బాట పట్టారు. 'ఛేంజ్ ది రూల్స్' (నిబంధనలు మార్చండి) అంటూ జాతీయ కేంద్ర కార్మిక సంఘాల సమాఖ్య ఆస్ట్రేలియన్ కౌన్సిల్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ (ఎసిటియు), విక్టోరియా ట్రేడ్ హాల్‌తో కలిసి మెల్‌బోర్న్ నగరంలో మే 11న ప్రదర్శనలు జరిపారు. రాష్ట్రవ్యాప్తంగా దాదాపు లక్షమంది కార్మికులు పనులు నిలిపివేసి ప్రదర్శనలో పాల్గొన్నారు. సెంట్రల్ మెల్‌బోర్న్‌లో ట్రేడ్స్ హాల్ నుండి ఫెడరేషన్ స్క్వేర్ వరకు ఈ ప్రదర్శన సాగింది. దశాబ్దాల తరబడి ఉద్యోగాలు, వేతనాలు, పని పరిస్థితులు మెరుగు పడకపోవడం, పెరుగుతున్న సామాజిక అసమానతలు, కార్పొరేట్ దోపిడీకి వ్యతిరేకంగా పోరాటం చేయాలనే ఆకాంక్షతో కార్మికులు ఈ నిరసనలో పాల్గొన్నారు. నిర్మాణ, తయారీ రంగ కార్మికులు, ఎలక్ట్రీషియన్లు, డాక్ కార్మికులు, ఆస్పత్రి, ఆరోగ్య సంరక్షణ కార్మికులు, ఉపాధ్యాయులు, విద్యావేత్తలు, ప్రభుత్వ రంగ ఉద్యోగులు ఈ ర్యాలీలో పాల్గొన్నారు

### ఇండోనేషియాలో దాడులు

ఇండోనేషియాలో మే 13న వరుస ఆత్మాహుతి దాడులు జరిగాయి. రెండో అతిపెద్ద నగరమైన సురబయలో మూడు చర్చిల్లో ఈ దాడులు జరిగాయి. ఈ దాడుల్లో పదకొండు మంది మరణించగా, నలభై మందికి పైగా గాయపడ్డారు. ప్రపంచంలోనే అత్యధిక ముస్లింలు గల దేశం ఇండోనేషియా కాగా, క్రైస్తవులు మైనారిటీలు. ఉగ్రదాడి నేపథ్యంలో ముందు జాగ్రత్త చర్యగా నగరంలోని అన్ని చర్చిలను మూసివేశారు.

### గాజాపై పాలస్తీనా దాడి

టెల్అవీవ్‌లోని అమెరికా రాయబార కార్యాలయాన్ని జెరూసలెంకు తరలించడాన్ని వ్యతిరేకిస్తూ మే 14న గాజా సరిహద్దులో పాలస్తీనీయులు ఆందోళన జరిపారు. దాదాపు నలభై వేల మంది పాలస్తీనీయులు ఈ నిరసన ప్రదర్శనల్లో పాల్గొన్నారు. సరిహద్దు వద్ద జరిగిన ఈ ఆందోళనపై ఇజ్రాయెల్ సైన్యం పెద్ద ఎత్తున విరుచుకుపడింది. ఈ దాడిలో యాభై ఎనిమిది మందికి పైగా పాలస్తీనీయులు ప్రాణాలు కోల్పోయారు. రెండు వేల రెండు వందల మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. ఈ కాల్పుల్లో ఐదుగురు చిన్నారులు కూడా ఉన్నారు. శాంతియుతంగా నిరసన తెలుపుతున్న ఆందోళనకారులపై ఇజ్రాయిల్ సైన్యం దాడి చేయడంపై ప్రపంచ వ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి. ఈ నిరసనల మధ్యనే జెరూసలెంలో అమెరికా రాయబార కార్యాలయం ప్రారంభమైంది. ఈ కార్యక్రమానికి అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్, ఆయన కుమార్తె ఇవాంక హాజరయ్యారు.

### వెనిజులా అధ్యక్ష ఎన్నికలు

వెనిజులా అధ్యక్ష పదవికి మే 20న జరిగిన ఎన్నికల్లో సోషలిస్ట్ పార్టీ ఆఫ్ వెనిజులా అధినేత నికొలస్ మదురో మరోసారి అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. మరో ఆరేండ్ల పాటు ఆయన అధ్యక్షుడిగా కొనసాగుతారు. మదురోకు 58 లక్షల ఓట్ల (68 శాతం)తో ఘన విజయం సాధించారు. ఆయన ప్రత్యర్థి హెన్రీ ఫాల్కన్‌కు 18 లక్షల ఓట్లు (21 శాతం) మాత్రమే వచ్చాయి. మే 26న ఆయన రెండోసారి దేశ అధ్యక్షునిగా ప్రమాణ స్వీకారం చేశారు. వెనిజులా సమగ్రాభివృద్ధి కోసం ఆరు సూత్రాల కార్యాచరణ ప్రణాళికను ప్రకటించారు.

### ఐర్లాండ్‌లో అబార్షన్ వ్యతిరేక చట్టం రద్దు

ఐర్లాండ్‌లో గర్భస్రావానికి వ్యతిరేకంగా ఉన్న చట్టంపై ప్రభుత్వం చేపట్టిన రిఫరెండంలో చట్టాన్ని రద్దు చేయాలని కోరుతూ 66.4 శాతం మంది ఓటు వేశారు. దీంతో గత ఆరేళ్ల నుంచి ఐర్లాండ్ మహిళలు చేస్తున్న పోరాటం ఫలించింది. గతంలో ఉన్న కఠినతరమైన చట్టం ప్రకారం గర్భంతో ఉన్న మహిళలను ఎట్టి పరిస్థితుల్లోనూ అబార్షన్ చేయరాదు. ఒకవేళ గర్భస్రావం చేయకపోతే మహిళ ప్రాణాలకు ముప్పున్నప్పటికీ అక్కడి చట్టాలు అనుమతించవు. ఇటీవల భారత సంతతికి చెందిన సవితా హాలప్పన్ గర్భస్రావం వల్ల మృతి చెందడంతో అబార్షన్ వ్యతిరేక చట్టాలను రద్దు చేయాలనే డిమాండ్ పెద్దఎత్తున వచ్చింది. వేలాది మంది మహిళలు ఉద్యమించారు. దీంతో ఈ అంశంపై ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. తల్లికి సమాన హక్కులు కల్పిస్తున్న 8వ రాజ్యాంగ సవరణను రద్దు చేయాలని ప్రజలు ఇచ్చిన తీర్పును స్వాగతిస్తున్నట్లు ప్రధాని లియో వారద్కర్ అన్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఏప్రిల్ 1 నుండి ఏప్రిల్ 30, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (874), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (779) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1653)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 4 | - | 28 | 32 | 10 | 9 | 7 | 3 | 3 | 4 | 2 | - | 2 | 24 | 33 | - | - | - | 4 | 12 |
| హైదరాబాద్ | - | - | - | 9 | 13 | 4 | 6 | 2 | 2 | - | 3 | 10 | 8 | 2 | 16 | 15 | - | - | - | - | - |
| కరీంనగర్ | - | 4 | - | 7 | 4 | 1 | 3 | 1 | - | - | 4 | 3 | 1 | 2 | 21 | 12 | - | - | - | - | 7 |
| ఖమ్మం | - | 4 | - | 11 | 8 | 1 | 4 | 1 | - | 4 | 2 | 4 | 2 | 7 | 34 | 12 | - | - | - | - | 12 |
| మహబూబ్‌నగర్ | - | 2 | - | 4 | 6 | 2 | 2 | 3 | 2 | 1 | 5 | 4 | 8 | 7 | 38 | 3 | - | - | - | - | 5 |
| మెదక్ | - | 19 | 5 | 4 | 3 | 4 | 5 | 2 | 1 | 3 | 4 | 4 | 3 | 13 | 7 | 23 | - | - | - | 2 | 1 |
| నల్గొండ | - | 3 | - | 4 | 6 | 2 | - | 1 | 1 | 2 | 1 | 1 | - | 5 | 25 | 8 | - | - | - | - | 4 |
| నిజామాబాద్ | - | 1 | - | 5 | 10 | - | 3 | - | 1 | - | - | 3 | - | 2 | 11 | 6 | - | - | - | - | 4 |
| వరంగల్ | - | 10 | 2 | 3 | 4 | 3 | 2 | 4 | 1 | 2 | 4 | 4 | 4 | 9 | 17 | 19 | - | - | - | 2 | 1 |
| వికారాబాద్ | - | - | - | 5 | 4 | - | 1 | - | - | - | 1 | 2 | - | 2 | 8 | 7 | - | - | - | - | 2 |
| **తెలంగాణ** | **2** | **47** | **7** | **80** | **90** | **27** | **35** | **21** | **11** | **15** | **28** | **37** | **26** | **51** | **203** | **138** | **-** | **-** | **-** | **8** | **48** |
| అనంతపురం | - | 5 | 1 | 16 | 23 | 1 | 1 | 1 | 2 | 9 | 4 | 2 | 22 | 8 | 38 | - | - | - | - | - | 16 |
| చిత్తూరు | - | - | - | 3 | 2 | 4 | 5 | - | - | - | 4 | 3 | 2 | - | 7 | 3 | - | - | - | - | 6 |
| కడప | - | - | - | 4 | 7 | - | - | - | - | 3 | 2 | - | - | 4 | 10 | 11 | - | - | - | - | 5 |
| గుంటూరు | - | - | - | 4 | 4 | 2 | 3 | 2 | 1 | 4 | - | 7 | - | 4 | 31 | 12 | - | - | - | - | 2 |
| కృష్ణా | - | - | - | 4 | 2 | - | 1 | - | 1 | 2 | - | 3 | - | - | 11 | 8 | - | - | - | - | - |
| కర్నూలు | - | 1 | - | 6 | 5 | - | 3 | 1 | - | 2 | 1 | 1 | - | 2 | 24 | 8 | - | - | - | - | 9 |
| తూర్పు గోదావరి | - | 2 | - | 3 | 4 | - | 1 | 3 | - | 8 | 2 | - | - | 2 | 35 | 15 | 1 | - | - | 2 | 10 |
| ప్రకాశం | - | - | - | 7 | 6 | - | 1 | - | 1 | 3 | 2 | 1 | 2 | 6 | 20 | 12 | - | - | - | 1 | 7 |
| శ్రీకాకుళం | | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | |
| పశ్చిమ గోదావరి | - | - | - | 2 | 6 | 3 | 5 | - | 1 | 2 | 3 | 1 | - | 2 | 19 | 8 | - | - | - | - | - |
| నెల్లూరు | - | - | - | 2 | 5 | 1 | - | - | - | 4 | 3 | 1 | 1 | 2 | 20 | 8 | - | - | - | - | 9 |
| విజయనగరం | - | - | - | 5 | 6 | 2 | 2 | 1 | - | 2 | 1 | 2 | - | 1 | 15 | 12 | - | - | - | - | 8 |
| విశాఖపట్నం | - | - | - | 1 | 14 | - | 2 | - | - | 3 | 1 | 2 | - | 2 | 20 | 10 | - | - | - | 7 | - |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **8** | **1** | **47** | **84** | **13** | **24** | **8** | **6** | **42** | **23** | **23** | **27** | **33** | **250** | **107** | **1** | **-** | **-** | **10** | **72** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| కార్టూన్లలో మార్క్స్ | రీయూస్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |
| కొలిమి రవ్వలు | గౌరి లంకేశ్ రచనలు | 150 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |
| మార్క్సిస్టు నిఘంటువు-1 | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 350 |
| మార్క్సిస్టు పదకోశం | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 50 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| మహాత్మా జ్యోతిరావ్ ఫూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

## కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

## డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 203 - June 2018 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/5/2018 ● Postal Regn. No. HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040–66131071 |
| పస్ట్ లక్కీ పాన్ షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| సుధాకర్ బుక్ స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్ | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| భవాని బుక్ స్టాల్ | శివం రోడ్ | 9849836996 |
| శ్రీభవాని బుక్ స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| ఓరియన్ బుక్ స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమాండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలెబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040–23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీలక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| లక్ష్మణ్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| మల్లిఖార్జున్ బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| శరత్ బుక్ స్టాల్ | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్ స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దటూరు | 81210 02112 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao